ADITYA CARES
ADITYA CURES

A PRODUCT FROM
ASWINI

# పంటి నొప్పా?
# చిగుళ్ళ నుండి రక్తమా?
# పిప్పి పన్నా? వదులు పళ్ళా?

## అయితే అందుకోండి అశ్విని వారినుండి అత్యుత్తమ పరిష్కారం
## ఆదిత్య హెర్బల్ టూత్ పౌడర్.

అశ్విని అందిస్తుంది మరో వినూత్న ఉత్పత్తి. అదే ఆదిత్య హెర్బల్ టూత్ పౌడర్. ఇది 5 ఇన్ 1 దంత చికిత్స. అరుదైన మూలికలతో అపురూపంగా తయారు చేసిన ఈ పౌడర్ లో గొప్ప చికిత్సా గుణాలున్నాయి. దంతాలకు కొత్త జీవాన్నిచ్చే లక్షణాలున్నాయి. ఆదిత్య పలురకాల దంత, మరియు చిగుళ్ళ సమస్యలకు చక్కని చికిత్సను అందిస్తుంది. ఇది దంత మూలాలను పటిష్టపరచడమే కాకుండా దంతాలకు శక్తివంతమైన రక్షణను కూడా కల్పిస్తుంది. అంతేకాదు ఇది నోటి దుర్వాసనను పోగొట్టి రోజంతా తాజాగా ఉంచుతుంది. ఉల్లాసంగా ఉండేలా చేస్తుంది. ఈ పౌడర్ వాడిన వారం నుంచి పది రోజులలోపున మంచి గుణం కనిపిస్తుంది. రోజూ వాడితే బాధలను పూర్తిగా తగ్గించి పరిపూర్ణ రక్షణను కల్పిస్తుంది. ఈ ఆదిత్య హెర్బల్ టూత్ పౌడర్ ను మీ సౌకర్యాన్ని బట్టి టూత్ బ్రష్‌తో లేదా వేలితో వాడవచ్చును. ఇక మీరెలాంటి ఇతరత్రా టూత్‌పేస్టులు, టూత్‌పౌడర్లు వాడనవసరం లేదు. అన్నింటికంటే ముఖ్యంగా దంత చికిత్సలకు మీరు పెట్టె ఖర్చు చాలా వరకు ఆదా అవుతుంది.




| మీ ప్రశ్న | మా సమాధానం |
|---|---|
| 1. ఆదిత్య హెర్బల్ టూత్ పౌడర్ ఎలాంటి దంత సమస్యలను సమర్ధవంతంగా పరిష్కరిస్తుంది? | 1. ఇది అన్ని రకాల పంటినొప్పుల నుంచి విముక్తి కలిగిస్తుంది.<br>2. చిగుళ్ళ నుంచి రక్తం కారడాన్ని ఆపుతుంది.<br>3. వదులుగా ఉండే దంతాలను దృఢతరం చేస్తుంది.<br>4. నోటి దుర్వాసనను అరికడుతుంది.<br>5. సిగరెట్స్, గుట్కా మొదలగునవి వాడటంవలన పళ్ళపై పట్టిన గార ను తొలగిస్తుంది. |

- మూడేళ్ళపాటు నిరంతరంగా పరిశోధన
- 3000 మంది పైగా ప్రజలు దీన్ని వాడి చూసారు.
- అందరి అభిప్రాయం- "ఇది అద్భుతంగా పనిచేస్తుంది"

### ఆదిత్య హెర్బల్ టూత్ పౌడర్ ని వాడిన చాలా మందిలో ఒకరు శ్రీ సి. అర్జునరావు IAS గారు, అంటారు...

అశ్విని ఫార్మాస్యూటికల్స్ వారు ఉత్పత్తి చేసే ఆదిత్య హెర్బల్ టూత్ పౌడర్ ను నేను ప్రతిరోజువాడుచున్నాను. ఇది దంతాలను శుభ్రంగా ఉంచడమే కాకుండా దంత వ్యాధులను దరిచేరనివ్వకుండా ఉంచుతోంది. ఇది వాడిన తర్వాత పంటినొప్పి పోవడమే కాకుండా చిన్న చిన్న సమస్యలన్నీ పూర్తిగా పరిష్కారం అయిపోయాయి. ఇది పంటి ఆరోగ్యానికి పరిశుభ్రతకు ఎంతో తక్కువ ఖర్చుతో వచ్చే ఫలప్రదమైన టూత్ పౌడర్.

(C. Arjuna Rao)
Special Chief Secretary to Govt., Health, Medical & F. W. Department.

### జస్టిస్ ఎం.రామ జోయిస్ చీఫ్ జస్టిస్ (రిటైర్డ్) పంజాబ్ & హర్యాన హైకోర్టు. గవర్నర్, జార్ఖండ్ రాష్ట్రం, రాంచి.

తీవ్రమైన పంటినొప్పితో కనీసం అన్నం కూడా తినలేని పరిస్థితి నాది. అయిష్టపూర్వకంగానే జనవరి రెండోవారంలో వదులుగా ఉన్న నా దంతాల్లో చాలా వాటిని పీకేయించి వాటి స్థానంలో కట్టుడు పళ్ళు పెట్టించాలని నేను నిర్ణయించుకున్నాను. అయితే అదృష్టవశాత్తు ఒక కార్యక్రమానికి హాజరయ్యేందుకుగాను నేను జనవరి 12న హైదరాబాదు వెళ్ళాల్సి వచ్చింది. అక్కడ అశ్విని సుబ్బారావుగారిని కలవడం తటస్థించింది. ఆయనతో నా దంతాల సమస్యను గురించి వివరించాను. అప్పుడు ఆయన వారి సరికొత్త ఉత్పత్తి అయిన ఆదిత్య హెర్బల్ టూత్ పౌడర్ ఇచ్చి అది వాడితే పంటినొప్పి పోవడమే కాకుండా పళ్ళు గట్టి పడతాయనీ, ఇక పళ్ళు తీయించాల్సిన అవసరం కూడా రాదని చెప్పారు. అంతే అప్పటినుంచి టూత్ పేస్ట్ జోలికి పోవడం మానేసి ఆదిత్య హెర్బల్ టూత్ పౌడర్ ను వాడటం ప్రారంభించాను. దీని నుంచి ఎంతో గొప్ప ఉపశమనం లభించింది. నొప్పి మటుమాయం కావడమేకాకుండా నేను మునుపటిలా హాయిగా భోజనం చేయగలుగుతున్నాను. ఈ టూత్ పౌడర్ ఔషధవిలువ అంతగొప్పది.

శ్రీశైల, నెంబరు 870 - సి, 5 వ బ్లాకు, రాజాజీనగర్, బెంగుళూరు - 560 010

[M.RAMJOIS] 29-3-2002

50 గ్రాములు రూ.18/- లు మరియు 100 గ్రాములు 34/- లకు మీ దగ్గరలో వున్న అన్ని సూపర్ మార్కెట్స్, మెడికల్, జనరల్ అండ్ కిరాణా షాప్సలలో లభ్యమౌతాయి.

**రూ. 120 లు డి.డి.లేదా యం.ఒ.పంపించండి. 100 గ్రా. 3 బాటిల్స్ పోష్టు ద్వారా పంపుతాము.**

మరిన్ని వివరాలకై దయచేసి సంప్రదించండి. **అశ్విని హోమియో అండ్ ఆయుర్వేదిక్ ప్రొడక్ట్స్ లిమిటెడ్.** మూసాపేట, హైదరాబాదు 500018

SSB002Aditya

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

25

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం







'సెంటర్ స్ప్రెడ్'లో - 'జెమిని' 'నువ్వే నువ్వే' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: 'నువ్వే నువ్వే' లో శ్రేయ




ఇటీవల గుంటూరులో జరిగిన సైక్రియాట్రిస్టుల సమావేశంలో ప్రిజోన్ లేబరీటరీస్ వారు అందజేసిన 'హాసం' కాపీ చదివాను. బిజీ జీవితం గడుపుతూ ఇతరుల వ్యథలను వినడమే వృత్తిగా గల డాక్టర్లను కూడా రిలాక్స్ చేయుగల పత్రిక 'హాసం'. డాక్టర్లనే కాదు డాక్టర్ల లాంజ్‌లో వేచివుండే పేషంట్లు కూడా 'హాసం'లో హాస్య విభాగం వల్ల లబ్ధిపొందగలరని అనిపించగానే 'హాసం' చందాదారు కావాలని నిశ్చయించుకున్నాను.

-డా॥పి.శారద, కన్సల్టెంట్ సైక్రియాట్రిస్టు
ద గవర్నమెంట్ హాస్పటల్ ఫర్ మెంటల్ కేర్,
విశాఖపట్నం

1-15 సెప్టెంబరు 'హాసం' సంచిక బావుంది. వినాయక చవితి సంచికగా వినాయకుడి మీద కార్టూన్లతో కాక, రొటీన్‌కు భిన్నంగా వచ్చిన సంచిక బహుశా ఇదే కావచ్చు. నిజంగా వెరైటీగా వుంది. ఈనాటి నాకు తెలుసున్న పెద్దలు, సాహితీమూర్తుల ఇళ్ళల్లో ఆనాటి "యువ", "జ్యోతి" "ఆంధ్రపత్రిక", "ఆంధ్రజ్యోతి" వారి దీపావళికి, వినాయక చవితికి విడుదల చేసే స్పెషల్సే కాకుండా, వివిధ సందర్భాలలోని విడుదల చేసే ప్రత్యేక సంచికలను ఆప్యాయంగా, గర్వంగా దాచుకుని ఆనందిస్తూ వుంటారు.

ఈ నాటి యువ చదవరుల కోసమే కాకుండా, ఆనాటి వారు ఎదురు చూస్తున్నట్లుగా హాస్య రచనలు, కార్టూన్లు, మరిన్ని సంగతి విశేషాలతో సంవత్సరానికి కనీసం ఒక సంచికనైనా అన్ని పేజీలతో, అంతటి విలువలతో వెలువరించాలని కోరుకుంటున్నాము.

మా తరం వారు కూడా దాచుకుని గర్వపడే భాగ్యాన్ని కలుగజేయమని "హాసం" సంపాదక వర్గాన్ని వేడుకొంటున్నాం.

-ఎస్.ఆర్. మిరియాల, కాకినాడ

'హాసం'లో 'ఇద్దరు మిత్రులు' సినిమానవల మొదలుపెట్టి మమ్మల్ని అనాటి జ్ఞాపకాలలోకి తీసుకుపోయారు. అప్పటి వెండితెర నవలలలో సంభాషణలు ఇచ్చి పుస్తకం మధ్యలో నాలుగైదు పేజీల ఫోటోలు వేసేవారు. ఇప్పుడు టీవీలో సినిమా చూసినా బొమ్మలు కనబడతాయి కానీ డైలాగులు గుర్తు పెట్టుకోవడం వీలుపడదు. మీరు ఎంచుకున్న పద్ధతి వల్ల, అటు డైలాగులు, ఇటు దృశ్యాలు నెమరు వేసుకోగలుగుతున్నాము. మీ ప్రయోగం కొత్తగా, ఇంపుగా ఉంది.

-పి.ఫణిబాల, ధవళేశ్వరం

16-30 సెప్టెంబర్ 'హాసం' ఎన్నో విశిష్ట సంగీతకళాకారులు, నటుల వ్యాసాలతో ఆకట్టుకున్నది. గాన కోకిలయిన "లతా మంగేష్కర్' జన్మదిన సందర్భంగా అందించిన వ్యాసం, పాటలు బాగున్నాయి. అదేవిధంగా విలక్షణ గొంతుగల నటి, గాయని 'నూర్జహాన్' జన్మదిన సందర్భంగా అందించిన వ్యాసం 'అన్‌మోల్‌ఘడీ' మరియు ఇతర కొన్ని చిత్రాల పాటలవ్వడం హర్షణీయం. మా ఫేవరేట్ నటులలో ఒకరైన అక్కినేని నాగేశ్వరరావు పుట్టినరోజు సందర్భంగా అందిస్తున్న సీరియల్ రూపకం - 'ఇద్దరు మిత్రులు' ఆసక్తితో చదివింప జేసింది. అదే విధంగా హాస్యనటుడయిన పద్మనాభం 'ఆత్మకథ' కూడా ఇంట్రెస్ట్‌తో కొన సాగింది.

-ఎం.డి.ముస్తఖీమ్, కొల్లాపూర్

మీ 'హాసం' పత్రిక ఒక సంవత్సరము నుంచి కొని చదువుతున్నాను. సంచిక సంచికకు పురోభివృద్ధి కనబడుతున్నది. గాయకులు, సంగీత దర్శకులు గురించి మాకు తెలియని చాలా విషయాలు తెలియజేసారు. చాలా థాంక్స్. అలాగే మెయిన్ ఇన్‌స్ట్రుమెంటల్ ఆర్టిస్టుల గురించి కూడా పరిచయం చెయ్యాలని కోరుతున్నాను.

-ఈశ్వర రఘు, శ్రీకాకుళం

హాస్య సంగీత శీర్షికలతో నిర్వహిస్తున్న మీ పత్రికను అక్టోబరు 2001 నుండి చూస్తున్నాను. నిజంగా 'హాసం' ఒక గొప్ప పత్రిక.

తెలుగులో గత 50 సం॥గా వచ్చిన పత్రికలన్ని నాకు తెలుసు. రూపవాణి దగ్గర నుండి ఈ రోజు వరకు ఎన్నో పత్రికలు వచ్చినవి. అందులో క్రోక్విల్, హాస్యప్రియ, 'విజయ'లో సప్లిమెంట్ లాంటివి తప్పితే హాస్యానికి పెద్దపీట వేసినవి తక్కువ. అయితే 'జ్యోతి'తో కొంత ఊరట కలిగినా అది ఎంతోకాలం నిలవలేదు. ముఖలో పుట్టి పుబ్బలో పోతున్న ఈ రోజులలో సంగీత, హాస్యాలతో ఒక పత్రిక అందరి మన్ననలందు కుంటూ, అన్ని వయసుల వారిని ఆకర్షిస్తుందంటే చాలా గొప్ప విషయం. 'హాసం'కు నా జన్మదిన శుభాకాంక్షలు.

-జి.సత్యాపతి, విజయవాడ

వరుసగా రెండు సంచికల నుండి నన్ను నిరాశ పరుస్తున్నారు. 23వ సంచికలో, ఎంతో ఇష్టంతో ఎదురుచూసే 'ఆపాతమధురం' 'మీ పద సంపద' ప్రచురించపోవడం, 24వ సంచికలో పై రెండూ అందించి 'చౌ చౌ చౌరస్తా' 'పేరడీపేరేడ్' శీర్షిక లేకుండా చేయడం. ఎన్ని సాంకేతిక కారణాలు ఉన్నా పై శీర్షికలు ఆపకండి. నేను నా మిత్రులు చదివి ఆనందించేవి, మళ్ళీ పక్షం రోజుల వరకు, మాట్లాడుకొనేవి ఇటువంటి శీర్షికల గురించేనని మనవి. మిగిలిన శీర్షికలు మేధావుల కోసం కేటాయించి వాళ్ళని తృప్తిపరచండి. పత్రిక ముఖ చిత్రం ఆకర్షణీయంగానూ ఖర్చుతో కూడుకున్నదిగాను ఉంటున్నది. నా అభిమాన నటుడు శ్రీ అక్కినేని గారి తైలవర్ణచిత్రం సింప్లీసూపర్బ్. ఏ సంవత్సరంలో చిత్రించినదో వేసివుంటే ఇంకా బాగుండేది. సదా మీ ఉన్నతిని కోరే అభిమాని హాస్యాభివందనములతో,

-ఎం.మస్తాన్‌రెడ్డి, పూనే

అ "ద్వితీయ" సంవత్సరంలోనికి అడుగిడుతున్న 'హాసం' పత్రికకు హార్దిక శుభాకాంక్షలు పలుకుతూ అంకిత ముఖ చిత్రంతో వెలువడిన "హాసం" 24వ సంచికతో ఎడిటోరియల్‌లో మీరురాసిన భావాలకు నా ప్రతి స్పందన ఇది.

"హాసం" తొలి సంచికలో శ్రీ పరుచూరి గోపాలకృష్ణ గారి కథపై అభిప్రాయ పోటీలో తొలి విజేతనైన నేను "హాసం" పత్రిక గురించి గర్వంగా ఫీలవుతున్నాను. హాసాన్ని అందరికీ పరిచయం చేయడాన్ని హాస్యాభిమానులతో ఒక ఉద్యమంగా స్వీకరించాలి. నేనదే చేస్తున్నాను.

-యన్.కె.నాగేశ్వరరావు,
పెనుగొండ

సంపుటి : 2 సంచిక: 1

1- 15 అక్టోబరు 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200


The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 25


మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ



HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215
email: haasammag@hotmail.com



Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82


ఏడాది క్రితం 'హాసం' మొదలు పెట్టినప్పుడు సాధారణ పాఠకులకే కాదు, పత్రికా రంగంలో ఉన్న వారిని కూడా ఒక పెద్ద సందేహం బాధించింది. కేవలం రెండు సబ్జక్ట్‌లతో 'హాసం' సైజు పక్షపత్రిక నడపడం సాధ్యమా? అని. రెండవ సంచిక సంపాదకీయంలోనే మేము హామీ ఇవ్వవలసి వచ్చింది. వినేవారుంటే చెప్పేందుకు బోల్డు విషయాలు విశేషాలు ఉంటాయి అని!

అయినా సందేహనివృత్తి కానివారిని ఈ సంచికలోపలి పేజీలలో కనబడే 'అల్బమ్' చూడమని కోరుతున్నాం. గత 24 సంచికలలో 'హాసం' స్పృశించిన, తెలియపరిచిన, చర్చించిన సంగతులు గురించి, వ్యక్తుల గురించి, ఒక జాబితా తయారుచేద్దామని కూచున్నప్పుడు - రెగ్యులర్ శీర్షికలైన చౌచౌచౌరస్తా, హ్యూమర్‌బాక్స్, స్ట్రిప్స్, బాక్స్ ఐటమ్స్, జస్ట్ ఫర్ ఫన్, కార్టూన్ల వంటివి చేర్చకపోయినా - అది మేము అనుకున్నదానికంటె దీర్ఘంగా సాగింది.

ఇలా పాతసంచికల వివరాలు ఇచ్చే సాంప్రదాయం ఎకడమిక్ జర్నల్స్‌లో తప్ప మామూలు పత్రికలలో కనబడదు. ప్రిజర్వేటివ్ వాల్యూ ఉన్న పత్రికగా పేరు తెచ్చుకున్న 'హాసం'కు ఈ జాబితా ప్రచురణ అత్యవసరం అయింది. ఇటీవలే 'హాసం' పరిచయమయినవారు "అంతా బాగానే ఉంది కానీ హిందీ పాటల ప్రచారంలో అమీన్ సయానీ పాత్ర గురించి రాయకపోవడం బాగాలేదు" అనో, "సూర్యకాంతం వంటి నటి ఉందటండీ, ఆవిడ గురించి రాయకుండా తక్కిన వారెంతమంది గురించి రాసినా వేస్టు" అనో వ్యాఖ్యానించే వారందరికీ 'తొలిసంచికలలోనే కవర్ చేశామండీ' అని చెప్పుకొచ్చే శ్రమ ఈ జాబితా వల్ల తప్పుతుందని ఆశ.

అల్బమ్ పేజీలు తిరగవేస్తూ చూసుకుంటూ ఉంటే, ఓ సాధారణ తెలుగు పాఠకుడు ఇతర పత్రికలలో చదవలేని అనేక విశేషాలు, సమాచారం 'హాసం'లో పొందువరచగలిగామని అనిపించింది. ముఖ్యంగా తెలుగేతర వ్యక్తుల గురించి, వారి కృషి గురించి మనం చర్చించుకోవడం తక్కువ. పాతతరం వారి గురించి ఈనాటి పత్రికలు పట్టించుకోవడం మరీ తక్కువ. ఈ తరం కళాకారుల కృషిని పాఠకులకు అందిస్తూనే గతించినవారు మన స్మృతి పథంలో నుండి తొలగిపోకుండా వారి విశిష్టతను చాటి చెప్పడంలో 'హాసం' కృషి విస్మరించరానిదని జాబితా తెలియజేస్తోందనిపించింది. రచయితలు, వ్యాసకర్తల పేర్లు చూడబోతే లబ్ధప్రతిష్ఠులెందరో 'హాసం'పై వాత్సల్యం, అనురాగం కురిపించారని గమనించవచ్చు. వారితో పాటు కొత్త వారి పేర్లూ కనబడటం మీ దృష్టికి రావచ్చు.

అయిదు పేజీల జాబితా ముందు పెట్టుకుని చూసుకుంటే ఓ విధమైన తృప్తితో బాటు కాస్త అసంతృప్తి కూడా కలుగుతోంది. ఇంకా ఎందరో మహానుభావులున్నారు. హాస్యంలో, సంగీతంలో రకరకాల ప్రక్రియల ద్వారా రససిద్ధి సాధించిన నిష్ణాతులయిన వారున్నారు. వారి పేర్లు కనరావేం? అనిపిస్తోంది - స్థలాభావం సంగతి ఓ పక్క తెలిసుండి కూడా! అంతలోనే ఓదార్పు - ఇంకా బోల్డు సమయం ఉంది. అనేక సందర్భాలున్నాయి. 'హాసం' అభిమానులు వెన్నుదన్నుగా నిలబడితే పలు కాలాల పాటు ఈ ప్రయాణం కొనసాగుతూనే ఉంటుంది. ఇంకా ఇంకా... అనేక రకాలుగా.. అనేక సందర్భాలున్నాయి. పలు సంగతులును.... పలు రకాలుగా... పరిచయం చేస్తూ... వివరిస్తూ... విశ్లేషిస్తూ... అనంతంగా సాగుతూ....



**ఆ రోజు మధ్యాహ్నం ఫ్యాక్టరీలో ఉండగా గుర్తుకొచ్చింది రాజాకు - మర్నాడే అతని భార్య సావిత్రి పుట్టిన రోజని. అంతే! అప్పటినుంచి పనిలో మనసు లగ్నం కాలేదు. నెర్వస్‌గా ఫీలవడం మొదలు పెట్టేడు. ఎంత నిబ్బరించుకున్నా అతని ఆలోచనలు ఆ సమస్య చుట్టూనే తిరగసాగాయి.**

# భార్య పుట్టిన రోజు

-ఎమ్బీయస్ ప్రసాద్

తన పుట్టిన రోజే తనకి గుర్తుండదు. ఇప్పుడు పని ఒత్తిడి వల్ల అని కాదు, చిన్నప్పటినుంచి అంతే. అసలా పుట్టిన్రోజు ఎప్పుడో సరిగా తెలీదు. తిథుల లెక్కప్రకారమే అమ్మ చేసేది. తిథులు ఇంగ్లీషు తేదీల్లా వరసగా వచ్చిచావవు. అవన్నీ అమ్మకే తెలియాలి. 'ఇవాళ నీ పుట్టిన్రోజురే' అని ఓ రోజు తలంటు పోసి మైసూర్‌పాక్ చేసి పెట్టేది. పండగకు కుట్టించిన బట్టలు సాయంత్రం వేసుకుని మళ్లీ జాగ్రత్తగా మడిచి పెట్టేయమనేది. కాస్త మీసాలు మొలవగానే తను తలంటు పోసుకోడానికి రలాయించడంతో ఆవిడకి చికాకేసి 'నీ మొహానికి పుట్టినరోజొకటి' అని మానేసింది. ఇప్పట్లోలా ఆ రోజుల్లో తల్లిదండ్రులు కేకుల కోతలు, పార్టీల మోతలూ ఏర్పాటు చేసేవారు కారు మరి!

పోనీ స్కూల్లో వేసిన తారీకు ప్రకారం చూద్దామంటే అది ఎకడమిక్ సంవత్సరం వృథా కాకుండా నాన్నగారు కిట్టించి వేసిన తేదీ. అప్లికేషన్లో నింపడానికి తప్ప మరెందుకు పనికిరాదు. అందువల్ల దాని గురించి పట్టించుకోవడం మానేసాడు తను.

కానీ సావిత్రి ఫిలాసఫీ వేరేలా వున్నట్టుంది. పెళ్లయి కాపురానికి వస్తూనే పంచాంగం తిరగేసింది. "మీ ఇంగ్లీషు పుట్టిన రోజు, తెలుగు పుట్టినరోజు, నా ఇంగ్లీషు పుట్టినరోజు, తెలుగు పుట్టిన రోజు - అన్నీ ఇంచుమించు ఒకే నెలలో వచ్చేయి సుమండీ" అంటూ మురిసిపోయింది. అందులో అంత మురవాల్సింది ఏముందో తనకు తెలియలేదు. పైగా రేడియోలో క్రికెట్ కామెంటరీ సరిగ్గా వినబడి చావటం లేదు. "ఓహో, అలాగా, బలే, బలే" అన్నాడు తను వినీ వినిపించు కోకుండా. సావిత్రి అదోలా చూసింది.

పెళ్లయిన కొత్తల్లోనే వచ్చిన ఆమె పుట్టిన రోజుకి తనేదో హడావుడి చేస్తానని ఎదురు చూసినట్టుంది పాపం. తనకి గుర్తే లేదు. రోజంతా ఓపిక పట్టింది, ఎప్పటికైనా తనకి గుర్తొస్తుందే మోనని. ఊహుఁ తనకి ఆ ధ్యాసే లేదు. మర్నాడు ఫ్యాక్టరీకి వెళుతున్న టైములో ఇంక ఉండబట్టలేక పోయినట్టుంది. అడిగేసింది - "ఏమండీ, నిన్న నా పుట్టినరోజు గుర్తే లేదా? కనీసం 'గ్రీట్' కూడా చెయ్యలేదు" అని.

తనేమనగలడు? నిజం అదే. చెప్తే బాధ పడుతుంది. కొత్త భార్యకు ఆ మాత్రం ముచ్చట ఉండడంలో తప్పులేదు కానీ తనకి ఇవన్నీ గుర్తుండి చావవు. ఎలాగోలా కమ్ముకోకపోతే లాభం లేదు - "భలేదానివి! నువ్వు ఇంగ్లీషు లెక్కల ప్రకారం చేసుకుంటావనుకోలేదు. తిథుల ప్రకారం రెండు మూడు రోజుల్లో వస్తుంది కదాని చీర కొని దాచిపెడితే నువ్వు ఇలా అంటావే..." అని దబాయించబోయాడు తనకు తిథి ఎప్పుడో తెలియకపోయినా.

సావిత్రి మొహంలో వెలుగు కనబడింది. "నిజంగానా? చీరేది, చూపించండి" అని ఆతృతగా అడిగింది.

"ఆఫీసులో పెట్టాను. ఇంట్లో పెడితే నీ కంటబడి 'సర్‌ప్రైజ్ ఎలిమెంట్' పోతుందని...."

"అయితే ఇవాళ తీసుకురండి. కట్టుకుని గుడికి వెళదాం" అంది.

తనా సాయంత్రం ఫ్యాక్టరీ నుంచి వచ్చేటప్పుడు గుర్తు పెట్టుకుని చీర కొన్నాడు. చేసిన పొరబాటుకి ప్రాయశ్చిత్తంగా అనుకున్న దానికంటే ఎక్కువ పెట్టి కొన్నాడు. చీర పాకెట్టు అందుకుని "నిజంగానే కొన్నారన్న మాట!" అంది సావిత్రి ఆనందాశ్చర్యాలతో.

"మరేమిటనుకున్నావ్! నీ పుట్టిన రోజు బహుమతి కదా" అన్నాడు తను 'గ్రాండ్'గా.

"పుట్టినరోజు ఎక్కడుంది లెండి, నిన్ననే అయిపోయిందిగా"

"తిథుల ప్రకారం ఇంకా ఉందిగా".

"అది అంతకు ముందే అయిపోయింది. అది గుర్తు పెట్టుకోవడం కష్టం కదా, ఇంగ్లీషు కేలండరు ప్రకారమైనా గుర్తు పెట్టుకుని అవాళ సెలబ్రేట్ చేస్తారనుకొని ఆనాడు ఊరుకొన్నాను. మీరేదో హడావుడి చేస్తారేమో, 'ఎందుకండీ ఇవన్నీ' అని అందామనుకున్నాను. చూడబోతే మీకు భార్యంటేనే ఖాతరు లేకపోయే..." అంది బుంగ మూతి పెట్టి. 'అమ్మదొంగా, రెండు పుట్టిన రోజులు అయిపోయిన విషయం చీర కొనడానికి ముందు చెప్పలేదు చూసావా' అని తను అనుకుంటూ ఉండగానే సావిత్రి పాకెట్ విప్పి చీర చూసింది.

"చీర బాగానే వుంది కానీ, నాకున్న రంగే తెచ్చారేం?" అంది చటుక్కున.

"భలే దానివి, అది వేరే డిజైన్, ఇది వేరే డిజైన్ కదా" అనేసాడు తను, ఆ 'అది' ఏదీ గుర్తులేక పోయినా.



"అలా కాదులెండి. రెండూ కొద్దికొద్దిగా కలుస్తాయి. రేపెల్లి షాపులో మార్చేస్తా. బిల్లు ఇచ్చి వెళ్లండి" అంది సావిత్రి.

బిల్లు ఎక్కడుంది? అది చూస్తే ఆ వేళే కొన్నట్టు తెలిసి పోతుందని చింపి పారేశాడు. బిల్లు ఆఫీసులో ఉందని ఆవేళ అబద్ధం చెప్పి తప్పించుకున్నాడు. మర్నాడు ఫైళ్లలో కలిసిపోయిందన్నాడు, తర్వాత వర్షంలో తడిసిపోతే ఎండబెట్టానన్నాడు. చివరికి పర్సులో పెడితే ఎవడో పర్సు కొట్టేసాడని చెప్పేసాడు. ఇదొక వారం సాగింది. ఈ లోపున ఆగలేక సావిత్రి చీర కట్టుకుని తిరగేయడం, పాతదాని కంటే ఇదే బాగుందనిపించి మనసు మార్చుకోవటం జరిగి పోయాయి. ఆ విధంగా ఆ ఏడాది గండం గట్టెక్కింది.

క్రమక్రమంగా సావిత్రికి అర్థమయినట్లుంది - తనకి ఆమె పుట్టినరోజు బొత్తిగా గుర్తులేదని. చూసి, చూసి తీరిక చూసుకుని ఓ ఆదివారం మధ్యాహ్నం పోట్లాట వేసుకోబోయింది-

"అసలు మీరిలా పుట్టినరోజు మర్చిపోవడం ఏవిటి, నాకు తెలీక అడుగుతాను".

"నీదే కాదుగా, నాదీ నాకు గుర్తుండదు"

"అదే అడుగుతున్నాను. ఎందుకని..."

"మనమేమైనా జాతీయ నాయకులమా, మన పుట్టినరోజు జరుపుకోవడానికి. నేను పుట్టి ఏం సాధించానని పుట్టిన్రోజు వేడుకలు జరుపుకోవాలి?"

"నన్ను పెళ్లాడారు, అది చాలదూ...." అంటూ లేచ్చక్కాపోయింది విసుక్కుంటూ.

ఆ తరువాత సంవత్సరం పుట్టినరోజుల సీజన్ వచ్చే ముందే సావిత్రి పునాది వేయడం మొదలెట్టింది -

"మీ పుట్టినరోజుకి నేను ఓ బహుమతి కొందామనుకుంటున్నాను. మరి నా పుట్టినరోజుకి మీరేం కొంటారు?"

ఓహో పుట్టినరోజులు దగ్గరలోనే వున్నాయన్న మాట అనుకుని 'ఆ బహుమతి ఏమిటి' అడిగాడు తను.

"మీరు నాకిచ్చేదేమిటో ముందు చెప్తే, అది చెప్తా"

"బావుంది, బహుమతులు కొనడానికి నా దగ్గిర డబ్బేం మిగిలింది? అంతా ఇంట్లో ఇచ్చేస్తున్నానుగా".

"అంతా ఎక్కడ? పాకెట్ మనీ అని తీసుకుంటున్నారుగా".

"సిగ్గులేకపోతే సరి. సిగరెట్లు తగ్గించండి అంటూ పాకెట్ మనీ సగానికి సగం తగ్గించేసావు. పైగా అందులో మిగల్లేదా అంటూ ఆరాలొకటి..."

"పెళ్లానికి చీర కొనాలంటే చాలు, ఎక్కడలేని ఖర్చులు గుర్తొచ్చేస్తాయి"

"నా సంగతి సరే, నాకు బహుమతి కొనడానికి నీకు డబ్బులెలా వచ్చాయి?"

"ఇంటి ఖర్చులో మిగిల్చా"

"గొప్పగా ఉంది. ఇంటికోసం ఇచ్చినది మిగిలితే అది ఇంటి డబ్బే అవుతుంది కానీ నీదెలా అవుతుంది?"

"మీతో కబుర్లేసు క్కూచోడానికి నాకు తీరిక లేదు. వంటింట్లో చచ్చేటంత పని ఉంది" అంటూ వెళ్లిపోయింది సావిత్రి.

ఎందుకైనా మంచిదని తను ఓ చీర కొనిపెట్టి ఇంట్లోనే ఉంచాడు. సావిత్రి అది చూసి ఉండవచ్చు కానీ చెప్పలేదు. చీర ఇచ్చినప్పుడు ఆశ్చర్యపడి, తనను ఆనందపెడదామనుకొందేమో. ఆ రోజు రాత్రి 'రేపు పెందరాళే లేవాలి, తలంటు పోసుకోవాలి. పుట్టినరోజు కదా' అని సావిత్రి జనాంతికంగా హెచ్చరించినప్పుడు తను గట్టిగా గుర్తు పెట్టుకున్నాడు. కానీ ఖర్మం కాలి పొద్దున లేస్తూండగానే రాష్ట్ర ప్రభుత్వం కూలిపోయినట్లు వార్త చెప్పింది రేడియో. ఇక దానికి అతుక్కుపోయాడు. ఇంట్లో పేపరే కాదు పక్కవాళ్ల పేపరు కూడా తెచ్చి ప్రభుత్వ పతనానికి కారణాలు తెలుసుకున్నాడు. కానీ సావిత్రి ముఖం అదోలా ఉండడానికి మాత్రం కారణం తెలుసుకోలేక పోయాడు.



'తలనెప్పా?' అని అడిగి చూసాడు. కాదంది. ప్రభుత్వ పతనం గురించి తన విశ్లేషించి చెప్తున్నప్పుడు పెద్ద ఆసక్తి చూపలేదు. అది మామూలేలే అనుకుని ఊరుకున్నాడు. సాయంత్రం సావిత్రి అలక పాన్పు వేసేదాకా తనకు గుర్తురాలేదు. అతి కష్టం మీద అలక తీర్చగలిగేడు. ఆమె చల్లారేక సరదాగా అన్నట్టే "ఎందుకొచ్చిన బాదరబందీ ఇదంతా? హాయిగా ఇద్దరిదీ సెలబ్రేట్ చేసుకోవడం మానేస్తే పోలా?" అని చూసాడు.

"చాల్లెండి జీవితం అన్నాక సరదాలు ఉండకపోతే ఎలా?'' అని సావిత్రి ముద్దుముద్దుగానే చివాట్లేసింది. ఈ అలకలూ, టెన్షన్లు ఏం సరదాయో తనకు అర్థం కాదు.

ఈ ఏడాదైనా రెడీగా ఉండాలని, ఆ మధ్య డిస్కౌంటు సేల్స్‌లో రెండు చీరలు కొని పడేసాడు. ఒకటి ఆఫీసులోనూ, ఒకటి ఇంట్లోనూ పెట్టాడు. ఏ టైములో గుర్తొచ్చినా ఫర్వాలేదని. అదృష్టవశాత్తూ రేపు పుట్టిన్రోజు అనగా ఇవాళే గుర్తొచ్చింది. రేపటికి దాకా గుర్తు ఇలాగే ఉండాలిరా దేవుడా' అనుకున్నాడు రాజా.

సాయంత్రం అయ్యేటప్పటికి అతనికి ఒక ఐడియా తట్టింది. ఆవాళ రాత్రే కాస్త ఎక్కువ

సేపు మేలుకొని రాత్రి పన్నెండు గంటలు కాగానే తారీకు మారుతుంది. కాబట్టి 'గ్రీట్' చేసే పడుక్కుంటే సరి, పొద్దునే పేపర్లో ఏదైనా వార్త వచ్చి మైండ్ డైవర్ట్ అయినా భయం ఉండదు అనుకున్నాడు.

రాత్రి భార్యతో ఆ కబురు, ఈ కబురు చెప్తూ కూచున్నాడు కానీ తెగ ఆవలింతలు వస్తున్నాయి. పన్నెండు దాకా నిద్ర ఆపుకోవాలంటే టీవీ వేస్తే మంచిది అనుకొని ఆన్ చేస్తే ఏదో హారర్ సినిమా వస్తోంది. 'హమ్మయ్య' అనుకొని దాని ఎదురుగా కూచున్నాడు. సినిమా మంచి పట్టుగా ఉంది. మధ్యలో సావిత్రి ఎప్పుడు లేచి వెళ్లి పడుక్కుందో అతను గమనించలేదు. సినిమా ఒంటి గంటన్నరకు పూర్తయింది. సావిత్రి పక్కమీద గాఢ నిద్రలో ఉంది. లేపి 'గ్రీట్' చేద్దామనుకొని అనుకొంటూనే కాస్త ఆగాడు. సావిత్రి గడుసుది. 'రేపొద్దున్న గుర్తుండదని ఇప్పుడు అర్జంటుగా నిద్రలేపి చెప్పేస్తున్నారా?' అంటుంది. 'ఎలాగోలా కష్టపడి గుర్తు పెట్టుకుని రేపు పొద్దున్న చెబితే సరి" అనుకున్నాడు.

రాత్రంతా రాజాకు ఒకటే పీడకలలు. - 'తను మళ్లీ మర్చిపోయినట్లు, ఆమె అలిగినట్లు' ఆమె మర్చిపోయినట్లు, తాను అలిగినట్టు, తనూ, ఆమె ఇద్దరూ మర్చిపోయి ఇద్దరు అలిగినట్లు...'

కాలింగ్ బెల్ హడావుడిగా మోగడంతో రాజాకు మెలకువ వచ్చింది. పొద్దున ఎనిమిదయింది. సావిత్రి బాత్‌రూమ్‌లోంచి అరుస్తోంది - 'ఎవరో వచ్చారు, చూడండి అంటూ'.

వచ్చినది ఫ్యాక్టరీ ఫోర్మన్. వర్కరొకతనికి ఏక్సిడెంటు అయిందట. జనరల్ మేనేజరు గారు వెంటనే వచ్చి అంబులెన్స్ ఏర్పాట్లు చూడమన్నారట. రాజా ఆదరాబాదరాగా పరిగెట్టుకుని వెళ్ళిపోయాడు - సావిత్రి ఇంకా బయటకు రాకుండానే, 'తలుపేసుకో' అని కేక మాత్రం పెట్టాడు.

నాలుగు గంటల తర్వాత వర్కరుకి ఆపరేషన్ బాగానే జరిగిందని తెలిసాకనే రాజాకి మనసు కుదుట బడింది. అంతలోనే అల్లకల్లోలమయింది. సావిత్రి పుట్టినరోజు విషయం గుర్తొచ్చి ఎంత జాగ్రత్తగా ఉన్నా పొరబాటు జరిగింది కదాని నాలిక్కరుచుకున్నాడు. హాస్పటల్ నుండే ఇంటి పక్కవాళ్లకు ఫోన్ చేసి సావిత్రిని పిలవమన్నాడు.

"విష్ యూ హేపీ బర్త్ డే" అన్నాడు హలో వినబడగానే.

"ఎందుకూ?"

"హల్లో సావిత్రి కావాలండి, మీ ఇంటి పక్క వాటాలో..."

"అబ్బ, నేను సావిత్రినేనండి. బర్త్‌డే గ్రీటింగ్స్ ఎవరికని అడుగుతున్నాను..."

"అయాం సారీ సావిత్రీ, కోసం వచ్చిందనుకుంటాను. మార్నింగ్ గ్రీట్ చేద్దామనుకున్నాను. కానీ, యూ నో, పొద్దున హడావుడి తెలుసుగా, పాపం, వర్కర్ ప్రాణాల మీదకి వచ్చింది".

".... అయితే ఇవాళ నా పుట్టిన రోజని మీకు గుర్తుందంటారు. తెలుగు లెక్క ప్రకారమా? ఇంగ్లీషు లెక్కా? చెప్పండి చూద్దాం"

"డోంట్ బీ సిల్లీ, ఇంగ్లీషు డేట్స్ ప్రకారమే".

"ఏడిసినట్టుంది. ఖర్మం కొద్దీ దొరికాడు వెర్రి మొగుడని. అయ్యా మహానుభావా, ఇవాళ పుట్టినరోజు నాది కాదు, తమది. పొద్దున పాయసం అదీ వండాను. గ్రీటింగ్స్ చెప్దామంటే పక్కమీద నుంచే ఫ్యాక్టరీకి పరిగెట్టారు. త్వరగా ఇంటికి రండి. సినిమాకి వెళదాం. బై దివే మెనీ హేపీ రిటర్న్స్ ఆఫ్ ది డే" అంటూ ఫోన్ పెట్టేసి తలచుకొని, తలచుకొని పడి పడి నవ్వింది సావిత్రి.

## మహామేధావి రాంబాబు!






**నండూరి పార్థసారథిగారు సృష్టించిన విలక్షణ హాస్యపాత్ర రాంబాబు! రాంబాబు ఓ 20 ఏళ్ల కాలేజీ కుర్రవాడు. 'సుజనమిత్ర' అనే లార్జెస్ట్ సర్కులేటెడ్ డెయిలీ ఫ్రమ్ చింతల్‌బస్తీ (సర్కులేషన్ 2 వేల కాపీలు)లో పార్ట్‌టైము ఉద్యోగం. తన అరకొర తెలివితేటలతోనే తను మహామేధావిననుకుంటాడు రాంబాబు. ఇంగ్లీషు, తెలుగు సరిగా రాక కొంత, 'స్వేచ్ఛా'నువాదాల వల్ల కొంత, కుతర్కం వల్ల కొంత, అమాయకత్వం, అజ్ఞానం, అతితెలివి వల్ల కొంత - రకరకాలుగా తనకు తెలియకుండానే బోలెడంత హాస్యాన్ని పంచాడు రాంబాబు.'రాంబాబు డైరీ' (రెండవభాగం)లో కుతర్కంకు కొన్ని ఉదాహరణలు:**

★ కాపీరైట్ అన్నారు గాని కాపీ రాంగ్ అనలేదు. కాపీ రాంగ్ అనేది డిష్నరీలోను లేదు. కావాలంటే ఏ డిష్నరీ ఐనా వెతుక్కో. కాపీ రైట్ అని డిష్నరీలన్నీ ఘోషిస్తున్నాయి.

★ చెప్పే పాఠం మీద లెక్చరర్‌కే కాన్‌సన్‌ట్రేషన్ లేకపోతే నాలాంటి కుర్రసన్నాసులకి వుంటుందా? పాఠం చెబుతున్నంత సేపు ఆయన కాన్‌సన్‌ట్రేషన్ నా జంతికల మీదే.

★ సబెడిటర్ రాసేది ఎడిటోరియల్ ఎలా అవుతుంది? అందుకే సబెడిటోరియల్ రాసి యిచ్చాను.

★ 'సినిమాలో అస్సలు బొత్తిగా డ్రామా లేదోయ్' అన్నాడు సారథి. "మీ మాటలకేమైనా అర్థం వుందా? సినిమా సినిమాలాగా, డ్రామా డ్రామా లాగా వుంటాయి. వుండాలి. అంతేగాని సినిమాలో డ్రామా, డ్రామాలో సినిమా వుంటాయా ఎక్కడైనా? 'సినిమాలో సినిమాటిక్ ఎలిమెంట్ వుంటుంది గాని డ్రమటిక్ ఎలిమెంట్ ఎందుకుంటుందోయ్? డ్రామా లాగా వుంటే వుందని విమర్శిస్తావు. లేకపోతే లేదని విమర్శిస్తావు" అని వాదించాను.



★"ఆడవాళ్ళ డ్రస్సుల కటింగ్, స్టైలింగే వేరు. అసలు బటన్సు చూస్తేనే తెలిసిపోతుంది తేడా" అంది వరలక్ష్మి.

★"బటన్సులో కూడా ఆడా మగా అని రెండువెరైటీ లుంటాయా? అన్నీ ప్లాస్టిక్కువే కదా! ఈ బటన్సు ఎప్పుడైనాతెగి పోతే మగ బటన్లు కుట్టితే అవి పని చేయవా? ఆడ బటన్లే కుట్టాలా వాటికి? ఆడ బటన్లు మగ షర్టులకి పట్టవా?" అన్నాను.

★ ఏదీ స్త్రీత్వమో, ఏది పురుషత్వమో నాకు తెలిసి చావలేదు. ఆడసెంటు మగవాళ్లు రాసుకుంటే ఆడంగి వాసన కొడతారా? మగసెంటు ఆడవాళ్లు రాసుకుంటే మగవాసన కొడతారా? ఏమిటో.... అంతా విడ్డూరం! ఈ వెధవ ఫాషన్లు, మోజులు అన్నీ అమెరికా వాడే ప్రపంచమంతటికీ నేర్పి పెట్టాడు.

★ "నాలుగు రోజుల్నించి తిండిలేదు" అన్నాడు ముష్టివాడు. "నాలుగురోజుల్నించి తిండి లేకపోయినా ఇంకా ఎలా లేచి తిరుగుతున్నావయ్యా" అని అడిగాను.

(- వచ్చే సంచికలో మరికొన్ని)

సీరియల్

6

# మా మామయ్య ఘంటసాల కథ

-శ్రీమతి ఘంటసాల సావిత్రి

మొదటి భాగం రికార్డయిన తరువాత కొన్ని పాటలు పాడారు. ఆ తరువాత రెండో భాగం కంపోజింగ్ మొదలు పెట్టారు. ఇందులో రాగాలు చాలా కష్టమైనవి. అప్పుడు నేను 'మొదటి పార్టు చాలా బాగా వచ్చింది. ఈ రెండో భాగం మొదటి పార్టంత బాగా రాలేదు. అదేమిటో కొంచెం కఠినంగా వుంది. మాటలు కఠినంగా వున్నాయి. ట్యూను కూడా మొదటి పార్టంత ఫ్లోగా రాలేదు. ఇది బాగుండలేదు'' అన్నాను. దానికి ఆయన "లేదులే. ఇందులో విశ్వరూపదర్శనం అవీ వున్నాయి కదా. బాగుంటుంది. మామూలుగా లైట్‌గా చేస్తే బాగుండదు'' అన్నారు. చివరికి వచ్చేటప్పటికి ఒక శ్లోకం తక్కువ అయింది. అప్పుడు మావయ్య మా పిల్లలని, సంగీతరావు గారి పిల్లలని తీసుకువెళ్లి "అసతోమా సద్గమయ" అని పిల్లలందరి చేతా పాడించి రికార్డు చేయించారు.

జనంలోంచి ఈ భగవద్గీతకు ఎలాంటి రెస్పాన్స్ వస్తుంది. అని ఆతృత ఎక్కువగా అయింది. రికార్డు విడుదల కాలేదు. మొదటి పార్టన్నా రిలీజ్ చెయ్యమని మేమంటే రెండు పార్టు కలిపి రిలీజ్ చేస్తామని గ్రామఫోన్ కంపెనీ వాళ్లు అన్నారు.

భగవద్గీత పాడేముందు జనం ఎలా స్పందిస్తారు అని అనుకుంటూ వుండేవారు. అందుకని కంచి కామకోటి పీఠాధిపతి దగ్గరకు మేమిద్దరం వెళ్లాం. పెద్దాయన దగ్గరకు వెళ్లి నమస్కారం చేశాము. "ఎందుకు నాయనా వచ్చావు? ఏమిటి పనిమీద వచ్చావా? ఏదన్నా అడగటానికి వచ్చావా? ఏమిటి విషయం?" అని అడిగారు. అందుకు మామయ్య "నేను భగవద్గీత రికార్డు చేద్దామనుకుంటున్నాను'' అన్నారు. "చాలామంచి పని చేస్తున్నావు. ఏ శ్లోకం నుంచి మొదలు పెడుతున్నారు'' అని అడిగారు "పార్థాయ ప్రతి బోధితాం'' అన్న శ్లోకంతో మొదలు పెట్టి అన్ని అధ్యాయాలలో నుంచి కొన్ని శ్లోకాలు తీసుకుని మొత్తం 108 శ్లోకాలు పాడుదామనుకుంటున్నాను'' అన్నారు. "తప్పకుండా యిది చాలా ప్రజాదరణ పొందుతుంది. నువ్వు చాలా మంచిపని చేస్తున్నావు. నీ జన్మ చరితార్థం అవుతుంది నాయనా. నువ్వు తప్పకుండా చెయ్యి. జనం చాలా మెచ్చుకుంటారు. ఇంటింటా ఈ భగవద్గీత వినిపిస్తుంది'' అని పెద్దాయన ఆశీర్వదించారు.

కంచి పెద్దవారిని కలిసాక పుట్టపర్తి వెళ్లి బాబా



గారిని కలిశాము. ఆయనతో కూడా విషయం చెప్పి కంచి పీఠాధిపతి ఆశీర్వాదం గురించి కూడా చెప్పాము. బాబాగారు అంతా విని "ఇంటింటా ప్రజాదరణ పొందటం కాదు. ప్రతీ అంగుళం నీ భగవద్గీత వినిపిస్తుంది. నువ్వు తప్పక చెయ్యి'' అని ఆశీర్వదించారు.

అక్కడి నుంచి వచ్చాక పూర్తిగా దృష్టి అంతా దీనిమీద కేంద్రీకరించి శ్లోకాలు కంపోజ్ చేశారు.

రికార్డింగ్ పూర్తయిన తర్వాత ఎంత ఆతృతగా ఎదురు చూసినా గ్రామఫోన్ కంపెనీ వాళ్లు రికార్డులు విడుదల చెయ్యలేదు. ఆరోగ్యం బాగుండ నందువల్ల మొదటి పార్టుకి రెండవ పార్టుకి మధ్య ఆరు నెలల వ్యవధి వచ్చింది. కానీ ఆయన పాడిన భగవద్గీత రికార్డుగా విడుదల కాకుండానే ఆయనకి దేవుడి దగ్గర నుండి పిలుపు వచ్చింది.

## భగవద్గీత యల్.పి. రికార్డు విడుదల

22-4-1974 హెచ్.ఎం.వి. కొలంబియా అసోసియేషన్ ఆఫ్ సౌత్ ఇండియా వారు మామయ్య పాడిన యల్.పి. రికార్డును విడుదల చేసారు. ఈ సభ విజయవాడ దుర్గాకళా మందిరంలో జరిగింది. సభకు డా॥ టి.వి.యస్. చలపతిరావు గారు అధ్యక్షత వహించారు. ప్రముఖ గాయని పి.సుశీల ప్రార్థనతో సభ ప్రారంభమయింది. అసోసియేషన్ అధ్యక్షుడు శ్రీ బి.వి.భట్టు స్వాగతం పలికారు. టి.వి.యస్. చలపతిరావు గారు మాట్లాడుతూ దేశోద్ధారకుని కీర్తి మందిరమయిన దుర్గాకళామందిరంలో ఈ సభ జరగడం ముదావహమన్నారు. ఘంటసాల కీర్తి మనందరి మధ్య ఆచంద్రార్కంగా ఉంటుందన్నారు.

పద్మశ్రీ యన్.టి.రామారావు రికార్డును విడుదల చేస్తూ, ఆనందం, విషాదం ఈ సమయంలో మిళితమయివున్నాయన్నారు. సామాన్యునిగా జన్మించినా పండిత, పామర హృదయాలలో సుస్థిరమైన స్థానం ఏర్పరచుకొన్న ధన్యజీవి ఘంటసాల అని జోహార్లర్పించారు. రసానుభూతులకు అనుగుణంగా సంగీతం ద్వారా ప్రజలందరి హృదయాలలో రసస్ఫూర్తిని కలిగించి తన్మయత్వం చెందడం గొప్పవారికే సాధ్యమని, స్వర్గీయ పద్మశ్రీ ఘంటసాల అటు దేవదాసు పాతాళభైరవి, మల్లీశ్వరి చిత్రాలు మొదలుకొని ఇటీవలి వరకు ఆయా పాత్రలకు తనగానంతో జీవం పోసి ఎంతోమందిని రంజింపచేసిన మహానుభావుడని అన్నారు. నటునిగా తన జీవితానికి నిండుతనాన్ని కల్గించింది ఘంటసాల అని యన్.టి.రామారావు గారు అన్నారు.

తాను వివిధ సహాయ కార్యక్రమాలను ప్రారంభించినప్పుడు పూర్తి సహకారాన్నిచ్చి ఘంటసాల ప్రజాసేవకుడు కూడా అయినాడని ఆయన అన్నారు. అంత్యకాలంలో ఘంటసాల ఈ భగవద్గీతను ఆలపించి దానిని చిరస్థాయిగా జాతికి అంకితం చేసారని ఆయన అన్నారు.

శ్రీ రామారావుగారు భగవద్గీత రికార్డును కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ గారికి అందచేసారు. శ్రీ విశ్వనాథ వారు ప్రసంగిస్తూ విద్వాంసుడు పాడే పాటల్లో ఒక విలక్షణం వుంటుందన్నారు. ఈ రికార్డు ద్వారా చిరస్థాయిగా ఆంధ్రుల హృదయాలలో ఘంటసాల ఉండటం నిస్సందేహమన్నారు.

కరుణశ్రీ జంధ్యాల పాపయ్య శాస్త్రిగారు తమ ప్రసంగంలో ఆబాలగోపాలాన్ని సంగీత లహరిలో తేల్చిన మహాగాయకుడు ఘంటసాల అన్నారు.

ఆకాశవాణి విజయవాడ కేంద్రం డైరెక్టర్ శ్రీ రజనీకాంతరావు జనరంజకమయిన నూతనమయిన పద్ధతిలో ఘంటసాల తన గాత్రంతో ప్రజలను ఉర్రూతలూగించారన్నారు. ఘంటసాల కంఠబలాన్ని మొదటిసారిగా

ఆకాశవాణి ద్వారా ప్రజలకు వినిపించానని, తన స్వశక్తితో అఖండమైన కీర్తి సంపాయించటం నా కనులారా చూశాను. ఆయన అమరులైనది కూడా చూడటం చాలా బాధాకరంగా ఉందన్నారు. తర్వాత రికార్డులోని 58 శ్లోకాలను వినిపించారు.

మా నరసింగ, ఈ రికార్డ్సును యన్.టి.రామారావు గారి చేతుల మీదుగా మా తరుపున తీసుకున్నాడు.

ఆనాటి సభలో రామారావు గారు, విశ్వనాథ వారు మొదలైన పెద్దలు మంచి మనస్సుతో భగవద్గీత చిరస్థాయిగా ఉంటుందని దీవించారు. అందుకే ఈనాటికీ భగవద్గీత కేసెట్లకు ప్రజాదరణ తగ్గలేదు.

మామయ్య పోయిన తర్వాత కూడా మా ఇంట్లో ఏ కార్యము జరిగినా యన్.టి.రామారావు గారి కుటుంబము వచ్చి చేదోడువాదోడుగా ఉండేవారు. మామయ్య కీర్తిశేషులై 28 సంవత్సరాలయినా కూడా రామారావు గారి పిల్లలు నన్నుకాని నా పిల్లలను కాని చూస్తే ఎంతో ఆప్యాయంగా పలకరించి ఎంతో సేవ మాట్లాడుతారు. ఈ విషయాన్ని తలచుకుంటే మనస్సు చెప్పలేని బాధతో నిండిపోతుంది.

తిరుపతిలో సంగీత కళాశాల స్థాపించాలని ఆయన అక్కడ స్థలం కూడా కొని వుంచారు. సంగీతం నేర్చుకోవాలని నిజంగా తపనతో వచ్చేవారికి అన్నం పెట్టి సంగీతం నేర్పించాలనేవారు. పెద్దబాబు విజయకుమార్‌కి పెళ్లి చేసి పిల్లల్ని మద్రాసులో వుంచి, తిరుపతిలో కళాశాలని తను నడపాలని అనుకునేవారు. అయితే ఆయన పోయేనాటికి మా ఆర్థిక పరిస్థితి బాగాలేదు. ఇద్దరు మగపిల్లలు, ముగ్గురు ఆడపిల్లలతో మొత్తం కుటుంబ భారమంతా నా మీదే పడింది. పైగా అంతకు ముందు సినిమాలు (పరోపకారం, సొంతవూరు, భక్త రఘునాథ్) తీసి ఆర్థికంగా దెబ్బతిన్నాము. సినిమాల కోసం చేసిన అప్పులు, ఇంటికోసం చేసిన అప్పులు ఎన్నో ఏళ్ల తరువాత గానీ తీరలేదు. ఆయన పాడిన పాటలకి పేరు ప్రఖ్యాతులైతే వున్నాయి. అయితే సినిమా పాటల మీద రాయల్టీ రాదు. ప్రైవేటు పాటల మీద మాత్రం రాయల్టీ అప్పుడప్పుడు కొంచెం కొంచెం వచ్చేది. సినిమాల్లో పాడిన పాటలకి డబ్బిచ్చే వాళ్లు యిచ్చారు, ఎగ్గొట్టిన వాళ్లు ఎగ్గొట్టారు. కచేరీలు కూడా ఆయన ఎక్కువగా ఫ్రీగానే చేసారు. సినిమా పాటలకి కూడా ఆయన తీసుకున్న అత్యధిక మొత్తం పాటకి రెండువేల రూపాయలే.

పెద్దబాబు సంగీతం నేర్చుకున్నాడు. రెండు మూడు వాయిద్యాలు వాయిస్తాడు. వాడికి అవకాశాలు రాలేదు. పరిశ్రమ నుంచి కాని, ప్రభుత్వం నుంచి కాని ఎటువంటి సహాయం అందలేదు. ఈ స్థితిలో పిల్లల పెళ్ళిళ్ల కోసం ఒక ఇల్లు, పొలం అమ్మవలసి వచ్చింది. అక్కడికీ మా అదృష్టం అనండి, ఆయన మంచితనం అనండి కానీ కట్నం తీసుకోని బంగారం లాంటి అల్లుళ్లు దొరికారు. చివరకు ఒక యిల్లు మాత్రం మిగిలింది. పెద్దబాబుకా అవకాశాలు లేవు. చినబాబు అప్పటికింకా చదువుకుంటున్నాడు. ఇల్లు జరగాలి. లాభం లేదనుకుని తిరుపతి స్థలం బేరం పెట్టాం. అయితే కళాశాల కట్టించి ఆయన పేరు పెడితే బాగుంటుందని మనసులో కోరికైతే వుండేది. కానీ పిల్లల బాధ్యత ఒకవైపు, ఏ మాత్రం అండదండలు లేని నా నిస్సహాయత మరొక వైపు అంతటి బృహత్కార్యాన్ని నేను చెయ్యలేనని అనిపించింది. ఆయన ఆశయం మాత్రం అసంపూర్తిగా మిగిలిపోయింది.

నేనెప్పుడూ ఆయన రికార్డింగుకి వెళ్లేదాన్ని కాదు. మొదటిసారి 'జీవితచక్రం' సినిమాలో పాడటానికి మావయ్యతోపాటు నన్నూ రమ్మంటే బొంబాయి వెళ్లాను చూడటానికి. భగవద్గీత పాడేటప్పుడు ఒక చోట తప్పుగా వస్తే అది సరిచేయటానికి నన్ను కూడా గ్రామఫోన్ కంపెనీ రికార్డింగ్ థియేటర్‌కి తీసుకెళ్ళారు.

ఆయన పాటలు వింటుంటే ఆ పాత రోజుల్లో బ్రతుకుతున్నాననుకుంటాను. ఆ పాటలు వింటుంటే ఆనాటి రోజులు, ఆ పాటల రిహార్సల్స్‌లో మాట్లాడుకున్న మాటలు అన్నీ జ్ఞాపకం వచ్చి మనసు అక్కడే కొట్టుకొంటూ వుంటుంటుంది. ఆయన పాటలే కాదు మాట వచ్చినా ఏడుపే వస్తుంది. అయితే పిల్లల ముందు ఏడవడానికి బాగుండదు. అందుకే ఎప్పుడు ఒంటరిగా ఏడుస్తుంటాను. నా మనసేమీ బాగోనప్పుడు "ఎక్కడ వున్నా ఏమైనా నీ సుఖమే నే కోరుకున్నా" అనే పాట వినిపిస్తున్నట్లుంటుంది. ఆ పాట ద్వారా ఆయన నాకు సందేశం యిస్తున్నట్లుంటుంది. "మనసిచ్చినదే నిజమైతే మన్నించుటయే రుజువు కదా" అని ఆ మాటే అనుకుంటుంటాను.

## చివరి చిత్రం

ఆయన ఆఖరిసారిగా సినిమాలో "భద్రాచల రామదాసు" అనే చిత్రానికి మాస్టర్ వేణుగారి సంగీత దర్శకత్వంలో భక్తిగీతం పాడారు. దానికి ముందు 'యశోదాకృష్ణ' సినిమాలో 'చక్కనివాడే' అని కృష్ణుడి మీద పాడారు. ఆ తర్వాత సినిమా పాటలు పాడలేదు. భద్రాచల రామదాసు పూర్తి నిడివి చిత్రం, డాక్యుమెంటరీ కాదు. ఆ సినిమా ఏమైందో, ఆ పాటలు ఏమయ్యాయో నాకు తెలీదు.

ఆయన అసిస్టెంట్లని సొంత బిడ్డల్లాగా చూసుకునేవారు. తోటి గాయనీ గాయకుల్లో ఒక్క భానుమతిగారినే సమ ఉజ్జీగా భావించేవారు. ఇతరులని చిన్నపిల్లల్లాగ చూసేవారు. కొత్త గాయనీ గాయకుల్ని ఎంతో ప్రోత్సహించేవారు. దేవుడు చేసిన మనుషుల చిత్రం కోసం పాడి వచ్చిన తరువాత కొత్త కుర్రాళ్లు బాగా పాడుతున్నారు. వారిని ఎంకరేజ్ చెయ్యాలని సంతోషంగా చెప్పేవారు.

## నూతన గాయకులకు ప్రోత్సాహం

ప్రేమలు - పెళ్ళిళ్లు చిత్రంలో "మనసులేని దేవుడు మనిషికెందుకో మనసిచ్చాడు" అనే పాట ఆయనకి ఎంతో నచ్చింది. రిహార్సల్ చేసుకొని పాడదామనుకున్నారు. రిహార్సల్ అయిన తరువాత ఎందుకో విపరీతంగా దగ్గు వచ్చింది. రెండు మూడు రోజుల దాకా తగ్గలేదు. అందుకని రామకృష్ణ చేత పాడించారు. దగ్గు తగ్గాక రికార్డింగుకి వెళ్లి రామకృష్ణ పాడిన పాట విని 'అబ్బాయి చక్కగా పాడాడు. మళ్లీ నేను పాడటం ఎందుకని' పాడకుండా వచ్చేశారు. ఇంటికి వచ్చి నాతో "నాకెంతో యిష్టమైన పాటని రామకృష్ణ బాగా పాడాడు. అందుకని నేను పాడనని తిరిగి వచ్చాను" అన్నారు. కొత్తగా పైకి వస్తున్న గాయకులు. వీళ్ల భవిష్యత్ పాడు చెయ్యకూడదు. అందుకని పాడలేదు అన్నారు.

## భక్తతుకారం

అలాగే భక్తతుకారం సినిమా తీస్తున్నప్పుడు పాటలన్నీ మావయ్యే పాడాలని అంజలీదేవి, ఆమె




భర్త ఆదినారాయణరావు గారు అన్నారు. ఆయనకి ఆరోగ్యం బాగాలేక హాస్పిటల్లో వున్నారు. ఆదినారాయణరావు గారు వచ్చి చూస్తుండే వారు. వీరికి ఆరోగ్యం కుదుట పడటం లేదు. నాగేశ్వరరావు గారు కాల్షీట్లు యిచ్చారు. ఏం చెయ్యాలా అని ఆదినారాయణరావుగారు ఆస్పత్రికి వచ్చి "మాష్టారూ! అక్కినేని గారి కాల్షీట్లు మళ్లీ దొరకవు. అందుకని అభంగాలు, కొన్నిపాటలు వేరేవారి చేత ట్రాక్ పాడిస్తాము. మీరు వచ్చాక మళ్లీ పాడవచ్చు" అంటే సరేనన్నారు. అభంగాలు మామయ్యకు చాలా యిష్టం. పాడాలని కోరిక. అప్పుడు

ఆదినారాయణరావుగారితో రామకృష్ణ అనే కొత్త కుర్రవాడు బాగా పాడుతున్నాడని అతని చేత ట్రాక్ పాడించండి అన్నారు. రామకృష్ణ చేతనే పాడించారు. మావయ్య అనారోగ్యం నుండి కోలుకున్నాక ఆదినారాయణరావుగారు వచ్చి "పాటలు వినండి. మనం మళ్లీ రికార్డింగ్ చేద్దామంటే' వెళ్లి పాటలు విని 'బాబూ! ఈ కొత్తకుర్రాడు చాలా బాగా పాడాడు. అవే ఉంచండి. నేను మిగిలిన పాటలు పాడతాను' అని, ఘనాఘన సుందర, అసలున్నావా అనేవి కొన్ని పాడారు.

## ప్రస్థుతం మా కుటుంబం గురించి...

మా పెద్దబాబు ఆయనలాగే చిన్న



వయసులో (48 సంవత్సరాలు) మరణించాడు. పెద్దవాడు పోయిన ఒకటిన్నర సంవత్సరానికే మా కోడలు పోయింది. వాడికి యిద్దరు కొడుకులు. పెద్దబాబు నా దగ్గర, చిన్నబ్బాయి మా రెండో అబ్బాయి రత్నకుమార్ దగ్గర వుంటున్నారు. పెద్ద అమ్మాయి శ్యామల మద్రాసులో వుంది. అల్లుడు డాక్టరు. కాళిదాసు సినిమాలో శ్యామలా దండకం రికార్డు అయిన తరువాత పుట్టినందుకు మా పెద్దమ్మాయికి శ్యామల అని పేరు పెట్టారు. రెండో అమ్మాయి సుగుణ, హైదరాబాదులో వుంది. అల్లుడు వ్యాపారంలో స్థిరపడ్డారు. వాళ్ల పెద్దబ్బాయి ఇంజనీరు. అమెరికాలో వున్నాడు. మూడో అమ్మాయి శాంతి. మద్రాసులో వుంది. అల్లుడు వ్యాపారంలో స్థిరపడ్డారు. మా రెండో అబ్బాయి రత్నకుమార్ బిజీ ఆర్టిస్టు. ఇప్పుడిప్పుడే మా కష్టాలు గట్టెక్కుతున్నాయి.

## ఆ ఇంటిని మిగుల్చుకోలేక పోయాం

తప్పనిసరి పరిస్థితిలో ఉస్మాన్‌రోడ్డులో వున్న



యిల్లు అమ్మవలసి వచ్చింది. ఆయన గుర్తుగా ఆ యింటిని మిగుల్చుకోవాలని ఎంతో ప్రయత్నించి ఓడిపోయాను. ఎక్కడో పెదపులివర్రు గ్రామంలో కొడవంటిలి వెంకటరత్నం శాస్త్రి, శివకాంతమ్మల పదిమంది సంతానంలో మూడవదానిగా పుట్టిన నేనూ, మరెక్కడో చౌటుపల్లిలో ఘంటసాల సూరయ్య, రత్తమ్మల మూడవ బిడ్డగా పుట్టిన వెంకటేశ్వరరావు దంపతుల మౌతామని, ఇంతటి గుర్తింపుని పొందుతామని ఎన్నడూ అనుకోలేదు. ఆయన సాహచర్యం వల్ల ఎంతోమంది కళాకారులకి, విద్వాంసులకి, రాజకీయ ప్రముఖులకి, పీఠాధిపతులకి మరెందరో మహానుభావులకి సేవచేసే అదృష్టం లభించింది. ఒకప్పుడు నిత్య కల్యాణం పచ్చతోరణంలా -వచ్చేపోయే అతిధులతో, అభిమానులతో, బంధువులతో సన్నిహితులతో కళకళలాడుతూ ఆ సరస్వతీదేవి ఆనందంతో యిల్లంతా కలియ తిరుగున్నట్లుగా వుండే యిల్లు, ఈరోజు నేలమట్టమై నిర్జీవంగా మారిపోయింది. అలా అ స్థలాన్ని చూస్తుంటే మనసులో దుఃఖం సుడి తిరుగుతుంది. మావయ్య ఒకసారి పాడినట్లు "ఒకనాటి ఉద్యానవనము నేడు కనము అదియే మరుభూమిగా నేడు మిగిలేనులే" అన్న పాట ఆ స్థలంలో ప్రతిధ్వనిస్తున్నట్టుగా వినిపిస్తుంటుంది.

ఈ జీవిత చరమాంకంలో నాకు మిగిలినవి, ఊపిరి పోస్తున్నవి ఆనాటి జ్ఞాపకాలే.

ఆ స్మృతితరంగాలలో నాకు మామయ్య, మీకు ఘంటసాల అయిన ఆ మహానుభావులు అనుక్షణం ఒకమాటై, ఒకపాటై వినిపిస్తూనే వుంటారు.

(అయిపోయింది)

అక్టోబరు 7 పేకేటి జన్మదినం సందర్భంగా....

## పేకేటిలో కమెడియన్‌ను చూసిన హెచ్.ఎమ్.రెడ్డి



ఘంటసాల తొలి రికార్డు వెలువడడానికి కారకుడు అయిన పేకేటి శివరాం అనగానే మనకు గుర్తుకు వచ్చేది ఆయన హాస్య నటనే! నిజానికి ఆయన రచయిత, జర్నలిస్టు, హార్మోనిస్టు, ప్రొడక్షన్ మేనేజర్, ఫోటోగ్రాఫర్, ఇంకా ఎన్నో... ప్రెసిడెంట్ మెడల్ పొందిన దర్శకుడు కూడా! 1938లో చలన చిత్రరంగంలో ప్రవేశించిన శివరాం 14 సంవత్సరాల పాటు అడ్మినిస్ట్రేటివ్ సైడు, టెక్నికల్ సైడు ఉన్నారు. 1952లోనే తెరపైకి వచ్చారు. దానికి కారణం చలన చిత్ర పితా మహుడు హెచ్.ఎమ్.రెడ్డి.

తొలి తెలుగు టాకీ, తొలి తమిళ టాకీలతో బాటు అనేక గొప్ప చిత్రాలు నిర్మించిన హెచ్.ఎం.రెడ్డి వద్ద శివరాం కొంతకాలం మేనేజర్‌గా పని చేశారు. తన వద్ద అసిస్టెంట్స్‌గా పని చేసిన బి.ఎన్.రెడ్డి, ఎల్.వి.ప్రసాద్, భరణీ రామకృష్ణ, కమలాకర కామేశ్వరరావు వంటి వారిని కూడా 'ఒరే' అని పిలిచే అధికారం ఉన్న రెడ్డిగారికి భార్య అంటే మాత్రం హడల్. వారింట్లో ఆవిడ పెంచే ఓ కుక్క కూడా ఉండేది.

ఓసారి రెడ్డిగారింట్లో స్టాఫ్‌కందరికీ విందు. శివరాం ఇంట్లోకి ప్రవేశిస్తూ 'అప్పాజీ (రెడ్డిగార్ని పిలిచే వారు) నమస్తే,' 'అమ్మాజీ నమస్తే (అలా అనకపోతే రెడ్డిగారి భార్య ఊరుకోదు) అంటూ పక్కనున్న కుక్కకూ సలాం కొట్టారు. 'నీ క్కూడా నమస్తే' అంటూ! నాకు గౌరవం ఇస్తే నా కుక్కకు కూడా గౌరవం ఇవ్వాలి' అని పట్టుబట్టే అహంభావివి సుమా నువ్వు అని చెప్పినట్టు రెడ్డిగారి భార్యను ఆ విధంగా ఎత్తి చూపారు శివరాం. విషయం గ్రహించిన రెడ్డిగారు పడి పడి నవ్వారు.

ఇంకో సందర్భంలో భార్య తమ్ముడు సినిమా తీస్తానని పట్టుబడితే భార్యకు దడిసి సరేనంటూనే అతనికి సహాయ పడమని శివరాంను అప్పగించారు రెడ్డిగారు. శివరాం సహకరిస్తున్నట్టు కనబడుతూనే అనుభవశూన్యుడైన అతన్ని ఆటలు పట్టించి ఆ ప్రయత్నం కొనసాగకుండా రెడ్డిగారిని కాపాడారు. ఇలాటి ఘట్టాలలో శివరాం చతురత, హాస్యస్ఫూరత చూసిన రెడ్డిగారు 'నువ్వు కమెడియన్‌గా రాణిస్తావు' అని సలహా యిచ్చారు. ఆ వాక్కు నిజమైంది.

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

# నవ్వుటద్దాలు

క్లాసిక్స్ రీటోల్డ్

- ఆచార్య తిరుమల

## వైద్య సాహిత్యం

సాహిత్యంలో వైద్య ప్రస్తావన చాలా వుంది. "అప్పిచ్చువాడు, వైద్యుడు" లేని ఊళ్లో ఉండొద్దన్నాడు సుమతీశతకకారుడు. అలాగే ధూర్జటి మహాకవి తన శ్రీకాళహస్తీశ్వర శతకంలో - "చావం గాలము చేరువౌటెరిగి యుం జాలింపగా లేక తన్నే వైద్యుడు చికిత్స బ్రోవగలడో యే మందు రక్షించునో" అని జీవశ్రాద్ధం చేసికొన్న సన్యాసి కూడా వెతుక్కుంటాడన్నాడు. వైద్యుణ్ని "నారాయణో హరిః అని కీర్తించారు. నేను కూడా నా 'యుగగీత'లో-

**"అందరును బాధ కలిగించు అసురవరులె**

**వైద్యుడే బాధ తొలగించు వైష్ణవుండు"** అని నమస్కరించాను. అయితే-

ఇప్పుడు వైద్యం చాల ఖరీదైన వ్యవహారమై పోయింది. ఇప్పుడన్నీ పోలిక్లీనిక్కులు. సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్సు తప్ప ధర్మాస్పత్రులెక్కడా లేవు. ఒక వేళ వున్నా, వాటిలో కూడా వ్యాపారాలు నిరాఘాటంగా సాగుతూనే వుంటాయి. అంకితభావం లేని ధనార్జనాపరులైన కొంతమంది డాక్టర్ల వల్ల సామాన్యునికి వైద్య సదుపాయం దూరమై పోయింది. ఎవరికైనా సరే మందులు కొనలేని పరిస్థితి వుంది. రోగం వచ్చిందంటే ఇల్లు గుల్లయి పోతూ వుంది. రోగితో పాటే రోగం పోతుంది కానీ నయం కాదు. పవిత్రమైన వైద్యవృత్తి నీ విధంగా దిగజార్చిన వైద్యుడికి నమస్కరిస్తూ పూర్వకవి ఒకడీవిధంగా చమత్కరించాడు.

**వైద్యరాజ నమస్తుభ్యం**

**యమరాజ సహోదర**

**యమస్తు హరతి ప్రాణాన్**

**వైద్యః ప్రాణాన్ ధనానిచ!! - అంటే -**

యముని సోదరుడవైన ఓ వైద్యుడా! నీకు నమస్కారం. ఎందుకంటె, యముడి కంటె నీవే గొప్పవాడివి. యముడు ప్రాణాలే తీసుకుపోతాడు. నువ్వైతే ప్రాణాలతోబాటు డబ్బులు కూడా తీసుకుపోతావు - అని భావం.

ఇలా వ్యంగ్యంగా కాకుండా విశ్వనాథ వారు తమ 'వేయిపడగలు' నవలలో దంతవైద్యుడ్ని -

**తిండి లేనట్టి వానికి తిండి యిడదు**

**తిండి గల వారి దగ్గర తీయు పన్ను**

**ఉర్విపతి కంటె దంత వైద్యుండు నయము**

**పన్ను కట్టును లేనట్టివాడు చనిన!!**

అని 'పన్ను' మీద 'పన్ని'ంచి (శ్లేషించి) దంతవైద్యుడు రాజు కంటె నయమని నిజంగానే మెచ్చుకున్నారు. పూర్వం వైద్యులకి, జ్యోతిష్కులకి సంఘంలో చాలా గౌరవం ఉండేది. దాన్ని ఆధారం చేసుకుని ఓ చిన్నదాని గడుసుదనాన్ని యీ 'గాథా సప్తశతి' పద్యంలో చూడండి.

**పాంథకిశోర! నీ చిరుత ప్రాయము దెల్పెడి మోము, చేతి యు**

**ద్గ్రంథము జూడ వైద్యుడవుగావలె. జ్యోతిష పండితుండవో**

**అంధతమూల్గు అత్త గృహమందు, నవోఢను వార్ధిదాటి సా**

**గంధిక వర్తకుండగు మగండరుదెంచు దినమ్ము తెల్పుమా!!**

ఇందులో చమత్కారమేమిటంటే - ఓ గ్రంథం పట్టుకు తిరుగుతున్న ఓ కుర్రాణ్ని - 'అత్త గుడ్డిది, భర్త వ్యాపారం కోసం సముద్రం మీద విదేశాలకు వెళ్లాడు - కొత్తగా పెళ్లయిన దాన్న'ని చెప్పి తన కోర్కె తీర్చుకోటానికి రమ్మని పిలవటం. పైకి మాత్రం వైద్యుడవైతే అత్తకు చూపు తెప్పించమని, జ్యోతిష్కుడవైతే తన భర్త యెప్పుడొస్తాడో చెప్పమని అడగటం.

అలాగే, ఈ శృంగార వైద్య శ్లోకం చూడండి.

**కాంతా కటాక్ష దగ్ధానాం**

**వద వైద్య కిమౌషధం?**

**దృఢ మాలింగనం పథ్యం**

**క్వాథ శ్చాధర చుంబనమ్!!**

ఆడదాని ఓర చూపునకు మాడిపోతున్న వానికి మందు ఏమిటంటే ఆమెను గట్టిగా కౌగిలించుకుని ముద్దు పెట్టుకోవటమేనట! ఇలాంటి వైద్యాన్నెవరు కాదంటారు చెప్పండి?!?

ఇప్పుడు శ్రీమంతులకు కూడా అందుబాటులో లేని వైద్యం ఇది వరకు జానపదుల ఆటపాటల్లో కూడా ఉండేది. చూడండి:-

**వంకర టింకర 'శొ'**

**వాని తమ్ముడు 'అ'**

**నల్లగుడ్లా 'మి'**

**నాకేమిస్తావు? 'తే'!**

ఇదొక పొడుపు కథ. విప్పితే వైద్యం. కడుపు నొప్పితో వంకర్లు తిరిగి పోతున్న వాడికి 'శొ'ంఠి. 'అ'ల్లం', 'మి'రియం 'తే'నెలో కలిపి యిస్తే తగ్గిపోతుందని చిట్కా. ఇలాగే

**"కాళా గజ్జి కంకాళమ్మ - వేగుల చుక్కవెలగా మొగ్గ - మొగ్గా**

**కాదు మోదుగు నీర్స - నీరూ కాదు నిమ్మల బావి - బావీ**

**కాదు బచ్చలకూర - కూరగాదు కుంకుం మెట్టు - మెట్టు**

**గాదు మేదర యిల్లు - ఇల్లూగాదు ఈగల తొట్టె - తొట్టెకాదు**

**కాలు తీసి కడగబెట్టు"**

అనే పాటలో కాళ్లకు పట్టినగజ్జి పోగొట్టే వైద్యసూత్రం ఉంది. కంకాళాకు, వెలగమొగ్గ, మోదుగు నీరు, నిమ్మరసం, బచ్చలాకు, కుంకుం పువ్వుతో

నూరి ఉదయాన్నే గజ్జి పట్టిన కాళ్లను కడిగి రాస్తే గజ్జి తగ్గిపోతుందని సూచన. ఇలాగే-

**పార్వతీ మౌషధీమేకాం**
**అపర్ణాం మృగయా మహే**
**శూలీ హాలాహలం పీత్వా**
**యమా మృత్యుంజయో భవతు!!**

అనే శ్లోకంలో కడుపులోని శూల నొప్పి పోయి మృత్యుంజయత్వం సిద్ధించే చిట్కావుందంటారు. ఇలాంటివన్నీ చిట్కా వైద్యాలని కొట్టి పారేయటానికి వీల్లేదు. రోగి నమ్మకం మీద వైద్యం ఆధారపడి వుంటుంది. ఇది వరకు నలిచి మన్ను యిస్తే మందులా పని చేసేది. ఇప్పుడు రోగికే కాదు డాక్టరుకి కూడా మందుల మీద నమ్మకం లేదు. అందుకే ఒక చిన్ని రోగానికి పది రకాల మందు రాస్తూ వుంటాడు. వాటికి తగ్గకపోతే శస్త్ర చికిత్స వుండనే వుంది. పదిమంది మూగి రోగిని కోసి పారేయటమే! అయినదానికి కానిదానికి, డాక్టర్లు ఆపరేషన్ అనటం చూసి వాళ్ల మండి నేను నా 'తిరుమలోక్తి' శతకంలో రెండు పద్యాలు చెప్పాను.

**శస్త్ర వైద్యుడైన సంపాదనధికమ్ము**
**దగ్గుకైన కోత తప్పదనును**
**కత్తి వీరుడతని కాదని మనలేము**
**పరమ సత్యసూక్తి తిరుమలోక్తి!!**
**తాళలేక రోగి తగు వైద్యుచేరినా**
**బాగుపడడు; వెజ్జు బాగుపడును**
**రోగితోనె పోవు రోగము మాత్రము**
**పరమ సత్యసూక్తి తిరుమలోక్తి!!**

పరమ సత్యాలు అనుభవం మీదగాని తెలియవు గదా!

అనుభవమంటే గుర్తొచ్చింది. ఓ గొప్ప డాక్టరు తన కొడుకుని కూడా డాక్టర్ని చేసి - "నాయనా, మందు చీటీలు చదవటానికి అసాధ్యం గానూ, బిల్లులు స్పష్టంగానూ రాస్తూ వుండ"మని సలహా యిచ్చాడట! 'బిల్లు' అంటే గుర్తొచ్చింది. ఓ కాంపౌండరు డాక్టరు దగ్గరకు గబగబా వచ్చి - "అయ్యా! ఆ రోగికి మనం ఫ్లూ జ్వరానికి కదా వైద్యం చేసింది మరి హార్టెటాక్ వల్ల పోయాడంటారేమిటి?" అని అడిగితే ఆ డాక్టరు చాలా స్థిమితంగా "డిశ్చార్జి చేసి బిల్లు పంపించానులే. చూసుకునుంటా" డన్నాడట!

అద్దంకి నుంచి హాస్య కవితా కేతనాలెగరేస్తున్న ఇలపావులూరి సుబ్బారావు గారు వైద్యుణ్ని ఉద్దేశించి -

**చెవుల స్టెతస్కోపు చెప్పి గుండియ బీటు**
**హార్టు స్పెషలిస్టను నాఖ్యదెచ్చె**
**జ్వరమాని దేహాన వరలు నుష్ణత దెల్పి**
**ఫీవర్ల డాక్టరన్ పేరు దెచ్చె**
**బీపీని తెలియజెప్పెడి సాధనము నీకు**
**రక్తపోటెరిగెడి శక్తినిచ్చె**
**ఎక్సురే విరిగిన యెముకలు చూపింప**
**బోన్స్ స్పెషలిస్టుగా పొగడబడితి**
**వంతె, యిసుమంత యెరుగవు సుంతయేని**
**అన్యులెవ్వరు చదువంగ నలవిగాని**
**లిపిని దివ్యౌషధముల పేర్లెల్ల వ్రాసి**
**వ్యాధి కుదిరింతు వయ్యయో వైద్యవర్య!!**

అంటూ ఒక పేరడీ పద్యం విసిరారు. కవులతో పెట్టుకుంటే అంతే మరి. కవి కూడా సమాజ రుగ్మతల్ని పోగొట్టే అక్షర వైద్యుడే కదా!

సందర్భం వచ్చింది కాబట్టి - బాధాతప్తులైన రోగుల పట్ల డాక్టర్లంతా ఉదార స్వభావంతో, సేవా భావంతో వుండాలని, "బిల్లు చెల్లించి శవాన్ని తీసుకువెళ్లండి" అనే క్రూర విధానాన్ని హాస్పిటల్సు విడనాడాలని, మందు పేరే తప్ప మందుల మీద వాటిని నిర్మించిన కంపెనీ పేర్లుండటం మంచిది కాదని మనవి చేస్తూ-

ఓ జోక్‌తో ఈ వ్యాసం ముగిస్తాను:

ఒకామె తన భర్తతో డాక్టరు దగ్గరకొచ్చి "చూడండి డాక్టర్ ఈయన! గంటల తరబడి నేనెంత మాట్లాడుతున్నా ఒక్క మాట కూడా విననట్టు ప్రవర్తిస్తున్నారు. ఇదేదైనా జబ్బంటారా?" అని అడిగింది.

"అది జబ్బు కాదమ్మా! వరం. దేవుడిచ్చిన వరం" అంటూ నిట్టూర్చాడా డాక్టరు.



సీరియల్

5

# సినీతిచంద్రిక



రావి కొండలరావు

> **జరిగిన కథ**
>
> ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్ళకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. "నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి వెతుకుతున్నాం....
>
> (ఇక చదవండి)

"అది కాదులెండీ - కథ..." అని ఫలానా నావేపు తిరిగి - "ఏవండీ ఊళ్లో ఆడుతున్న సినిమాలన్నీ నాలుగు రోజుల్లో చూసి వద్దామా - ఏదేనా దొరుకుతుంది - లేకపోతే ఏ బెంగాలీ కథో కొట్టేద్దాం కొట్టినట్టు తెలియకుండా" అన్నాడు.

"అదెట్లా?" అన్నాను.

"మన కథ మొత్తం మార్చేద్దాం, అదెంత సేపు?"

"అబ్బాయ్, అదంతా లాభం లేదు. కథకోసం మనం ఎన్ని తిప్పలన్నా పడవలసిందే. అసలు చిత్రానికి మూలం కథేనని, కథలో బలం లేకపోతే లాభం లేదనీ నా నమ్మకం. కావాలంటే ఓ కథ చెప్తాను - ఇద్దరూ వినండి. కథకు ప్రాముఖ్యం ఇవ్వకుండా, లక్షలు లక్షలు పోసి తీసిన ఒక చిత్రం ఒక్క రోజులో ఎట్లా యెగిరి పోయిందో!"

"చెప్పుచెప్పు - బాగుంటే ఈ కతే తీసుకుందాం" అన్నాడు నిర్మాత. నేను ప్రారంభించాను.

"బాగా డబ్బూ దస్కం మస్తుగా, పుష్టిగా ఉన్న ఒక ఆసామీ సినిమా తియ్యాలని మద్రాసు వచ్చి -- ఇక్కడ సరిపడక బొంబాయి వెళ్లి -- మళ్ళీ మద్రాసొచ్చి, 'సినిమా అంతా అవగతమై పోయింది, నేను తీసి చూపిస్తాను' అని తను మొదలెట్టాడు. తన ఉద్దేశం ఏమిటి -- హిట్లవుతన్న సినిమాలన్నీ కేవలం 'షోమన్‌షిప్' మీదే అవుతున్నాయని! 'షిప్' అన్నానని అదేం పడవ అని అనుకోకండి -- అదోమాట, చిత్రాన్ని 'భారీ'గా చూపించటం అన్నమాట. ఇట్లా చూపించడంలో హాలీవుడ్ వాళ్లు పేరుగాంచారు. ఈ ఆసామీ కూడా హాలీవుడ్ అమ్మమ్మలా సినిమా తియ్యాలని ఓ కథ ఎన్నుకున్నాడు. కథను ఎన్నుకోవటం అంటే ఏమిటి -- ముందే సెట్లు గీయించేసుకున్నాడన్న మాట! పెద్దపెద్ద మేడలూ, మిద్దెలూ, స్తంభాలూ, మనుషులు వందల కొద్దీ కనిపించటము, యుద్ధాలూ, సముద్రపు ఒడ్డూ, ఒంటెలూ, ఏనుగులూ, ఇట్లాగే బోలెడన్ని పెట్టేశాడు. వీటికి తోడు ఇద్దరు, ముగ్గురు తారలను పెట్టాడు. చిత్రం మొదలైన దగ్గర్నుంచీ చివరదాకా ఇవే తిరుగుతాయి. కథ ఏమిటో ఎవరూ పసిగట్టలేకపోయారు. మళ్ళీ టైటిల్సులో 'కథ' అని వేసి, తన పేరు వేసుకున్నాడు కూడా! అతనికే అసలు కథ బోధపడలేదట! అందుకనే కాబోలు -- ఈ చిత్రంలోని కథను చెప్పినవారికి -- వెయ్యి నూటపదహార్లు బహుమానం ఇస్తానని ప్రకటించాడు. ఎవరూ చెప్పలేకపోయారు. తాను చెప్పుకోలేకపోయినా, ఆ వెయ్యి నూట పదార్లను నిర్మాతే ఉంచేసుకున్నాడు -- అన్యాయంగా! పబ్లిసిటీ కూడా భారీగా ఇచ్చాడు. మొదటి ఆటకు జనం బాగానే వచ్చారుట! అక్కణ్ణుంచి.... గోవిందా! థియేటర్లు ఖాళీ. అందరూ కూచుని 'ఎంచేతంటే ఎంచేత' అని ప్రశ్నలు వేసుకున్నారు. ఇంతంత సెట్లూ వృథాయేనా అనుకున్నారు. ఆ రాత్రి ఆ ఆసామికి కలవచ్చిందట -- ఆ కలలో



ఒక ప్రేక్షకుడు ప్రత్యక్షమై - 'నాయనా! ఆసామీ! సినిమా అనగా నేమీ? ఇది కాదు నాయనా, మాకు కావలసింది కథగాని - సెట్లు కాదు బాబూ!" అని చెప్పాడు.

"సెట్లు కాకపోతే తారలూ, ఇత రాలూనా...?" అన్నాడు ఆసామీ.

"అవి అంతంతమాత్రమే, అవి కేవలం కథ నడపటానికి తోడ్పడేవేగానీ - కథ కాజాలవు. నీ సెట్లుకూ, కథకూ - మసాలాకూ, మాంసానికీ ఉన్నంత చిత్రభేదముంది. మసాలా ఉన్నదని, అదే వండిపెడితే, ఎవరన్నా తింటారా? తినగలరా? తగినంత మాంసం ఉండి, దానికి మసాలా తగినంత పాళ్లలో పడాలి. అదేవిధంగా..."

"నువ్వేమన్నా నాన్ వెజిటేరియన్ హోటల్లో కుక్కువా?" అని ఆసామీ కోప్పడ్డాడు.

"అదేవిధంగా... నీ సినిమా కూడా..."

"నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పవేం?" అని ఇంకా గట్టిగా కోప్పడ్డాడు. అంతే దాంతో ప్రేక్షకుడు మాయమైపోయాడు. ఆసామీకి మెలకువ వచ్చింది. చట్టున కళ్ళు తెరిచాడు.

"నా కళ్ళు తెరిచావు గదయ్యా - ప్రేక్షకా!" అని. మళ్ళీ పడుక్కుని నిద్రపోయాడుట! విన్నారా - దీని సినీతి ఏమో గ్రహించారా? - కథకు ప్రాముఖ్యం ఇవ్వకున్నచో కరారావుడి తథ్యం. అందువల్ల కథ బావుండాలి -- అది బావుండాలంటే కథకుడు ఉండాలి!" అన్నాను నేను.

"ఏం కథ సెప్పినావయ్యా - ఇది తీస్తే ఇట్టేమవుద్ది?" అన్నాడు నిర్మాత.

'దట్‌నాట్ నిర్మాతగారూ! అదికాదు! ఈ కథంతా విన్నది మీరు అందుకేనా! కానే కాదు. ఇది సినీతి కథకాని, సినీ కథ కాదు. ఇది మనం తియ్యం". అన్నాడు ఫలానా.

"అట్టా సెప్పు. అయితే మా ఎంకట్రావుకి రాయమంటావా?"

'ఎంకట్రావు ఒద్దు - ఏడుకొండలు ఒద్దు. వాళ్లకేం తెలుస్తుంది గురువుగారూ - ఇక్కడే దొరుకుతారు మనకి -- రైటర్లనీ ఉంటారుగా. అందులో ఒకాయన్ను తెచ్చుకుని -- ప్రారంభిద్దాం".

"నువ్వు గలిసినా! సర్లే - సరేగాని సిన్నోడా -- నువెల్లి మాకు తెలిసినోడు, ఇక్కడోడుండాడు. ఆడు మొన్న కనిపించాడు. మంచి మంచి సలహాలన్నీ ఇత్తానన్నాడు. ఎల్లి ఆడిని కేకేసుకురా."

"నే లేనుటండి - మళ్లీ మరొకడా నా మీదికి కాంపిటీషను" అన్నాడు ఫలానా.

"కామిటీసనేందిరా! నీదంతా యిసిత్రం" అని నవ్వి, "ఎల్లా" అన్నాడు.

"పుల్లయ్యను వేంవరం పంపినట్టుంది గురువుగారూ?.... ఆ సలహాదారుడు ఎక్కడుంటాడూ? ఏం చేస్తూ వుంటాడు? అసలతనికి ఇల్లుందా? భార్య వుందా? అతనూ భార్యా చివరకు కలుసుకుంటారా? వాళ్ళ కొడుకేమవుతాడు? ఈ ప్రశ్నలకు సమాధానాలన్నీ తెరమీద చూడమనా మీ ఉద్దేశ్యం?" అన్నాడు ఫలానా.

"ఏందిరా నీ సొద? నరే నేనే ఎల్లి కేకేసుకొత్తాగాని, మీరిద్దరూ ఈ లోపల మంచికత ఆలోచించి పెట్టండి" అని నిర్మాత బయల్దేరబోయి ఆగి, "ఇదిగో తేగాలు బాగావుండాల" అన్నాడు -- అని భుజం మీదగా పంచ పారేసుకుని వెళ్ళిపోయాడు.

"తేగలు అంటాడేమిటి ఫలానా?" అన్నాను నేను.

"తేగలేంటండీ బాబా! తేగాలండీ - అంటే త్యాగాలు. కథలో మంచి మంచి త్యాగాలు వుండాలని వారి ఆదేశం" అని విడమర్చాడు ఫలానా.

"ఫలానా" అన్నాను నేను - నిట్టూర్చి

"ఏమండీ?"

"ఏమేమిటోయ్ - వీడితో మనం ఎట్లా వేగుతామోయ్! నాకేం నమ్మకమూ లేదు, ధైర్యం లేదు"

"ధైర్యే సాహసే లక్ష్మీ" అన్నాను నేను మీతో. అంతలోనే డైలాగు మరిచిపోయారు. ఇంతదూరం వచ్చాక, యింక వెనకడుగేమిటి? రోట్లో తలదూర్చిన తర్వాత, రోకటిపోటుకు వెరువ రాదని పెద్దలందురు. తొల్లియొక జంబుకంబు వనమ్మునం గ్రుమ్మరుచు నెక్కడ నాహారంబు చేకూరమింగరంబుదరం".

"ఫలానా!" అన్నాను చిరాగ్గా.

"కథలండీ, నిర్మాతగారు కథలు ఆలోచించమన్నారు. పాత కథ జ్ఞాపకం వచ్చింది. ఈ కథ ఆయన తీసుకోడు!"

"ఆ సలహాదారు డెవడయ్యా - మన పీకల మీదికి".

"ఏమోనండి, మీరేం భయపడకండి? మీరు డైరెక్టరు కావలసిందే - చెయ్యనంటాడా - నా దారిన నేను పోతాను - అదే తగిన శాస్తి".

"ఏడిసినట్టుంది. నాకేం తోచనివ్వకుండా చేస్తున్నావు నువ్వు"

"కథా అండి! కథ ఒక్కరుకంటే ఇద్దరు ఆలోచించటం మంచిది. మీకు తోచకపోతే నేనున్నాను".



"అది కాదయ్యా బాబూ! ఈ పిక్చరు ఒప్పుకుంటే, వీడితో వేగలేం. ఒప్పుకోకపోతే పార్కు బెంచిమీద మాడలేం. ఏం తోచటం లేదు."

"మహాశయుడు గారూ - మంచి కాన్ఫ్లిక్టు సీనులో పడ్డారు కదా ఆ నిలువుటద్దం దగ్గరకెళ్ళండి - మీ ప్రతిబింబం మీతో ఏదన్నా సంభాషించ వచ్చు - వెళ్ళండి"

"అసాజ్జుడివయ్యా నువ్వు"

"అవునండి - ఇటువంటి ఘట్టాల్లో అద్దంలో చూచుకోవాలి గదా - ఆ మాటే అన్నాను".

"దేవాంతకుడివి"

"నేనేం కాదులెండి - ఎన్.టి.రామారావు! ఆ పాత్ర ధరించినది సి.పుల్లయ్య దర్శకత్వంలో..."

ఇంతలోనే వాళ్ళొచ్చారు. సలహాదారు, సిగిరెట్టు పీలుస్తూ మెడ బెణికినవాడల్లే - దాన్ని ఎటూ తిప్పకుండా, నిటారుగా పెట్టి, సిగరెట్లు పీలుస్తూ - స్లో మోషన్‌లో వచ్చాడు.

"రా, రా - ఈళ్ళే, మావోడు గుమ్మంలోనే ఎదురైనాడు ఈనే దర్శకుడు - ఈనే మావోడు. ఈడు సిన్నోడు. మనోడేలే" అన్నాడు నిర్మాత.

సలహాదారు నాకేసి, కొత్తగా సినిమాల్లోకి చేరబోతున్న వాడి వేపు దర్శకుడు చూసినట్టు చూసాడు- "యూ ఆర్ మహాశయ్....." అని తల తాటించాడు - ఫలానా వేపు చూస్తూ.

"హి ఈజ్ దీ డైరెక్టర్ సార్" అన్నాడు ఫలానా నా వేపుచూపిస్తూ.

"యస్" అన్నాను నేను.

"ఐసీ" అన్నాడు సలహాదారు.

"ఏందయ్యోవ్ - తెలుగు సినెమ్మాయా, మనం తీసేది! ఇంగ్లీషు ఆపండి... ఏందయ్యా, కతకట్టినారా?" అన్నాడు నిర్మాత చుట్ట వెలిగిస్తూ.

"నాలుగు కతలు కట్టాంగాని గురువుగారూ - నచ్చక విప్పి పారేశాం" అన్నాడు ఫలానా.

"పారేయటం ఎందుకురా - ఉంచుకుంటే ఎట్టాగోట్టా పనికి రాకపోద్దా?"

"వాట్ వాజ్ యువర్ ప్రీవియస్ పిక్చర్?" అన్నాడు. రోగిని రోగం గురించి ప్రశ్నించిన డాక్టరులా మొహం వాడునూ ఆ సలహాదారు చెప్పాను.

"అట్టర్ ఫ్లాప్ ఐ సపోజ్"

"అఫ్‌కోర్సు"

"సలహా! ఇంకాపి, తెలుగులో కానీండయ్యా - ఆ కతేటో నాకు అరదమవుద్ది".

"ఇంకా కథలోకి రాలేదులెండి - ఉపోద్ఘా తంలో ఉన్నాం సరే - ఫ్రెండున్నాడు. తెరమీద రచయితగా ఇంతవరకూ పేరు పడలేదు గానీ - జీనియస్, చాలామంది పెద్ద రచయితలకి దోస్తుగా ఉండేవాడు. అతనికి కబురు చేస్తాను" అని, సలహా టేబిలు మీద ఉన్న నిర్మాతగారి బొక్కి బ్యాటరీలైటు ఎత్తాడు - ఫోను ఎత్తినట్టు.

"నన్నేల్లమంటావా?" అని లేచాడు నిర్మాత.

"నో, నో, ఐ మస్టు గో - పైగా, ఇప్పుడతను మనకు దొరకడు. ఏ రచయితనో, 'దయ్యం'లా పట్టుకొని ఉండి ఉంటాడు - డబ్బు కోసం! రేపు పొద్దున్నే తీసుకొస్తాను" అని లేచాడు సలహా.

"కాఫీ తీసుకుని పోతావేటి సలహా!" అన్నాడు నిర్మాత.

"ఎందుకులెండి, బయట ఎక్కడన్నా... సరే! తెప్పించండి" అని కూచున్నాడు. నిర్మాత కాఫీ తెప్పించాడు. నలుగురం తాగాము.

ఆ మర్నాడు ఉదయం కలిశాం. రాత్రి నేను నిర్మాత రూములోనే తిని, అక్కడే నిద్రపోయాను. పాపం, ఫలానా పదకొండింటి దాకా ఉండి, వాడి రూముకు పోయాడు. తొమ్మిది గంటలకల్లా సలహాదారు రచయితను తీసుకొచ్చాడు. అతను యువకుడు ఐతే, కాస్త వయసుమీరిన వాడల్లే కనిపించాడు - దిగుళ్ళవల్ల.

"ఊఁ - కతగానీ" అన్నాడు నిర్మాత, చుట్ట ముట్టించి - సరిగ్గా మంచం మీద వాలి.

"కథ అంటే ఏం కావాలి? సాంఘికమా, జానపదమా, పురాణమా, చరిత్రాత్మకమా, బెంగాలీనా?" అని అడిగాడు రచయిత.

"బెంగాలీ" అన్నాడు ఫలానా చటుక్కున.

"అదయితే ఢోకా ఉండదు. ఢంకా బజా యించవచ్చు" అన్నాడు సలహా.

"ఓ యస్ - 'సేఫ్టీ" అన్నాను నేను.

ఇంతలో నిర్మాత లేచాడు - "ఏందయ్యా, తెలుగుకాదటయ్యా మనం తీసేది?" అన్నాడు ఆశ్చర్యంగా.

"తెలుగే. కథ మాత్రం బెంగాలీనుంచి తీసుకుంటాం. మాటలూ, పాటలూ అన్నీ తెలుగులోనే ఉంటాయి" అన్నాను నేను.

"అట్ట జెప్పు" అని మళ్ళీ వాలిపోయాడు నిర్మాత.

రచయిత పెద్ద కాయితాలబొత్తు విప్పుతూ ఉండగా నేను అడిగాను.

"మీకు బెంగాలీ వచ్చునా ఏమిటండీ?"

"నో. రాదు. నాకు ఓ మిత్రుడు - తెలుగు అతనే. కలకత్తాలో ఉన్నాడు. అతనికి బెంగాలీ బాగా వచ్చును. అతను అక్కడ ప్రతి బెంగాలీ చిత్రమూ చూసి, ఎప్పటికప్పుడు 'కథ' అంతా నాకు రాసి పంపేస్తూ ఉంటాడు. అందులో నాకు నచ్చినవాటిని వేరేగా ఉంచుతూ ఉంటాను. మిగతావి కూడా ఉంటాయి. ఇది చాలా పెద్ద రహస్యం సుమండీ - ఇంకెక్కడా అనకండి. అన్నారంటే బెంగాలీ వాళ్లకూ మనకూ చిత్ర భేదాభిప్రాయాలు వచ్చేస్తాయి. అఫ్‌కోర్స్ వాళ్ల చిత్రాన్ని మనం తీసుకున్నా - దానికీ, మన చిత్రానికీ కావలసినంత చిత్రభేదం ఉంటుందనుకోండి. ఐతే, ఈ కథల్లో మీకే కథ నచ్చినా సరే - మనం డైరెక్టుగా వాళ్లకు రాసి, రైట్స్ కొనుక్కోటం ముఖ్యం" అన్నాడు రచయిత.

"అద్దీ" అన్నాడు సలహా.

"ఐతే ఎందుకులేవయ్యా - నీదగ్గరేవా నువ్వు కట్టిన కతలు -"

"నేను కట్టిన కథలూ అనేకం ఉన్నాయి - 'నా కట్టుకథలు' అముద్రిత గ్రంథంలో, ఐతే అవి మీకు నచ్చవు. సత్యజిత్‌రాయ్ కోసం అట్టే పెట్టిన సబ్జెక్టు".

"ఏందయ్యా సలహా - ఇలాంటోడిని లాక్కొచ్చినావూ" అన్నాడు నిర్మాత చిరాగ్గా.

"చిరాకులు, పరాకులూ చిత్రసీమయందు పనికి రావు. బెంగాలీ కథ అంటే దానికున్న వాల్యూ వేరు - తెలుగు కథ ఎప్పుడైనా తెలుక్కదే!" అన్నాడు సలహా.

(ఇంకా వుంది)




బదువుల్రావు
సత్యమూర్తి BV
ఆరోజు క్లాసువాళ్లంతా కలిసి ఎక్స్‌కర్షన్‌కి బయలుదేరారు. స్టేషన్‌లో
మిస్టర్... నీపేరు బదువుల్రావు కదూ? నిన్ను అరెస్టు చేస్తున్నాం
మీరేమీ కలగజేసుకోకండి మాస్టారూ. బాగా అయింది వెధవకి. లేకపోతే నన్ను క్లాసులో 'అల్లంపచ్చడి' అని పిలుస్తాడూ?
మరే... నన్ను మాత్రం... నేను మొన్న పదిరూపాయల చిల్లరకోసం ఒక మిలిటరీ హోటల్లోకెళ్తే, నేను కోడిపలావ్ తినడానికే వెళ్లానని కాలేజీ అంతా టముకేసి నాకు 'కోడిపలావ్' అని పేరు పెట్టాడూ?
బాగా రోగం కుదిరింది. అలాగే అరెస్టయి జైల్లో పడివుండాలి. లేకపోతే నన్ను డీసెల్ ఇంజన్, పొటేటో అని అంటాడా?
పాపం, ఆయన్ని అనవసరంగా అరెస్టు చేస్తున్నారు. అసలే పాపం అమాయకుడు
నీకు భాస్కర్రావు అనే అతను తెలుసా?
మా క్లాస్లో ఉన్నప్పుడు ఒక ఫ్రెండ్ ఉండేవాడండి ఆ పేరుతో...
!!! ! !!!!!
నేనేరా వాణ్ణి... ఫూల్

# లలిత సంగీతం



## ఎవరికున్నది యింత శక్తి



ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993

ప॥ ఎవరికున్నది ఎవరికున్నది
ఎవరికున్నది యింతశక్తి
ఓ మహాత్మా! ఓ మహామహితాత్మగాంధీ!

1. చ॥ ఎవరికున్నది ఎవరికున్నది ఏది నీ సేవానురక్తి
ఎవరికున్నది ఎవరికున్నది ఎన్నగానీ ఆత్మశక్తి

2. చ॥ తలపు తలపున తాకుసరికే తలపు వాకిట రాకమునుపే
తరుణమున ఆచరణలో సంతర్పణము గావించి చూపగ

3. చ॥ శాంత్యహింసలె శ్వాసములుగా నిత్య ప్రార్థనయే తపమ్ముగ
సత్యసాధనలోని జీవన సారమును వడబోసి చూపగ

| | |
|---|---|
| రచన | : ఆచార్య డా॥ వేటూరి ఆనందమూర్తి |
| గానం | : శ్రీమతి వేదవతి ప్రభాకరరావు |
| సంగీతం | : ఎం.చిత్తరంజన్ |
| రాగం | : కీరవాణి 21వ మేళ కర్త |
| తాళం | : మిశ్రచాపు (కర్ణాటక సం॥) రూపక్‌తాల్ (హిందుస్తాని సం॥) |
| ఆరోహణ | : స రి గ మ ప ద ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స |

-షడ్జమ, చతుశృతి రిషభం, సాధారణ గాంధారం, శుద్ధమధ్యమం,

పంచమం, శుద్ధదైవతం, కాకలి నిషాదం - యీ రాగంలోని స్వరాలు.

అన్యస్వరమైన కైశికి నిషాదాన్ని కూడా చేర్చి యీ పాటకు బాణీని కూర్చాను. కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో కీరవాణి ప్రసిద్ధి నొందిన రాగం. లలిత సంగీతంలో కూడా చాలామంది స్వరకర్తలు యీ రాగాన్ని ఉపయోగించి మధురమైన పాటలను అందిస్తున్నారు. కర్ణాటక సంగీతం నుండి యీ రాగాన్ని స్వీకరించి చాలామంది హిందుస్తాని విద్వాంసులు ఎక్కువగా లలిత శాస్త్రీయ రచనలకు అనగా ఠుమ్రి, భజన్ మొదలగు వాటికి కీరవాణిని ఉపయోగించారు. సుప్రసిద్ధ హిందుస్తాని విద్వాంసుడు ఉస్తాద్ బడే గులాం అలీఖాన్ యీ రాగానికి కొన్ని అన్యస్వరాలను చేర్చి "మిశ్ర్ కీరవాణి" రాగంలో పాడిన "కాకరూఁ సజనీ ఆయేన బాలమ్" అనే ఠుమ్రి యావద్భారతాన్ని ఒక ఊపు ఊపేసింది. అతి శ్రావ్యంగాను, భావయుక్తంగాను ఆయన తన కచేరీలలో యీ ఠుమ్రిని గానం చేసేవారు. నా చిన్నతనంలో అలాంటి కచేరీలు ఆయనవి కొన్నిటిని నేను విన్నాను. బడే గులాం గారికి ఘంటసాల తన నివాసంలో సుమారు 2 నెలల పాటు ఆతిథ్యమిచ్చిన సందర్భంలో ఖాన్‌గారి సంగీతం తనను ఎంతో ప్రభావితం చేసిందని ఘంటసాల గారే ఒకసారి నాతో అన్నారు. "చిరంజీవులు" చిత్రంలోని "ఏ నాటికైనా నీదాననే" అంటూ పి.లీల గానం చేసిన పాటకు బాణీని కూర్చడంలో ఘంటసాల గారిపై ఖాన్‌గారి యీ ఠుమ్రి ప్రభావం బాగా కనబడుతుంది. మరాఠీ నాటకాలలో కూడా విష్ణుదాస్‌భావే, కిర్లోస్కర్ వంటి విద్వాంసులు కీరవాణి రాగాన్ని స్వీకరించి వారి నాటకాలలోని పాటలకు కూర్చిన బాణీలు ఎంతో ప్రాచుర్యాన్ని పొందినవని వెనుకటి తరం వారు చెబుతారు.

హిమాలయ పర్వతాన్ని అద్దంలో చూపినంత అలవోకగా ఔన్నత్య శిఖరాలతో అంబరాన్ని



చుంబించిన గాంధీజీ అద్భుత వ్యక్తిత్వాన్ని అలతి అలతి మాటలతో రూపు కట్టించారు "ఎవరికున్నది యింత శక్తి" అనే యీ పాటలో ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారు. ఎవరికున్నది అనే చిన్నప్రశ్నతో గాంధీజీ వ్యక్తిత్వం అనితరసాధ్యమని, నభూతో నభవిష్యతి అని ఒత్తి పలికారు. ఆలోచన మెదిలే లోపలనే ఆచరణలో సాఫల్యం సాధించిన ఆయన ఆత్మశక్తిని శాంతి అహింసలే ఉచ్ఛ్వాస నిశ్వాసలుగా సత్యసాధనలో జీవించి నిత్య ప్రార్థనలో జీవితానికి ముగింపు పలికిన ఆదర్శ పురుషుడైన మహాత్మునికి మన జాతిపితకు ఆనందమూర్తి గారొసగిన అక్షర నీరాజనం యీ గీతం.

## శ్రీమతి వేదవతి ప్రభాకరరావు

చిన్నతనంలోనే బెంగుళూరు వాస్తవ్యురాలైన శ్రీమతి చెన్నమ్మ వద్ద కర్ణాటక సంగీతాన్ని అభ్యసించిన శ్రీమతి వేదవతి తన కమ్మని కంఠంతో శ్రోతలను అలరిస్తూ



అనతికాలంలోనే మంచి గుర్తింపు పొందినది. 1969 నుండి ఆకాశవాణి ద్వారా సర్వశ్రీ మంచాళ జగన్నాథ రావు, ఈమని శంకరశాస్త్రి, పాలగుమ్మి విశ్వనాథం, రజని, శ్రీమతి అనసూయ మొదలగు స్వరకర్తల సంగీత నిర్వహణలో వేదవతి పాడిన పాటలు బహుళ జనాదరణ పొందినవి. 1974లో అక్టోబర్ 2వ తేది గాంధీ జయంతిని పురస్కరించుకుని "ఎవరికున్నది యింత శక్తి" అనే ఆనందమూర్తి గారి యీ గేయాన్ని నా సంగీత నిర్వహణలో వేదవతి పాడగా "ఈ మాసపు పాట"గా ప్రసారమయింది ఆకాశవాణిలో. "కొమ్మలలో కోయిలనై కూయనా", "విరబూసి యిరుల తరులు", "నా అన్నవారెవరు" మొదలగు గీతాలు, "త్రిపథ" మొదలగు సంగీత రూపకాలలోని పాటలు నా సంగీత నిర్వహణలో వేదవతి గానం చేసిన కమనీయ గీతాలలో మచ్చుకు కొన్ని. పాలగుమ్మిగారు రచించి స్వరపరచిన "అమ్మదొంగా" అనే ఆమె సోలో గీతం, ఈమని శంకరశాస్త్రి గారి సంగీత నిర్వహణలో నేను, వేదవతి పాడిన "సుమవనిలో రసధునిలా" అనే కోపల్లె శివరాం రచన మొదలైనవి చాలా పాప్యులర్ అయినాయి. భక్తిరంజని కార్యక్రమాలలో కూడా ఆమె పాడిన పాటలెన్నో వున్నాయి. దూరదర్శన్‌లో 1978 నుండి ఆమె ఎన్నో కార్యక్రమాలలో పాల్గొనగా యీ నాటికీ అవి ప్రసారమౌతూ వుంటాయి తరచుగా. డా॥ సి.నారాయణరెడ్డి గారు రచించిన "మీరా భజనలు" పెండ్యాల సంగీతంలో వేదవతి పాడగా హెచ్.ఎం.వి వారు రికార్డులుగా వెలువరించారు. ఇవేకాక షిర్డీ సాయిబాబా, రాఘవేంద్రస్వామి, జోగులాంబ, రామకృష్ణ పరమహంస మున్నగు వారి స్తుతి గీతాలు ఆమె గానం చేయగా క్యాసెట్లుగా విడుదలైనాయి. టి.టి.డి. వారి ఆధ్వర్యంలో అన్నమయ్య గీతాలను ఆయన జయంతికి, వర్ధంతికి, తిరుపతిలోను, తాళ్ళపాకలోను వేదవతి గానం చేయగా హిందు, ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రిక మొదలగు పత్రికల వారు ఎంతగానో ప్రశంసించారు. సంస్కృతభాషలో శ్రీ జి.వి.అయ్యర్ దర్శకత్వంలో రూపొందిన "ఆది శంకరా





చార్య" చిత్రానికి సంగీత దర్శకత్వం వహించిన డా॥ బాలమురళీగారు వేదవతి చేత ఆ చిత్రంలో పాడించారు. ఆ చిత్రానికి అవార్డు కూడా లభించింది. ఇంగ్లాండు, అమెరికా, కెనడా మొదలైన దేశాలలో తన గాన కౌశలాన్ని ప్రదర్శించి పలు ప్రశంసలను సత్కారాలను అందుకున్నది ఆమె. 1997లో ఢిల్లీలో ఆకాశవాణి వారు ఏర్పాటుచేసిన జాతీయ కార్యక్రమంలో పాలగుమ్మి వారి నిర్వహణలో వేదవతి, మోహనరాజు లలిత, భక్తిగీతాలను ఆలపించారు.

సహజంగా పుట్టుకతో అబ్బిన సహృదయత, వినయము, విధేయత వేదవతి వ్యక్తిత్వానికి ఆభరణాలై, సంగీతంలో ఉన్నత స్థితిని సాధించాలన్న తపనతో ఆమె చేసిన కృషికి తోడై సుప్రసిద్ధ గాయనిగా ఆమెను తీర్చిదిద్దాయి. ఇంకా మరెన్నో మన్ననలు, సత్కారాలు, "శ్వేతకోకిల" వంటి బిరుదులు పొందిన సుమధుర గాయని శ్రీమతి వేదవతికి ఆమె శ్రీవారు మాన్యులు శ్రీ ప్రభాకరరావుగారే (రిటైర్డు డి.జి.పి) కొండంత అండ. సంగీతమన్నా, సంగీత కళాకారులన్నా ఎంతగానో అభిమానించే ప్రభాకరరావుగారు, శ్రీమతి వేదవతి నాకు, మా కుటుంబ సభ్యులకు అత్యంత ఆత్మీయులు, సన్నిహితులు.

## ఆచార్య డా॥ వేటూరి ఆనందమూర్తి

"మల్లెచెట్టుకు మల్లె పూవే పూస్తుంది. మధుర పరీమళాలనే అందిస్తుంది" సాహితీ ప్రభాకరులు, పుంభావ సరస్వతీ మూర్తులు అయిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారి సుపుత్రులు శ్రీ వేటూరి ఆనందమూర్తి గారిని తలచుకోగానే అనిపించే మాట యిది. శ్రీ వేటూరి ఆనందమూర్తి గారు 1930 అక్టోబర్ 29వ తేదీన శ్రీ



వేటూరి ప్రభాకరశాస్త్రి ముద్దుల (మూడవ) సంతానంగా జన్మించారు. శ్రీ రాళ్ళపల్లి అనంతశర్మగారు 'యథా పితా తథా పుత్రః' అని ఆశీర్వాదం చేశారు. అది ముమ్మాటికీ అక్షర సత్యం - 1955లో మద్రాసు యూనివర్సిటీ నుండి ఎం.ఎ. (తెలుగు) పట్టాను పొందారు. తాళ్ళపాక వారి సాహిత్యం పరిశోధించి 65లో ఉస్మానియా యూనివర్సిటీ నుండి డాక్టరేట్ పొందారు. ఆనందమూర్తి గారి వారసత్వము, ప్రవృత్తి కూడా సాహిత్యమే కాబట్టి. తమ అపూర్వ విజ్ఞాన బీజాలను వెదజల్లటానికి సుక్షేత్రమైన అధ్యాపక వృత్తిలో స్థిరపడ్డారు. ఆదర్శ అధ్యాపకుడుగా, అమృత మూర్తిగా రస హృదయుడుగా విద్యార్థులను, సాహితీ ప్రియులను, ఆత్మీయులను అలరించారు. శ్రీ వేటూరి ఆనందమూర్తి గారి వద్ద విద్యార్థిగా చదువు కోవటం నా అదృష్టంగా భావిస్తాను. ఉస్మానియా యూనివర్సిటీలో రీడర్‌గా పని చేస్తున్న ఆనందమూర్తి గారు 1966లో ప్రభుత్వం చేత మారిషస్‌లో నియుక్తులయ్యారు. దాదాపు 8 సం॥ విద్యాధికారిగాను, 3 సం॥ విజిటింగ్ ప్రొఫెసర్‌గాను పని చేశారు. దేశ విదేశాలలో శతాధికంగా పత్రాలు సమర్పించారు. వారి పరిశోధనా వ్యాసం మాత్రమే కాక పూలవిందు (గేయాలు) ముకుందమాల (పద్యానువాదం) వరదయ్య (నాటిక), రసాలము (రేడియో గేయ నాటికలు) వ్యాసాలు - రేడియో ఉపన్యాసాలు మొ॥ గ్రంథాలెన్నో ప్రచురించారు. ఇంకా ఎన్నో గ్రంథాలు వీరి లేఖిని నుండి వెలువడి అముద్రితాలుగా ఉన్నాయి. ఆకాశవాణికై ఆయన రచించిన "ఈ తరం మారిందిరా - అంతరం లేదందిరా" మొదలగు గీతాలను, మారిషస్ దేశం మీద ఆయన రచించిన రెండు గీతాలను "వందనమభి వందనం" "ధన్యవహోమాతృభూమి" నేను స్వరపరచాను. మంచాళ జగన్నాథరావు, పాలగుమ్మి విశ్వనాథం మున్నగువారు ఆనందమూర్తిగారి లలిత గీతాలను ఆకాశవాణిలో స్వరపరచగా పలుసార్లు ప్రసారమై ఎంతో ప్రాచుర్యాన్ని పొందినవి. "శ్రీ చిత్తరంజనం" అనే నా వాగ్గేయ సంపుటికి తమ అమూల్యమైన అభిప్రాయాన్ని వెలిబుచ్చి ఆశీరభినందనలు తెలిపారు.

### కీరవాణి రాగం ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

తెలుగు

| | పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|---|
| 1. | పతిరూపము నీయరయా (రాగమాలిక - ఇందులో పల్లవి మాత్రం కీరవాణి రాగం) | బాలరాజు | ఎస్.వరలక్ష్మి | గాలిపెంచల నరసింహారావు |
| 2. | ఏ నాటికైనా నీదాననే | చిరంజీవులు | పి.లీల | ఘంటసాల |
| 3. | కీరవాణి... చిలకలా.. కొలికిరో | అన్వేషణ | బాలు, జానకి | ఇళయరాజా |
| 4. | ముక్కోటి దేవతలు ఒక్కటైనారు (ఇందులో కనకదుర్గను స్తుతించే "ఎల్లలోకాలకు తల్లివై నీ వుండ" అనే చరణం మాత్రం కీరవాణి రాగం) | బావామరదళ్ళు | ఘంటసాల | పెండ్యాల |
| 5. | వల్లభా... ప్రియవల్లభా | శ్రీకాకుళ ఆంధ్ర మహావిష్ణువు కథ | యస్.జానకి | పెండ్యాల |




"రీ రికార్డింగ్‌లో కూడా విజయం సాధించినవాడే నిజమైన సంగీత దర్శకుడు" అని చెప్పిన జి.కె.వెంకటేశ్ శిష్యులలో మరో ప్రముఖుడు ఎల్.వైద్యనాథన్. "పుష్పక విమానం" మూకీ చిత్రానికి జరిపిన "రీ రికార్డింగ్"లో వైద్యనాథన్ అసాధారణమైన ప్రతిభను కనబరచి ఈ విషయాన్ని నిరూపించాడు.

-అదృష్ట దీపక్
సినీగేయ రచయిత, రామచంద్రపురం

'జయసింహ'లోని 'మదిలోని మధురభావం' రెండవ చరణానికి కొనసాగింపుగా ఉన్న మరొక చరణం 'మింటిపైనా వెలుగారి పోయే' - హెచ్.ఎం.వి వారి ఎస్.పి.హెచ్.ఓ. 848211 నంబరు కేసెట్లో ఉంది. ఇది 'మహామంత్రి తిమ్మరసు', 'జయసింహ' చిత్రాల పాటల కేసెట్. 'తిమ్మరసు' పాటల తర్వాత 'జయసింహ'లోని పై పాట పూర్తిగా వుంది. మీరు రాసిన 848261 నెంబరు కేసెట్ ఏమిటి?

-పి.జగన్నాథరావు, విశాఖపట్నం.

జయసింహ, కన్యాశుల్కం సినిమాలతో వచ్చిన కాంబినేషన్ క్యాసెట్ అది.

-ఎడిటర్

'హాసం' 24వ సంచిక పేజీ 11లో నూర్జహాన్ ఐటమ్ క్రింద అచ్చుకాకుండా పోయిన మేటర్ - ఒక గాయని, ఒక నటుడు - మధ్య నియంత నీలి నీడలు:

పాకిస్తానీ నటుడు ఎజాజ్ దొరానీ తనకంటె పదేళ్ళ పెద్దయిన నూర్జహాన్‌ను ప్రేమించి పెళ్లాడాడు. కానీ యాహ్యాఖాన్‌తో ఆమెకు సంబంధం ఉందని ప్రచారం జరగడంతో డైవోర్స్‌కు అప్లయ్ చేశాడు. నూర్జహాన్ విడాకు లివ్వనంది. లాహోర్ కోర్టు భర్త పక్షం వహించింది. యాహ్యాఖాన్ పదవీచ్యుతుడయ్యాక కోర్టు కేసు రీ ఓపెన్ చేసింది. కానీ ఈసారి నూర్జహాన్ విడాకులు కోరింది.

---



'కళత్తూర్ కణ్ణమ్మ' అనే తమిళ చిత్రంలోని ఈ ఫొటోకి చాలా ప్రాముఖ్యత ఉంది. ఇందులో సావిత్రితో పాట ఉన్నది (అప్పటి బాల) నటుడు కమల్‌హాసన్. ఈ 'కళత్తూర్ కణ్ణమ్మ' సినిమాని తెలుగులో 'మా వూరి అమ్మాయి' అనే పేరుతో డబ్ చేశారు. ఇందులోని 'కనిపెంచు తల్లీ! కాపాడు తండ్రి' పాట ఆ రోజుల్లో చాలా పాపులర్. అందుకే ఈ చిత్రాన్ని హిందీలో 'మై చుప్ రహూంగీ' పేరిట నిర్మించినప్పుడు 'తుమీ హో మాతా పితా తుమీ హో' పాటకు ఆ చిత్ర సంగీత దర్శకుడు చిత్రగుప్త "కనిపెంచు తల్లీ! కాపాడు తండ్రి" పాట ట్యూన్‌నే ఉపయోగించారు. 'మై చుప్ రహూంగీ' సినిమాని తిరిగి ఎ.వి.ఎం. వారే తెలుగులో 'మూగనోము'గా నిర్మించారు. 'మై చుప్ రహూంగీ' సినిమాని తిరిగి తెలుగులో 'మూగనోము'గా నిర్మించినప్పుడు ఈ ట్యూన్‌ని ఉపయోగించకుండా కేవలం సాహిత్యాన్ని మాత్రమే అనుసరించారు. ఆ పాటే 'తల్లివి నీవే / తండ్రివి నీవే / చల్లగ కరుణించే దైవము నీవే". ఈ మూడు పాటలూ హిట్టే. అప్పటి 'కళత్తూర్ కణ్ణమ్మ' సినిమాకి సంగీత దర్శకత్వం వహించినది సుదర్శనం అయితే 'మూగనోము' సినిమాకి సంగీతాన్నిచ్చింది ఆయన తమ్ముడు గోవర్ధనం. కమల్‌హాసన్‌పై ఆనాడు చిత్రీకరించిన 'మా వూరి అమ్మాయి' లోని 'కనిపెంచు తల్లీ! కాపాడు తండ్రి' పాటను 'పాటకుల' కోసం ఇక్కడ పొందు పరుస్తున్నాం. కమల్ అభినయానికి ముగ్ధులై పాటల పుస్తకంలో అతని పేరుని ఎంత ప్రముఖంగా ఆ రోజుల్లో వేశారో గమనించండి.

ఈ పాటల పుస్తకాన్ని 'హాసం' ఆఫీసుకు పంపి సినీ సంగీతాభిమానులకు ఈ సమాచారాన్ని ఇవ్వడానికి తోడ్పడిన జూపూడి రూపవతీదేవి, (హైదరాబాద్) గారికి 'హాసం' కృతజ్ఞతలు.

గానం: యమ్.యస్. రాజేశ్వరి
& కోరస్

కనిపెంచు తల్లీ!
కాపాడు తండ్రీ!
ఆపదలో ఆదరించు దైవము నీవే!
॥కనిపెంచు॥
తండ్రెవరో! తల్లెవరో! తెలియగలేమూ మేము
ఏడ్చిననూ జాలిగొను దాతల గనమూ
కన్నీరె ఈ బ్రతుకున ఉగ్గుపాలయే
ఈ అసహాయుల
పలుకులనూ ఆలకించవో
భగవాన్ ! భగవాన్!
భగవాన్! ॥కనిపెంచు॥
ముద్దకలిపి ఎవరు మాకు బువ్వపెట్టరు
మమ్ము ప్రీతిమీర ఒడిని
చేర్చి నిదుర పుచ్చరు
లోకమున పాపలపై ఈ పగేలనో!
ఈ అసహాయుల
పలుకులనూ ఆలకించవో
భగవాన్! భగవాన్!
భగవాన్! ॥కనిపెంచు॥

ఎం. ఆర్. ఎం. ప్రొదక్షన్సు
" మావూరి అమ్మాయి "

నటులు:
జెమిని గణేశన్
T. S. బాలయ్య ... S. V. సుబ్బయ్య
జావర్ N. సీతారామన్ ... V. R. రాజగోపాల్
S. L. నారాయణ్ ... K. M. నంబిరాజన్
S. A. కణ్ణన్, అశోకన్ (గౌరవ నటుడు) మాలి, చంద్రన్, భైరవ సుందరం, పద్మాకరం, నటరాజన్, మాస్టర్ దశరథన్, V. S. మణి, మాస్టర్ ఈశ్వరన్
మరియు
ఆంధ్రదేశమునకు ప్రప్రథమంగా ఎం. ఆర్. ఎం. ప్రొడక్షన్సు సమర్పించు నూతన బాల నటుడు కమలహాసన్

నటీమణులు:
సావిత్రి
దేవిక, L. విజయలక్ష్మి, మనోరమ, N. లలిత, S. R. జానకి, అంగముత్తు, రాధాబాయ్, వితోబాయ్

కథ: జావర్ N. సీతారామన్, M.A., B.L.
మాటలు, పాటలు: అనిసెట్టి
సంగీతం: R. సుదర్శనం
నిర్వహణ: G. V. నాగేశ్వరరావు
సహాయకుడు: కొంచెటి లక్ష్మణరావు, B.A.
నిర్మాతలు: A. వీరప్పన్, M. కుమరన్
దర్శకత్వం: A. భీమ్‌సింగ్
స్టూడియో: ఏవి. ఎం.

# వెంకట సామయ్య

**కార్వేటి నగరాధీశులు కొంతకాలం చంద్రగిరి పాలకులకు సామంతులుగా ఉంటూ కప్పం కట్టేవారు.**

**ఉత్తర ఆర్కాట్ మండలంలో కొంత - చిత్తూరు ప్రాంతంలోని కొంత భాగం కలిసిన కార్వేటి నగరం ప్రాచీనమైన సంస్థానాల్లో ఒకటి.**

**కార్వేటి సంస్థానాధీశులు - కాళహస్తి సంస్థానాధీశులు తమ తమ ప్రాంతాల విస్తరణ కోసం చుట్టుపక్కల దండ యాత్రలు సాగిస్తూ.... అవసరమైనప్పుడు కర్ణాటక నవాబు దగ్గర్నించి సైన్యాన్ని తెచ్చుకుంటూ ఉండేవారు...**

**సరే తర్వాత పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చిందని....**

**కుంపిణీవారు రావడం.... రెండు సంస్థానాలూ కిమ్మనకుండా కప్పం కట్టడం చరిత్ర....**

**అయితే ఎంత యుద్ధకాంక్ష ఉన్నా... కార్వేటి వారు సంగీత సాహిత్య ప్రియులే కాకుండా స్వయంగా గానకళాకోవిదులు.**

**ఈ సంస్థానాన్ని 1719 - లగాయితూ వెంకట పెరుమాళ్ళ రాజు పరిపాలిస్తూ ఉండేవాడు....**

ఆయన హయాంలోని వాడే వెంకట సామయ్య!

వెంకట సామయ్య సంగీతమే కాకుండా భరత నాట్యాన్ని కూలంకషంగా అధ్యయనం చేసిన పండితుడు... మంచి రూపసి!

రసికుడైన వెంకట పెరుమాళ్ళు ఆస్థానంలో తరచూ సంగీత సాహిత్య కార్యక్రమాలు జరుగుతూ ఉండేవి!...

ఒక సంధ్య వేళ!

ఆ స్థానంలో భామాకలాపం....

"భామనే.... సత్యభామనే....

భామనే పదియారు వేలా కోమలూలందరిలోనా...."

పెరుమాళ్ళ రాజు అప్రతిభుడై పోయాడు...

ముగ్ధమోహనరూపం!

పారిజాతపహరణంలో ముక్కుతిమ్మన సత్యభామా?

మనుచరిత్రలో పెద్దన వరూధినా?

కనుబొమ్మల విల్లుల్లోంచి చూపుల తూపులు పెరుమాళ్ళ గుండె నిండిపోయి అంపశయ్య అయిపోయి....

కొరడావంటి జడ కటిమీద ఆడినప్పుడల్లా... గుండె ఆగిపోయినంత పనైపోతోంది. మధ్యమధ్య... మందహాసం మంటెక్కిచ్చేస్తోంది.

రాజా వారు ఊపిరి బిగబట్టి చూస్తున్నాడు....

రూపుకట్టిన శృంగారం....

ఆపుకోలేని ఉద్వేగం...

భామ - కలాపాన్ని కట్టి పెట్టీ...

కులుకులు పోతూ అడిగింది.... గజగమన....

"రాజా.... తమరీ మత్తేభాన్ని కొంటారా" అని అధరాన్ని మునిపంటితో నొక్కుతూ శ్లేషాత్మకంగా...."

"కొనడమేమిటి జీవితాంతం వైభవోపేతంగా పోషిస్తాం కూడా!...." అన్నారు పెరుమాళ్ళు మరింత రసాత్మకంగా....

"అయితే వినండి... ఈ భామ సత్యభామ కాదు... 'అసత్యభామ...' " అంటూ వేషం విప్పాడు గోవింద సామయ్య!....

ఖంగుతిన్న పెరుమాళ్ళ వారు... ఒక్క క్షణం మాన్పడిపోయి... మళ్ళీ తేరుకుని వెంటనే కావలించుకోవోయి.... మళ్ళీ ఆగి... చప్పట్లు కొడుతూ పెద్దగా నవ్వేశారు!....

"నీ దుంపతెగా... మగాడివిటయ్యా....

చెమట్లు పట్టించేశావ్....."

అని పెరుమాళ్ళు వారు మహానంద పడిపోయారు.

ప్రణామం చేసాడు... గోవింద సామయ్య....

భేష్... నీ కట్టూ... బొట్టూ.... ఆడాళ్ళు బలాదూర్ అనిపించావ్...

గట్టి పిండాన్ని గాబట్టి తట్టుకోగలిగాను... జాగర్త.... ఇది దివాణం.... అన్నారు చిలిపిగా.....

వెంటనే... ఆయనకి ఆస్థాన కళాకారుడి పదవిచ్చేసారు!!

సరే... ఆస్థానంలో విద్వాంసుడయ్యాడు వెంకట సామయ్య.

ఈలోగా ఒక సంఘటన జరిగిందట.... జరిగిందో లేదో పరమేశ్వరుడికే తెలియాలి గానీ... వినడానికి బావుంది...

క్షణక్షణముల్ జవరాల చిత్తముల్ అంటాం గానీ....రాజుల చిత్తములు అరక్షణక్షణముల్ అని చెప్పుకోవాల్సి వొస్తుంది.

ఎప్పుడు కరుణవస్తుందో తెలీదు... వొచ్చిందీ... ధన కనక వస్తు వాహనము ధారాపాతంగా వచ్చి పడతాయ్....

కోపం వచ్చిందా!.... అయితే చెరసాల.... లేదా దేశబహిష్కరణ....

అలాంటి ప్రమాదమే వచ్చింది... ఎవరికీ సాక్షాత్తూ రాణీవారికి!....

ఏదో అభిప్రాయ భేదమొచ్చింది.... రాణిగారిని బైటకి వెళ్ళగొట్టాడు రాజు.... ఎదురు చెప్పే ఎవరు సాహసం చేస్తారు!

అప్పుడు... గోవింద సామయ్య..... రాణీ గారి దగ్గరకొచ్చి....

తల్లీ మీ ఉప్పు తిన్నాం.... మీరు కొన్నాళ్ళు మా ఇంట్లో ఉండండి అని... ఈ రహస్యం ఎవరికీ పొక్కకుండా ఉంచాడు....

గోవింద సామయ్యకు ఎలాగైనా రాణీగారినీ రాజాగారినీ కలపాలని ఉద్దేశం....

పరమేశ్వరుణ్ణి ప్రార్థించి...

రాణీగారికి నాట్యం నేర్పడం మొదలెట్టాడు.

రాణిగూడ శ్రద్ధగా నేర్చుకుంటోంది. స్వతహాగా... రాణికి నాట్యంలో ప్రవేశం ఉంది... కనక... కొన్నాళ్ళకే... ప్రావీణ్యం వొచ్చేసింది!

గోవిందసామయ్య.... రాణీవారికి సత్యభామ వేషం వేయించీ...

మళ్ళీ ఆస్థానంలో భామాకలాపం పెట్టించాడు!

సంధ్యవేళ!

**హాసం 16-31 జులై సంచికలో మీరు పరిచయం చేసిన సంగీతకర్తా, సంఘ సంస్కర్తా దాసు శ్రీరాములు గారి వివరణలు చదివి పాత కాలపు రోజులు (రేడియో, టీవీలు లేనప్పుడు) ఊహలతో మనస్సు అద్వైతానందభూతిని కలిగించినందులకు చాలా సంతోషం. మిగిలిన మహానుభావుల్ని కూడా తప్పక పరిచయం చేయండి.**

**-డా. కె.సుబ్బారావు, తిరుపతి**

ఈసారి 'సూత్రధారి' గోవింద సామయ్య....
తాళం వేస్తున్నాడు.
జగన్మోహనంగా నాట్యం చేస్తోంది...
ఆ - సత్యభామ!!
పెరుమాళ్ళు.... కళ్ళు పెద్దవి చేసుకుని చూస్తున్నాడు....
ఎవరీ రాశీభూత సౌందర్యం!
ప్రాంచద్భూషణ బాహుమూల రుచితో - ప్రవరుణ్ణి కావలించుకో బోయిన వరూధినా....
వాసవాది సురపుజా భాజనం బైన - కృష్ణుని శిరస్సుని ఎడం కాలితో తన్నిన శృంగారిణి - సత్యభామా!!
కర్పూరంలా కరుగుతోంది పెరుమాళ్ళు మనస్సు...
భామాకలాపం అయిపోయింది... తన్మయుడై పోయాడు ప్రభువు... ఏం కావాలో కోరుకొమ్మన్నాడు....!!
"మీ సాహచర్యం ప్రభూ....." అని పాదాల మీద పడిపోయిందా తల్లి!!
కన్నీళ్లతో దీనంగా చూసి.... రెండు చేతులూ జోడించి... ఏలుకోవయ్యా మహానుభావా అన్నట్టు చూసాడు గోవింద సామయ్య...
పెరుమాళ్ళు పశ్చాత్తాప పడ్డాడు!!
రాణి పరమానందపడింది...
ప్రజలు గోవింద సామయ్యని వేనోళ్ళ పొగిడారు...
కళకి ఓ ప్రయోజనం సిద్ధించింది...
కళాకారుడు పులకించి పోయాడు....
అప్పుడు రాణీవారు అభినయించిన మోహన వర్ణంలోని పదం ఇదీ-
"విరిబోణిని చలమూ మాని చెలిమితో ఏలుకోరా
నిన్నేనమ్ముకున్నదానిపై నెనరుంచరా....
సరసుడా... మన్మథకారా సద్గుణ సాంద్రా....
సామీ.... వెంకట పెరుమాళ్ళు రాజేంద్రా....!!"



-తనికెళ్ళ భరణి

**నా బాల్యంలో నేను చదవకుండా వీధుల్లో జులాయిగా తిరిగినప్పుడల్లా 'చదవకపోతే డొక్క చీల్చి డోలు కడతానని' మా అమ్మగారు నా మీద అరుస్తూ వుండేవారు. ఆనాడు ఆ వయసులో ఆ మాటలకి అర్థం తెలియక పోయినా భయపడి బలవంతాన పుస్తకం తీసి చదివే వాడిని. కానీ ఈ రోజు నేను పెద్దయ్యాక అలా డొక్కచీల్చేవాళ్ళు, భయపెట్టే వాళ్ళు లేకపోయినా ప్రతీసారి పుస్తకం తీసి మీ వ్యాసాలు ఇష్టంతో కంఠస్థం చేయాలనిపిస్తుంది. సంగీత వాగ్గేయకారుల గురించి మీరు వివరించే తీరు, తెలియచేసే పద్ధతి ఎంతో బావుంది. ముఖ్యంగా మీ శైలి మమ్మల్ని ఎంతో ఆకర్షిస్తోంది. ఇలాంటి వ్యాసాలు వ్రాస్తూ చిరంజీవిగా ఉండాలని కోరుకుంటూ...**

**-మామిడి మహేంద్ర, పూణే**

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు


**తనికెళ్ళ భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018


అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

## శిశుర్వేత్తి... చోరవేత్తి

సినిమాలలో దొంగలను ఏమార్చడానికి హీరోయిన్ ఆడి, పాడుతున్నట్టు చూపిస్తూంటే మనకు తమాషాగా అనిపిస్తుంది, దొంగలకు కూడా అంత రసహృదయం ఉంటుందాని. కానీ పండిట్ భీమ్‌సేన్ జోషి గురించి వ్రాసిన "స్వరధీరజ్" అనే మరాఠీ పుస్తకంలో ఉటంకించిన ఈ సంఘటన తెలుసుకుంటే అలాటి సందేహాలు దూరమవుతాయి. 1960 ల నాటి ముచ్చట ఇది. ఈ సందర్భంలో భీమ్‌సేన్ జోషితో బాటు ఉన్న అప్పా జల్‌గాంవ్‌కర్ మాటల్లోనే చెప్పాలంటే - " నేను జోషి సాబ్, ఇంకా కొంతమంది ఢిల్లీ నుండి బొంబాయికి కారులో వెళుతున్నాం. హై రోడ్ మీద గ్వాలియర్ దగ్గరకు చేరే సరికి రాత్రి పది అయ్యింది. కారులో పెట్రోలు పోయించుకోవడానికి పెట్రోలు బంక్‌కి వెళితే అక్కడ కుర్రాడు మమ్మల్ని హెచ్చరించాడు - 'ఇంకా ముందుకు వెళితే చంబల్ లోయ! బందిపోటు దొంగలు దోచుకుంటారు. రాత్రికి ఇక్కడే ఎక్కడో ఉండిపొండి' అని. కానీ జోషి సాబ్ ధైర్యం ఏమిటో గానీ ఫర్వాలేదు, ముందుకే వెళదాం అన్నారు. బిక్కు బిక్కుమంటూ వెళుతూండగానే కాస్సేపటికి రోడ్డుకు అడ్డంగా గోడ కట్టినట్లు మనుష్యులు. కారు ఆపవలసి వచ్చింది. అనుకున్నట్టుగానే వాళ్లు బందిపోటు దొంగలు. మేమంతా గడగడ వణుకుతున్నాం కానీ జోషి సాబ్ బెదరలేదు, చెదరలేదు.



"కారు డిక్కీ తెరవండి" ఆజ్ఞాపించాడు దొంగలనాయకుడు. తప్పుతుందా? తెరిచి చూపించాము. అక్కడ ఉన్న తాన్‌పురా చూసి నాయకుడు ఆశ్చర్యపడ్డాడు. "ఏమిటిది?" అని అడిగాడు. "తాన్‌పురా. సంగీత కచ్చేరీలలో ఉపయోగిస్తాం కదా, అదే'. అన్నాం. 'ఓహో మీరు సంగీతకారులా? అయితే మీలో గాయకుడు ఎవరు?' అని అడిగాడు నాయకుడు కుతూహలంగా. 'వారే, భీమ్‌సేన్ జోషి. ఈ కారూ ఆయనదే, మేమూ ఆయన మనుష్యులమే' అన్నాం.

మరుక్షణంలో దొంగల్లో మార్పు వచ్చింది. అప్పటికే రేడియో పుణ్యమాని శాస్త్రీయ సంగీతం జనసామాన్యంలోకి పాకింది. భీమ్‌సేన్ జోషి పేరు మామూలు ప్రజలకు కూడా సుపరిచితం అయింది. 'తమరేనా భీమ్‌సేన్ జోషి నమస్కారం' అని దండాలు పెట్టి మమ్మల్ని ఏమీ చేయకుండా వెళ్లిపొమ్మన్నారు. దొంగయినా, దొరయినా సంగీతం అందరినీ సమానంగా కదిలిస్తుందని మాకు అప్పుడు తెలిసివచ్చింది."

-డి. అమరేంద్రరావు, ఎన్.కె.రామారావు

అక్టోబర్ 13 చిట్టిబాబు జయంతి సందర్భంగా....

# వీణావిద్వన్మణి చిట్టిబాబు

**సితార్‌ను తలచుకోగానే రవిశంకర్, షెహనాయ్ అనగానే బిస్మిల్లాఖాన్, వేణుగానం అనగానే ఓ హరిప్రసాద్ చౌరాసియా, జలతరంగ్ అనగానే శివకుమార్ శర్మలు మన తలపుల్లో కదలాడినట్లే వీణా నిక్వాణం మనకు చిట్టిబాబును స్ఫురింప చేస్తుంది. శృతిపేయమైన ఒక స్వరాన్ని మోసుకొచ్చే పల్లకి ఉత్సాహాన్ని, ఉల్లాసాన్ని అందించినప్పుడు అది నిస్సందేహంగా చిట్టిబాబు వీణానాదమే ననిపిస్తుంది.**

1936 అక్టోబర్ 13న కాకినాడలో జన్మించిన చిట్టిబాబు తన అయిదవ ఏటనే వీణాసాధన ప్రారంభించారు. తండ్రి చల్లపల్లి రంగారావు ఒక రోజు "వరవీణా మృదుపాణి" అనే గీతాన్ని వీణమీద వాయిస్తున్నారు. ఆరుబయట ఆడుకుంటున్న ఎనిమిదేళ్ల చిట్టిబాబు లోపలికి పరుగెత్తుకుంటూ వచ్చి "ఇలా కాదు వాయించవలసింది" అంటూ వీణ నందుకుని వాయించి చూపాడు. ఇతని ప్రతిభకు, నిర్మొహమాటత్వానికి తండ్రి ముగ్ధులైనారు. తన కుమారుడు "హనుమాన పంతులు" లోని నిగూఢమైన విద్యుత్తును గుర్తించారు. అప్పట్లో వాళ్లుంటున్నది పిఠాపురంలో. అక్షరాభ్యాసాన్ని వాయిదా వేసి నాటి ప్రముఖ వైణికుడు పద్రవాడ ఉక్మాకయ్యవద్ద శిష్యునిగా చేర్చారు. ఇక్కడ వాద్యాభ్యాసం తరువాత కాకినాడలోని ఇయ్యాని అప్పలాచార్య వద్ద శిష్యునిగా చేరి 12వ ఏటనే కచేరీ చేసే స్థాయికి ఎదిగాడు.



1948లో పిఠాపురంలో ఆప్తులు, స్థానిక ప్రముఖుల సమక్షంలో కచేరీ చేసి అందరి మన్నన లందుకున్నారు. ఆ తర్వాత చిట్టిబాబును తండ్రి మద్రాసులోని ఈమని శంకరశాస్త్రి వద్ద చేర్పించారు. అయితే అప్పటికి మునుపే ఒకసారి ఈమనివారి వీణావాదన విని ప్రభావితులై తన మానస గురువుగా భావించారు చిట్టిబాబు. "అంతగొప్ప వ్యక్తి, విద్వాంసులు, నా గురువుగా లభించడం పూర్వజన్మ పుణ్యం" అని చిట్టిబాబే స్వయంగా చెప్పుకున్నారొక సందర్భంలో.

ఈమని-చిట్టిబాబుల గురుశిష్యబంధం విచిత్రమైనది. అదేమిటంటే ఏనాడూ శాస్త్రిగారు 'ఇది నేర్చుకో, ఇలా వాయించు. ఇదీ పద్ధతి' అని చెప్పిన గురువు కాదు. చిట్టిబాబు కూడా ఆయనను ఏనాడూ ఏదీ అడిగిన వారు కారు. గురువు సాధనను అనుసరించడం, చూసి నేర్చుకోవడం ఆయన నిత్యకృత్యం. ఎప్పుడైనా "దీన్ని ఇలా అంటే బావుంటుంది" అని ఒకటి రెండు సలహాలివ్వడం వాటిని పాటించడం అంతే! తప్ప ఏ నియమబద్ధమైన శిక్షణ ఉండేది కాదు. ఏనాడూ పెద్దగా నోరువిప్పి సందేహాలు, సలహాలు అడిగిన వైనం లేదు. ఎప్పుడైనా కచేరీకి వెళ్లవలసి ఉన్నప్పుడు "ఏమోయ్ రేపు కచేరీ ఉంది. సిద్ధంకా!" అంటే భయపడుతూ సిద్ధం కావడమే. శాస్త్రిగారు చిట్టిబాబుకు తాను పెద్దగా నేర్పవలసిందేమీ లేదని అంచనా వేయడం వల్లనే వారి గురుశిష్యానుబంధం అంత చిత్రంగా సాగింది.



మద్రాసులో ఈమని గారి శిష్యరికం చేస్తుండటం వల్ల చిట్టిబాబుకు సినిమా వారితో పరిచయాలేర్పడినవి. ఇంతలో భరణీవారి 'లైలా మజ్ను'లో నటించేందుకు ఒక స్ఫురద్రూపి అయిన కుర్రవాడి కోసం ప్రయత్నిస్తుండగా చిట్టిబాబు వారికి తారసపడితే ఆ అవకాశం వచ్చింది. సినిమా టైటిల్‌లో మాస్టర్ హనుమాన పంతులు అని వేయవలసి రావడంతో నాయక భానుమతి ఆ పేరేమి బాగోలేదని ఇంట్లో ముద్దుగా పిలిచే చిట్టిబాబు పేరునే ఖరారు చేశారు. కాలక్రమేణా ఆయనకు ఆ పేరే స్థిరపడి పోయింది. మరో వైపు 1950-60 దశకాల మధ్య దక్షిణాది భాషల చిత్రాలలో వీణ పాటలన్నింటికి చిట్టిబాబే వీణ వాయించి తన ప్రతిభను చాటుకున్నారు. 'ఏమని పాడెదనో ఈ వేళ' (భార్యాభర్తలు) 'పాడమని నన్నడగ వలెనా' (డాక్టర్ చక్రవర్తి), 'పాడవేల రాధిక ప్రణయ సుధాగీతిక' వంటి తెలుగు పాటలకు వీణావాదన చేసింది చిట్టిబాబే.

చిట్టిబాబు 1960లో మద్రాసులోని ప్రసిద్ధ కృష్ణ గానసభలో తొలి ప్రధాన కచేరీ చేశారు. ఆ తరువాత అతిరథ మహారథులచే ఆహ్వానాలు అందుకుని అనేక కచేరీలు చేశారు. కాలక్రమంలో చిట్టిబాబువీణావాదన అంటేనే మద్రాసువాసులకు వీనుల విందుగా మారిపోయింది.

జాతి గర్వించదగిన కళాకారుడైన చిట్టిబాబును ఒక్క మనదేశమేమిటి ఆయా సందర్భాల్లో ప్రపంచమే గౌరవించింది. 1967లో మైసూర్ మహారాజా వారు 'వైణిక శిఖామణి' బిరుదుతో సన్మానించారు. వీణశేషణ్ణ తర్వాత వారు ఇలా గౌరవించినది మన చిట్టిబాబునే. తిరుమల తిరుపతి దేవస్థానము వారి 'సప్తగిరి సంగీత విద్వన్మణి'గా, ఆస్థాన విద్వాంసులుగా గౌరవా లందుకున్నారు. కృష్ణగాన సభ (మద్రాసు) "సంగీత చూడామణి"గా, ఆంధ్ర యూనివర్సిటీ వారిచే "కళాప్రపూర్ణ" (1984), 'కేంద్ర సంగీత నాటక అకాడమి" అవార్డు, కంచికామకోటి పీఠం ఆస్థాన విద్వాంసులుగా (1993), తమిళనాడు ప్రభుత్వం "కలైమామణి" బిరుదుతో, ఇంకా "వైణిక సార్వభౌమ", "వీణాగాన ప్రవీణ", "గంధర్వ

# హిందీ సినీ సంగీతంలో మలుపులు-మజిలీలు



సైగల్

### 1932

ఇంపీరియల్ ఫిలిం కంపెనీ వారి "మాధురి" సినిమా పాటల గ్రామ ఫోన్ రికార్డు వెలువడింది. ఇదే తొలి ఫిలిం రికార్డుగా చెప్పుకోవచ్చు. ప్రాణ్‌సుఖ్ నాయక్ సంగీత దర్శకత్వంలో వహించిన ఈ సినిమాలో 16 పాటలున్నా ప్రొఫెసర్ వినాయకరావ్ పట్వర్థన్ పాడిన 4 పాటలు మాత్రం రికార్డులు రూపంలో వెలువడ్డాయని ఖచ్చితంగా చెప్పవచ్చు.

తొలిస్టార్ కమ్ సింగర్ కుందన్‌లాల్ సైగల్ "మొహబ్బత్ కే ఆసూఁ" ద్వారా సినీ రంగ ప్రవేశం చేశారు. తరువాతి కాలంలో "చండీ దాస్", "ప్రెసిడెంట్", "స్ట్రీట్ సింగర్" వంటి చిత్రాల ద్వారా ఆయన ప్రభ మరింతగా వెలిగింది.



కానన్‌దేవి

### 1933

"అబ్-ఎ-హయాత్" చిత్రం ద్వారా బెంగాల్‌కి చెందిన కె.సి.దే (మన్నాదే పెద తండ్రి) సంగీత దర్శ కుడిగా ప్రవేశించారు. "జయదేవ్" (1926)లో బాలతారగా ప్రవేశించిన కానన్‌దేవి తొలిసారి హీరోయిన్‌గా "చార్ దర్వేష్" సినిమా విడుదలయింది. సైగల్ లాగానే ఆమె కూడా స్టార్-సింగర్‌గా పేరు తెచ్చుకుంది.

"సులోచన" అనే చిత్రం కోసం రికార్డయిన "పహ్లే సా వో" అనే పాట "సాగర్‌కన్యా" అనే చిత్రం కోసం ఉపయోగించబడింది. ఇది ఒక రకమైన ట్రెండ్‌కు శ్రీకారం చుట్టింది.

### 1934



కె.సి.దే

తరువాతి కాలంలో సంగీత దర్శకుడిగా ఎంతో ఖ్యాతి గడించిన సచిన్‌దేవ్ బర్మన్ "సీత" అనే సినిమాకు పాటలు పాడడం ద్వారా హిందీ చిత్రరంగానికి పరిచయమయ్యారు. 12 సంవత్సరాల తర్వాత గానీ ఆయన హిందీ సంగీత దర్శకుడిగా అవతారం ఎత్తలేదు. "సీత" సినిమాకు సంగీత దర్శకత్వం వహించినది కె.సి.దే.

మరో సంగీత దర్శకుడు జయదేవ్ కూడా హిందీ రంగ ప్రవేశం చేశారు. "వీర్ భారత్" సినిమాలో ప్లేబ్యాక్ సింగర్‌గా!

బెంగాల్ నుండి వచ్చిన సంగీత దర్శకులు సినిమా సంగీతానికి కొత్తరూపు నివ్వడానికి వెస్ట్రన్ టచ్ ఇవ్వనారంభించారు. దీనివల్ల క్లాసికల్, ఫోక్, లలిత సంగీతాలకు విభిన్నంగా సినిమా సంగీతం రూపుదిద్దు కోడానికి అవకాశం కలిగింది. ఆర్.సి. బోరాల్, పంకజ్‌మల్లిక్ వయోలిన్, సెల్లో, పియానో, డబుల్ బాస్, మాండోలిన్ వాడడం మొదలుపెట్టారు.



జయదేవ్



దీనానాథ్ మధోక్

గేయ రచయిత లలో కూడా కొత్త రక్తం వచ్చింది. అప్పటివరకు ఉన్న గ్రాంధిక భాషకు దూరంగా ప్రజలకు అర్థమయ్యే భాషలో లలితమైన పదాలతో సినిమా పాటలు రాసే పద్ధతికి దీనానాథ్ మధోక్ ఆద్యులు. శైలేంద్ర, రాజేంద్రకిషన్, ఆనంద్ బక్షిలకు స్ఫూర్తి నిచ్చినది మధోకే! ఆయనతోబాటే రంగ ప్రవేశం చేసిన పండిట్ ఇంద్ర, ప్యారేలాల్ సంతోషి కూడా పాటలను హిట్ చేయడంలో సిద్ధహస్తులు.

"సులోచన" సినిమాలోని "జబ్ ఖయాల్ ఆప్‌కా నహీఁ" పాటలోని లిరిక్స్‌ను మ్యూజికల్‌గా రీ సైకిల్ చేసి "పియా ప్యారే" సినిమాలో వాడేరు. ఇదికూడా ఒక కొత్త ట్రెండ్‌యే!

"సోనే కి చిడియా' సినిమాలో పాట రికార్డింగ్ సెషన్‌ను తెరపై చూపారు.

కళానిధి", "వైణిక సామ్రాట్", "వైణికరత్న", "తంత్రీ విలాస్", "కళారత్న" వంటి పురస్కారాలు ఆయనను వరించి తమ గౌరవాన్ని మరింతగా పెంచుకున్నవి. 'ఉన్నయ్‌పోల్ ఒరువన్', 'దిక్కట్ర పార్వతి', 'రాఘవవైభవం' చిత్రాలకు చిట్టిబాబు సంగీత దర్శకత్వం వహించి అవార్డులు అందుకున్నారు.

చిట్టిబాబు స్వదేశంలోనే గాదు. విదేశాల్లో సైతం కచేరీలు చేసి ప్రశంసలందుకున్నారు. యుగోస్లేవేకియా, బల్గేరియా, హంగేరి, పశ్చిమ జర్మనీ, రష్యా, శ్రీలంక, మలేషియా, సింగపూర్, కెనడా, లండన్, ఆస్ట్రేలియా, మస్కట్, బహ్రెయిన్, తదితర దేశాలల్లో వందలాది కచేరీలు చేశారు. హాంకాంగ్‌లో జరిగిన ఆసియా సంగీతోత్సవాలకు ఏకైక భారతీయ ప్రతినిధిగా హాజరైన ఘనత మన చిట్టిబాబుకే దక్కింది. ఆయన 25 ఎల్.పి.లు ఇచ్చారు "మ్యూజింగ్స్ ఆఫ్ మ్యుజీషియన్", "రాధామాధవమ్", "శివలీలా విలాసమ్","టెంపుల్ బెల్స్" వంటివి రికార్డులుగా వెలువడినవి. ఇంకా తన గురువు ఈమని వారు జీవించి ఉండగానే ఆంధ్రావర్సిటీ నుండి కళా ప్రపూర్ణ పొందిన అరుదైన ఘనత చిట్టిబాబుకే దక్కింది. దూరదర్శన్‌లో కళాకారులపై నిర్మించిన "సాధన" టెలిసీరియల్‌లో ఒక భాగం మన చిట్టిబాబుపైన చిత్రీకరించడం విశేషం. ఎక్కువగా ప్రచారంలో లేని 'మోహనాంగి', 'బిందుమాలిని' వంటి రాగాలను అతి రమణీయ శైలిలో పరిచయం చేసి ప్రాచుర్యం కల్పించారాయన.

ప్రతి యేటా తిరువాయూర్ త్యాగరాజ ఆరాధనోత్సవాల్లో తప్పనిసరిగా పాల్గొనే వారాయన. ఎప్పటిలా ఆ యేడు కూడా వెళ్లి కచేరి చేసి వచ్చారు. అయితే త్యాగరాజస్వామి తనువు చాలించిన బహుళ పంచమి రోజునే తన వీణ తంత్రులకు వీడి స్వరయాత్రను ముగించారు. ఆ రోజు 1996 ఫిబ్రవరి 9. తన 59 ఏళ్ల జీవితకాలంలో 50 వసంతాల పాటు వీణంటే ఆరోప్రాణంగా బ్రతికిన చిట్టిబాబు సంగీత ప్రియులకు వీణావిద్వన్మణిగా చిరస్మరణీయులు.

-హెచ్.రమేష్‌బాబు




ఆల్బమ్ తిరగేస్తుంటే ఎన్నో జ్ఞాపకాలు చుట్టుముడతాయి. పాఠకుల సేవలో గత ఏడాది ఎలా గడిచిందో సింహావలోకనం చేసుకుంటూ ఈ 24 సంచికలలో మేం అందించిన విషయాలను పాఠకుల సౌకర్యార్థం శీర్షికల పరంగా వర్గీకరించి ఇష్యూ నెంబరుతో సహా ఇస్తున్నాం.1 అంటే అక్టోబరు 1-15,2001, 2 అంటే అక్టోబరు 16-30,2001, 3 అంటే నవంబరు 1-15,2001....ఇలా సాగుతుంది.

తొలినుండి రెగ్యులర్‌గా 'హాసం' చూడనివారికి, తమకునచ్చిన టాపిక్ ఉన్న పాత సంచికలను కొనగోరేవారికి ఇది ఒక కరదీపిక. 'హాసం' వైవిధ్యం, విస్తృతి అంచనా వేయగోరేవారికి ఒక రెడీ రిఫరెన్స్.

## కర్ణాటక శాస్త్రీయ సంగీతం

| | ఇష్యూ నెం. |
|---|---|
| ఈలపాట వసంత | 1 |
| శ్రీరంగం గోపాలరత్నం | 12 |
| డి.కె.పట్టమ్మాళ్ | 12 |
| షేక్ చినమౌలానా | 15 |
| ఎం.ఎల్.వసంత కుమారి | 19 |
| సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ | 20 |
| పినాకపాణి | 21 |
| ఎ.పి.కోమల | 22 |
| ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి | 24 |

**తనికెళ్ళ భరణి-**

| | |
|---|---|
| తుమరాడ సంగమేశ్వర శాస్త్రి | 1 |
| ప్రటాయని సీతారామశాస్త్రి | 3 |
| కోలంక వెంకట రాజు | 4 |
| గుమ్మలూరి వెంకట శాస్త్రి | 5 |
| దూర్వాసుల సోమయాజులు | 6 |
| మునిపల్లె సుబ్రహ్మణ్యకవి | 7 |
| ఆదిభట్ల నారాయణదాసు | 8 |
| విశ్వపతి శాస్త్రి | 9 |
| హనుమద్దాసు | 10 |
| సారంగపాణి | 11 |
| వీణ వెంకట రమణదాసు | 12 |
| గరికపర్తి కోటయ్యదేవర | 13 |
| బొబ్బిలి కేశవయ్య | 14 |
| మద్దిరాల వెంకట రాయ కవి | 15 |
| దుడ్డు సీతారామయ్య | 16 |
| మనుసారి వెంకట లక్ష్మమ్మ | 17 |
| వాసా అప్పయ్య | 18 |
| పిరాట్ల శంకర శాస్త్రి | 19 |
| దాసు శ్రీరాములు | 20 |
| విద్యల నారాయణ స్వామినాయుడు | 21 |
| కాళహస్తి వీరయ్య | 23 |
| పాటల రామన్న | 24 |

## హిందుస్తానీ శాస్త్రీయ సంగీతం

| | ఇష్యూ నెం. |
|---|---|
| ఉస్తాద్ అల్లావుద్దీన్‌ఖాన్ | 1 |
| గంగుబాయి హంగల్ | 2 |
| విశ్వమోహన్‌భట్ | 4 |
| అనౌష్కా రవిశంకర్ | 4 |
| కాజీనజ్రుల్ ఇస్లాం | 4 |
| నజ్రత్ ఫతేఅలీఖాన్ | 5 |
| అమ్జద్ అలీఖాన్ | 7 |
| అల్లారఖా | 9 |
| కిశోరీ అమోంకర్ | 11 |

## లలిత సంగీతం

| | |
|---|---|
| మధూదయంలో | 1 |

**చిత్తరంజన్ -**

| | |
|---|---|
| పాటపాడుమాకృష్ణా | 2 |
| మాదీ స్వతంత్ర దేశం | 3 |
| బంగారుపాపాయి | 4 |
| పాడకే నారాణీ | 5 |
| ఈ విశాల ప్రశాంత | 6 |
| ఆనందమే లేదా లోకమున | 7 |
| పడవ నడపవోయ్ | 8 |
| జయజయ శ్రీ వెంకటేశ | 9 |
| ఒదిగిన మనసున | 10 |
| ఏమిసేతురా లింగా | 11 |
| ఒకపిలుపులో పిలిచితే పలుకుతావట | 12 |
| ఆంధ్రప్రశస్తి | 13 |
| చరణములే నమ్మితి నీ దివ్య | 14 |
| ఓహో యాత్రికుడా | 15 |
| ఎక్కడి మానుష జన్మం | 16 |
| వేదంలా గోదావరి ప్రవహిస్తోంది | 17 |
| అలనీల గగనాన తెలిమబ్బుచూడు | 18 |
| ఓపలేనే మనసు ఓమల్లెపువా | 19 |
| చిరునవ్వును పలికించే | 20 |
| స్వతంత్ర భారత జనని | 21 |
| ఏవరేమన్నా ఏమనుకున్నాచంద్రా ఆగక | 22 |
| ఏలా యీ మధుమాసము | 23 |
| కడచేనటే సకియా యీరాతిరి | 24 |

## లలిత సంగీత కారులు

| | ఇష్యూ నెం. |
|---|---|
| దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి | 1 |
| సాలూరి రాజేశ్వరరావు | 2 |
| డా॥ రజనీకాంతరావు | 3 |
| టంగుటూరి సూర్యకుమారి | 3 |
| శ్రీమతి రావుబాలసరస్వతీ దేవి | 4 |
| మంచాళ జగన్నాధరావు | 4 |
| ఘంటసాల వెంకటేశ్వరరావు | 5 |
| అడవి బాపిరాజు | 5 |
| ఎం.ఎస్. రామారావు | 6 |
| ఎస్. వరలక్ష్మి | 7 |
| బసవరాజు అప్పారావు | 7 |
| డా॥ మంగళంపల్లి బాలమురళికృష్ణ | 8,11 |
| డా॥ పి.బి. శ్రీనివాస్ | 8 |
| ఎ. వేణుగోపాల్ | 9 |
| ఈమని శంకరశాస్త్రి | 10 |
| దేవులపల్లి కృష్ణశాస్త్రి | 10 |
| డా॥ కనకవల్లి నాగేందర్ | 10,19 |
| శ్రీరంగం గోపాలరత్నం | 12 |
| ఏడిద కామేశ్వరరావు | 12 |
| కె.బి.కె. మోహన్‌రాజ్ | 13 |
| డా॥ బోయి భీమన్న | 13 |
| ముదిగొండ వీరభద్రమూర్తి | 13 |
| రామభక్త శిఖామణి రామదాసు | 14 |
| మల్లవరపు విశ్వేశ్వరరావు | 15 |
| ఆరుద్ర | 17 |
| డా॥ దాశరథి | 18 |
| శ్రీమతి శాంత | 18 |
| పాలగుమ్మి విశ్వనాథం | 19 |
| కందుకూరి రామభద్రరావు | 19 |
| డా॥ సి. నారాయణరెడ్డి | 20 |
| డా॥ బాలాంత్రపు రజనీకాంతరావు | 21 |
| మల్లిక్ | 22 |
| వోలేటి వెంకటేశ్వర్లు | 24 |

## ఆపాత(ట) మధురం

| | |
|---|---|
| మల్లీశ్వరి | 1 |
| పాతాళభైరవి | 2 |
| పెళ్ళిచేసి చూడు | 3 |
| దేవదాసు | 4 |
| చండీరాణి | 5 |
| బ్రతుకుతెరువు | 6 |
| చక్రపాణి | 7 |
| విప్రనారాయణ | 8 |
| చంద్రహారం | 9 |
| రేచుక్క | 10 |
| కాళహస్తీశ్వర మహత్యం | 11 |
| సంఘం | 12 |
| అర్ధాంగి | 13 |
| అనార్‌కలి | 14 |
| కన్యాశుల్కం | 15 |
| రోజులు మారాయి | 16 |
| సంతానం | 17 |
| దొంగరాముడు | 18 |
| మిస్సమ్మ | 19 |
| తెనాలి రామకృష్ణ | 20 |
| జయంమనదే | 21 |
| ముద్దుబిడ్డ | 22 |
| జయసింహ | 24 |




అక్టోబరు 2001 (ఇష్యూ నెం. 1, 2)

## తెలుగు సినిమా సంగీతం

### సంగీత దర్శకులు

| | ఇష్యూ నెం. |
|---|---|
| చక్రవర్తి | 10 |
| పెండ్యాల - పి.బి.శ్రీనివాస్ | 11 |
| కోదండపాణి - బాలు | 13 |
| విజయభాస్కర్ | 13 |
| ఇళయరాజా-వంశీ | 17 |
| కె.వి.మహదేవన్ - మురారి | 18 |
| ఆదినారాయణరావు - పి.బి.శ్రీనివాస్ | 22 |
| జి.కె.వెంకటేష్ | 24 |

### గేయరచయితలు

| | |
|---|---|
| వేటూరి - సిరివెన్నెల | 8 |
| దేవులపల్లి - భరణి | 10 |
| ఆత్రేయ - రాజా | 15 |
| సిరివెన్నెల - కులశేఖర్ | 16 |
| రాజశ్రీ - భువన చంద్ర | 21 |
| భువనచంద్ర -చంద్రబోస్ | 22 |

### గాయనీ గాయకులు

| | |
|---|---|
| వాణీజయరాం | 4 |
| ఎల్లారీశ్వరి | 65 |
| ఎ.ఎం.రాజా - పి.బి.శ్రీనివాస్ | 13 |
| ఎస్.జానకి - పి.బి.శ్రీనివాస్ | 14 |
| జమునారాణి - పి.బి.శ్రీనివాస్ | 16 |
| ఎస్.పి.బాలు - రాజా | 17 |
| రావు బాలసరస్వతి | 22 |

## హిందీ సినిమా సంగీతం

### సంగీత దర్శకులు

| | |
|---|---|
| చిత్రగుప్త | 7 |
| పంకజ్ మల్లిక్ | 10 |
| అనిల్‌బిశ్వాస్ | 19 |
| మదన్‌మోహన్ | 19 |
| కళ్యాణ్‌జీ | 22 |
| సలిల్‌చౌధురి | 23 |
| జై కిషన్ | 23 |
| హేమంత్‌కుమార్ | 24 |

### గేయరచయితలు

| | |
|---|---|
| ఆనంద బక్షి - భువనచంద్ర | 14 |
| కైఫీ ఆజ్మీ | 17 |
| దీనానాథ్ మథోక్ | 19 |

### గాయనీ గాయకులు

| | |
|---|---|
| సైగల్ | 8 |
| లతా | 12, 24 |

| | ఇష్యూ నెం. |
|---|---|
| తలత్ మెహమూద్ | 15 |
| మహమ్మద్ రఫీ | 20 |
| గీతాదత్ | 20 |
| ముఖేష్ -భువనచంద్ర | 22 |
| నూర్జహాన్ | 24 |

### విదేశీ సంగీతం

| | |
|---|---|
| మొజార్ట్ | 8 |
| యహూదీ మెనుహిన్ | 11 |
| పాల్‌రాబ్సన్ | 13 |
| బార్బరా స్ట్రీసాండ్ | 14 |
| రెక్స్‌హారిసన్ | 17 |
| ఎల్విస్ ప్రెస్లీ | 22 |

### పాపులర్ కార్నర్

| | |
|---|---|
| అద్నన్‌శామీ | 1 |
| టైరిన్ | 2 |
| వైదిక్‌గ్రూప్ | 3 |
| బ్రియాన్ ఆడమ్స్ | 3 |




నవంబరు 2001 (ఇష్యూ నెం. 3,4)

| | |
|---|---|
| రికీ మార్టిన్ | 4 |
| సుచిత్రా కృష్ణమూర్తి | 5 |
| బ్రిట్నీస్పియర్స్ | 6 |
| జార్జిహారిసన్ | 6 |
| అబ | 7 |
| మేరియా క్యారీ | 7 |
| బిడ్డూ | 10 |
| మడోనా | 22 |
| వివా | 23 |

### జూక్ బాక్స్

| | |
|---|---|
| 1931-40 ప్రేమయే జగతీ -బారిష్టర్ పార్వతీశం | 1 |
| 1951-60 చిటారుకొమ్మన మిఠాయి పొట్లం-కన్యాశుల్కం | 1 |
| 1991-2000 అనగనగా ఆకాశం ఉంది-నువ్వేకావాలి | 1 |
| 1941-50 ఓ బాలరాజా -బాలరాజు | 2 |
| 1961-70 పాండవులు పాండవులు -అక్కాచెల్లెలు | 2 |
| 1981-90 నాదవినోదం -సాగరసంగమం | 2 |
| 1991-2000 అబబ్బా ఇద్దూ -చూడాలనివుంది | 2 |
| 1971-80 ఊరికే కొలనునీరు- సంపూర్ణరామాయణం | 3 |
| 2001 ఎవరైన ఎప్పుడైనా -ఆనందం | 3 |
| 1961-70 ఎంత కృపామతివే - కీలుగుర్రం | 4 |
| 2001 శివశంకరీ -జగదేకవీరుని కథ | 5 |
| 2001 కాస్తనన్నునువ్వు -స్టూడెంట్ నెం1 | 5 |
| 2001 తూనీగ తూనీగ - మనసంతానువ్వే | 6 |
| అమృత పాటలు - కులశేఖర్ | 10 |
| జయంపాటలు -కులశేఖర్ | 20 |

### అర్థం చేసుకుందాం

| | |
|---|---|
| లగాన్ - చలేచలో | 1 |
| దిల్ చాహతా హై- ఓ లడ్కీ హై కహా | 2 |
| అజ్ నబీ - మెహబూబా | 3 |
| అశోకా -రాత్ కా నషా | 4 |
| రహ్‌నా హై తేరె దిల్ మే | 5 |
| కభీ ఖుషీ కభీ గమ్ -కభీ ఖుషీ కభీ గమ్ | 6 |
| నవరంగ్ -ఆధాహై చంద్రమా | 7 |
| రాజ్ -జోభీ కసమే | 8 |
| మొఘల్ ఏ అజమ్ -ప్యార్ కియాతో డర్నాక్యా | 9 |
| అల్‌బేలా -ఓ బేటా జీ | 10 |
| ఆప్ ముఝె అచ్ఛే లగ్‌నే లగే | 11 |
| సూరజ్ -బహారోం ఫూల్ బర్‌సావో - | 12 |
| తుమ్‌కో న భూల్ పాయేంగే- యే బేఖుదీ దీవాన్‌గి | 13 |
| ఝునక్ ఝునక్ పాయల్‌బాజే -నైన్ సే నైన్ నాహీ మిలావో | 14 |
| మేరా నామ్ జోకర్ - ఏ భాయ్ జరా దేఖ్‌కే చలో | 15 |
| దేవదాసు- మార్‌డాలా | 16 |
| పాకీజా - చల్‌తే చల్‌తే | 17 |
| కంపెనీ- ఖల్లాస్ | 18 |
| ప్యాసా- యే దునియా అగర్ | 19 |
| ది లెజెండ్ ఆఫ్ భగత్‌సింగ్ -సర్ఫరోషి కి తమన్నా | 20 |
| బోర్డర్ -సందేసే ఆతే హై | 21 |
| బొంబాయ్ కా బాబూ -చల్‌రీ సజనీ | 22 |
| ముఝ్‌సే దోస్తీ కరోగే! - జానేదిల్‌మే కబ్‌సే హై తూ | 23 |
| అందాజ్ - జిందగి ఎక్‌సఫర్ | 24 |

డిసెంబరు 2001 (ఇష్యూ నెం. 5,6)








జనవరి 2002 (ఇష్యూ నెం. 7, 8)

## కొత్త సినిమా పాటల పుస్తకాలు



## పాటల అనుబంధం







ఫిబ్రవరి 2002 (ఇష్యూ నెం. 9, 10)



## సీరియల్స్



## క్లాసిక్ రీటోల్డ్

**సాక్షి** - (పానుగంటి)



మార్చి 2002 (ఇష్యూ నెం. 11, 12)





**ఏప్రిల్ 2002 (ఇష్యూ నెం. 13, 14)**









**మే 2002 (ఇష్యూ నెం. 15, 16)**






**జూన్ 2002 (ఇష్యూ నెం. 17, 18)**




ఆగష్టు 2002 (ఇష్యూ నెం. 21, 22)

| | ఇష్యూ నెం. |
|---|---|
| పొట్టిప్రసాద్ | 10 |
| సీతారామ్, నల్లరామ్మూర్తి | 11 |
| బాలకృష్ణ | 12 |
| సినిమా తొలినాటి వింతలు విశేషాలు | 13 |
| ఆచార్య ఆత్రేయ | 15 |
| షూటింగ్‌లో టింగ్ టింగ్ | 16 |
| ఆరుద్ర | 17 |
| మల్లాది రామకృష్ణశాస్త్రి | 18 |
| సి.యస్.ఆర్ | 19 |
| షూటింగ్‌లో టింగ్ టింగ్ | 20 |
| పద్మనాభం | 22 |
| గిరిజ | 23 |
| నాగేష్ | 24 |

### హాస్యామరథం (హిందీ)

| | |
|---|---|
| మెహమూద్ | 1 |
| జానీవాకర్ | 2 |
| భగవాన్ | 3 |
| టున్‌టున్ | 5 |
| ముక్రి | 23 |

### హాస్యామరథం (విదేశీ)

| | |
|---|---|
| జిమ్‌క్యారీ | 1 |
| ఎడ్డీమర్ఫీ | 2 |
| జెర్రీ లూయిస్ | 3 |
| బెన్ స్టిల్లర్ | 4 |
| క్రిస్‌టక్కర్ | 6 |
| రాబ్‌స్నైడర్ | 7 |
| లారెల్-హార్డీ | 10 |
| డానీకేయే | 11 |
| టోనీకర్టిస్ | 17 |

### సమీక్షణం

| | |
|---|---|
| మీ ఘంటసాల | 1 |
| రాంబాబు డైరీ(1) | 2 |
| ఆరుద్ర సినీగీతాలు | 3 |
| తంబిం౧పెషన్ | 7 |
| పన్‌పరాగ్ | 20, 21, 22 |
| రాంబాబు డైరీ(2) | 23, 24 |

### ఇంటర్వ్యూలు

| | ఇష్యూ నెం. |
|---|---|
| అమీన్‌సయానీ | 1 |
| మహేంద్రకపూర్ | 2 |
| ఓ.పి.నయ్యర్ | 3 |
| బాపు | 4 |
| ఏసుదాస్ | 6 |
| బాలమురళీకృష్ణ | 8 |
| బిస్మిల్లాఖాన్ | 8 |
| బ్రహ్మానందం | 9 |
| ఆర్.పి.పట్నాయక్ | 11 |
| సందీప్, బాబ్జీ, భాషశ్రీ, శేషు | 12 |
| కీరవాణి | 14 |
| చంద్రబోస్ | 15 |
| కోటి | 16 |
| ఎల్.బి.శ్రీరాం | 16 |
| యస్వీ కృష్ణారెడ్డి | 17 |
| చక్రి | 18 |
| కోట శ్రీనివాసరావు | 19 |
| రాజేంద్రప్రసాద్ | 20 |
| సి.నారాయణరెడ్డి | 20 |
| చిత్ర | 20 |
| మణిశర్మ | 21 |
| ఆర్.పి.పట్నాయక్ | 23 |
| చక్రి | 23 |

### ప్రత్యేక వ్యాసాలు

| | |
|---|---|
| మ్యూజిక్‌హీలింగ్ | 2 |




జులై 2002 (ఇష్యూ నెం. 19, 20)

| | |
|---|---|
| సినీ సీమలో సంగీతం ఘంటసాల | 5 |
| సంగీత విశ్లేషణ తీరుతెన్నూ - వి.ఎ.కె. | 5 |
| త్యాగరాజ ఆరాధనోత్సవాలు | 6 |
| నాగయ్యకు పాశ్చాత్యసంగీతం | 6 |
| రాప్‌గాయకుడు అశోక్‌కుమార్ | 6 |
| సినిమాలలో హాస్యగీతాలు - వి.ఎ.కె. | 7 |
| రామారావు గారూ-నేనూ-డి.వి.నరసరాజు | 8 |
| పి.జి.ఉడ్‌హవుస్ | 9 |
| హిందూస్తాని సంగీతం - బాపు | 9 |
| 'హాసం' నల్గొండ సమావేశం | 11 |
| ఐక్యూలు - జనార్ధన మహర్షి | 13 |
| మూలాన్‌రూజ్ | 13 |
| కన్నాంబ | 15 |
| టి.జి.కమలాదేవి | 11 |
| శాంతకుమారి | 16 |
| జూడీ గార్లండ్ | 18 |
| ఫ్రెడ్ ఏస్టైయిర్ | 18 |
| ప్యాసా | 19 |
| బాంబేడ్రీమ్స్ | 19 |

| | ఇష్యూ నెం. |
|---|---|
| 'జయం'సినిమా పాటలపై కులశేఖర్ | 20 |
| జరుక్ శాస్త్రి పేరడీలు | 23 |
| విల్‌స్మిత్ | 24 |

### నిక్షిప్త చిత్రాలు

| | |
|---|---|
| అలనాటి హాస్య కుటుంబం | 2 |
| పి.సుశీల | 3 |
| ఈనాటి హాస్య కుటుంబం | 3 |
| వాణీ జయరాం | 4 |
| ఘంటసాల | 5 |
| ఎల్.ఆర్.ఈశ్వరి | 5 |
| నాగయ్య, సావిత్రి | 6 |
| జంధ్యాల | 7 |
| ఎ.ఆర్.రెహమాన్ | 7 |
| వేటూరి | 8 |
| పాడుతున్న ఎన్.టి.ఆర్ | 8 |
| బ్రహ్మానందం | 9 |
| చక్రవర్తి | 10 |
| దేవులపల్లి | 10 |
| పెండ్యాల | 11 |
| చిరంజీవి (శివుడిగా) | 11 |
| ఎస్.పి.బాలు,ఘంటసాల,పి.బి.శ్రీనివాస్ | 12 |
| ఎస్.జానకి,పి.సుశీల,ఘంటసాల | 12 |
| ఎ.ఎం.రాజా, యస్.పి.కోదండపాణి | 13 |
| యస్.జానకి | 14 |
| యన్.టి.రామారావు(శ్రీరాముడు పాత్రలో) | 14 |
| చిత్ర, కవితాకృష్ణమూర్తి, కుమార్‌సాను | 15 |
| ఆత్రేయ | 15 |
| ఎన్.టి.రామారావు(ఆయిల్ పెయింట్) | 16 |
| ఎస్.పి.బాలు | 17 |
| ఆరుద్ర | 17 |
| జంధ్యాల | 18 |
| కె.వి.మహదేవన్ | 18 |
| కీరవాణి | 19 |
| మణిశర్మ | 19 |
| రాజేంద్రప్రసాద్ | 20 |
| డా॥సి.నారాయణరెడ్డి | 20 |
| సంగీతకుటుంబం | 22 |
| నాటకరచయితలు | 23 |
| అక్కినేని నాగేశ్వరరావు(ఆయిల్ పెయింట్) | 24 |

సెప్టెంబరు 2002 (ఇష్యూ నెం. 23, 24)










విడుదల : ఆదిత్య
వెల : రూ. 40/-

వెంకటేష్ హీరోగా - ప్రతిష్ఠాత్మకమైన సంస్థలైన సురేష్, ఏవీయమ్ కలిసి నిర్మించిన 'జెమిని' ఆడియో క్యాసెట్ విడుదలయింది. ఆర్.పి. పట్నాయక్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. ఇందులో ఒక్క పాట మాత్రం కులశేఖర్ రాయగా తక్కినవన్నీ వేటూరి రాసినవే.

క్యాసెట్‌లో తొలిగీతం - చెలిచెడుగుడు జెమిని జెమిని - హిట్‌సాంగ్ ఆఫ్ ది ఆడియో అండ్ ఫిల్మ్ కూడా! 'ఓ... పోడు' పాటగా తమిళనాడుని ఊపేసిన ఈ పాట సృష్టికర్త రమణీభరద్వాజ్. అప్పట్లో విడుదలైన 'సొగసు చూడతరమా', ఈ మధ్య విడుదలైన 'రోజాపూలు' సినిమాల సంగీత దర్శకుడిగా ఈయన తెలుగువారికి చిరపరచితుడే. రాసేవారికి, పాడే వారికి ఓ పరీక్షలాంటి ఈ పాట క్యాసెట్‌లో రెండు వెర్షన్‌లతో వినిపిస్తుంది. ఈ రెండు వెర్షన్‌లలో వేటూరి - బాలు - అనురాధ శ్రీరామ్‌ల కాంట్రిబ్యూషన్ గురించి ఎంత చెప్పిన తక్కువే అవుతుంది. 'ఓ... పోడు'కి పారలల్‌గా తెలుగులో 'వెయ్‌పోటు'ని సృష్టించడంలోనూ, ఫాస్ట్ మీటర్‌లో ఉన్న పల్లవికి తగ్గట్టు పదాలతో చెడుగుడు ఆడుకోవటం లోనూ, 'వచ్చేస్తా' 'టచ్చేస్తా' (టచ్ చేస్తా) వంటి పదాలతో ప్రాసలు వెయ్యడంలోనూ, ప్రాయసాల తేనెపట్టు - ప్రేమసరినోటు అనే పదాలను కాయిన్ చేయడంలోను వేటూరి తన 'కలంకారీ' తనాన్ని మరోసారి చూపించారు. ఈ పాటకి ట్రాక్ రమణీభరద్వాజ్ అంటూ ఇన్‌లే కార్డుపై వెయ్యడం, ఇన్వాల్వ్ అయిన వారందరి సంస్కారానికి నిదర్శనం.

రాజేష్ పాడిన 'పూలలో తేనెప్రేమ' పాట వినడానికి హాయిగా సాగిపోతూ పట్నాయక్ మార్కుని మరోసారి శ్రోతల ముందుంచు తుంది. ఇదే ట్యూన్‌తో శాడ్‌వెర్షన్‌గా 'బంధమే ముల్లు అయినా బాధలో నువ్వు ప్రేమా' అనే స్వరఖండికను ఆర్.పి.పట్నాయక్ పాడేరు.

ఉష పాడిన 'దిల్ దివానా / మైహసీనా / ప్యార్‌మెపాగల్' పాట మరొక హిట్ సాంగ్. ఆర్.పి. - ఉష కెరీర్‌లో గుర్తుండిపోయే మరొక గీతమిది. ట్యూన్‌ని నడిపే పద్ధతి, ఆర్కెస్ట్రయిజేషను అంతా ఇళయరాజా స్టయిల్‌ను గుర్తు చూనస్తూ ఉంటుంది. నలభై ఏళ్ళ క్రితం యస్.డి.బర్మన్ సంగీత దర్శకత్వంలో 'చల్తీకానామ్‌గాడీ'లో కిశోర్‌కుమార్ పాడిన 'ఇక్ లడ్‌కీ భీగీ భాగీసే' పాటలోని 'మిలి ఎక్ అజ్‌నబీసె....' అనే లైన్ ట్యూన్‌తో సహా చరణాల చివర్లో కలుపుకోవటం భలేగా వుంది. సినిమాలోని ఈ సన్నివేశం కోసం తమిళ వెర్షన్‌లో స్వరపరచిన పాటకన్నా తెలుగు వెర్షనే బావుందని రెండు వెర్షన్‌లనూ విన్నవారు అంటారు.

'చుక్కల్లోకెక్కినాడు చక్కనోడు' అనే స్వరఖండికను వందేమాతరం శ్రీనివాస్ ఆలపించారు. ఆర్.పి. సంగీత దర్శకత్వంలో వందేమాతరం పాడడం అన్నది ఓ రికార్డు.

'బ్రహ్మ ఓ బ్రహ్మ... మహముద్దుగా ఉంది గుమ్మ' పాట ఆర్.పి. రెగ్యులర్ స్టయిల్‌ని చూపిస్తూ, కాస్త వెరయిటీ కూడా కలుపుకుంటూ, బాలూ పాడేరు కాబట్టి తెలుగుమాట తెలుగుతనంతో వినిపించేట్టు ఉంటూ పాటపై సదభిప్రాయాన్ని కలిగించేలా రూపొందింది. ఈ పాటను కులశేఖర్ రాశారు. శంకర్ మహదేవన్, ఉష పాడిన 'నడకచూస్తే వయ్యారం కులుకు చూస్తే సింగారం' మాస్‌కోసం పెట్టిన ఊపుపాట కనక సంగీతం, సాహిత్యం, గానం ఆ లెవల్లోనే రెచ్చి పోయినట్టుండడం సహజం. కాకపోతే - పిడత ముద్దు పింగాణం, ఉడత నడుము వడ్డాణం, మనసుపడ్డ మాగాణం, గుట్టుగుడారం లాంటి పదాల్తో వేటూరి విజృంభణ వీరలెవల్లో ఉండడమే కాకుండా వాటిలో కాస్తఅల్లరి, కాస్త అలరింపు రెండూ ఉండటం అన్యులెవరూ అందుకోలేని - ఆయన ప్రత్యేకత!

## ఆడియోలు .. అతి త్వరలో

| | | |
|---|---|---|
| ఆదిత్య | : | ప్రేమలో పావని కళ్యాణ్ |
| సుప్రీమ్ | : | బాబీ |
| | | ఒక్కడు |
| | | అంజి |






సంగీతం అంటే చెవి కోసుకునే ఓ మేజర్ అవసానదశ సమీపించగా హాస్పిటల్‌లో చేరాడు. చివరి కోరికగా ఏదైనా వాద్య సంగీతం వినాలనుందని అడిగాడు. సరేనని పక్కనే ఉన్న మిలటరీ గ్రౌండ్స్ నుంచి బ్యాండ్ మేళాన్ని పిలిపించారు. వాళ్ళు కూడా విపరీతమైన మిలటరీ అభిమానంతో వాయించారు. డాక్టర్లనందర్నీ ఆశ్చర్యంలో ముంచేస్తూ మేజర్ కోలుకున్నాడు. తక్కిన పేషెంట్లంతా ఒక్కడు కూడా మిగలకుండా మొత్తం చనిపోయారు.



"ముందు శుభవార్త వింటారా... దుర్వార్త వింటారా...?"

"శుభవార్తే చెప్పండి... దుర్వార్త తట్టుకునే ధైర్యం వస్తుందేమో"

"అయితే వినండి... మీ పళ్ళన్నీ అద్భుతంగాను, వందేళ్ళొచ్చినా చెక్కు చెదరనంత దృఢంగాను ఉన్నాయి".

"థాంక్యూ ఫర్ ది కాంప్లిమెంట్ డాక్టర్.... మరి దుర్వార్త...?"

"మీ చిగుళ్ళన్నీ పుచ్చిపోయాయి. మొత్తం పళ్ళన్నీ పీకెయ్యక తప్పదు.. సారీ".

"ఒరే కొన్ని కంప్యూటర్ తిట్లు తిట్టు చూద్దాం"

"నీ మౌస్‌ని పిల్లులెత్తుకెళ్ళా
నీ మోడమ్ మాడిపోనూ
నీ కంప్యూటర్‌కి వైరస్ సోకా
నీ సిస్టమ్ హ్యాంగైపోనూ
నీ ఫ్లాపీ చిల్లులడిపోనూ
నీ సీ.డీ.కి స్క్రాచ్‌లు పడా
నీ కీ లు స్టక్కయిపోనూ"





"మేడమ్... మీకొక గుడ్‌న్యూసు, బ్యాడ్ న్యూసు. ముందర బ్యాడ్ న్యూస్ చెప్పి ఆ తర్వాత గుడ్ న్యూస్ చెప్తే కొంచెం బెటర్‌గా ఉంటుందని మొదట బ్యాడ్ న్యూస్ తోటే స్టార్ట్ చేస్తున్నాం. పొరపాటున మీ కుడికాలికి బదులు ఎడమ కాలిని తీసెయ్యటం జరిగింది. గుడ్ న్యూసేంటంటే మీ కుడికాలికి అసలు ఆపరేషన్ అవసరం లేనేలేదట. పరీక్షలో తేలింది.



"ఇదిగో వీడే నా మనమడు"

"ఏం చేస్తున్నాడిప్పుడు?"

"పచ్చడి"

"అబ్బా నాయనమ్మా నేను చేస్తున్నది పచ్చడి కాదు... పి.హెచ్.డి."



"వందేళ్ళు బతకాలంటే ఏం చేయాలంటారు డాక్టర్?"

"తాగుడు పూర్తిగా మానెయ్యాలి. సిగరెట్ ముట్టడానికి వీల్లేదు. ఆడవాళ్ళ ఊసెత్తకూడదంతే... ఇక మాంసాహారం, మసాలాలు అంటావా అలాంటివసలు ఈ భూ ప్రపంచంలో ఉన్నాయన్న సంగతి మర్చిపోవటం మంచిది"

"అలా చేస్తే ఖచ్చితంగా వందేళ్ళు బతుకుతానంటారా...?"

"ఏమో ఎవడు చూడొచ్చాడు...!? అలా చేసి బతికిన వాడెవడైనా మన దగ్గరకొచ్చి చెప్పి చచ్చాడా ఏవన్నానా... ఏదో మన పెద్దలు చెప్పిందే చెప్పానంతే"

"సరే డాక్టర్... ఆ ఫీజేదో కలిసినప్పుడు మన పెద్దలకే ఇచ్చుకుంటాను".



"ఆ భార్యాభర్తలిద్దరూ మేడ్ ఫర్ ఈచ్ అదర్ అటగా...."

"అవును... పడుకున్నప్పుడు ఆయన గురక పెడతాడు. ఆవిడకేమో చెవుడు... ఇంకా అంతకన్నా ఏం కావాలి?"






"డాక్టరు గారు! మా ఇంట్లోకి వెళ్ళాలంటే కుదరటం లేదు. ఆటోమేటిక్ లాక్ కదా... డోర్ లాకయి పోయింది. కీ లోపలుండి పోయింది. మీరు త్వరగా రావాలి".

"దానికి ఏ కార్పెంటర్నో తాళాలు తీసేవాణ్ణే పిలవాలి గానీ నాకు ఫోను చేస్తే ఎలాగండీ...!?"

"అదే సార్... మేం అంతా సరదాగా అలా బైటికెళ్దామనుకున్నాం. మావాడేమో టీవీ ముందు నుంచి చచ్చినా కదలనన్నాడు. సరేనని వాణ్ణొదిలేసి బైటికొచ్చి తాళం వేసుకుని వెళ్దామనుకుంటే అప్పటికే ఒక్కుమండి తాళం చెవిని మింగేశాడు వాడు".



"నువ్వు అనే ఒక్కమాట.... నన్ను ప్రపంచంలో అందరి కంటె అత్యంత అదృష్టవంతుడిగా చేస్తుంది. దయచేసి చెప్పు. నన్ను పెళ్ళి చేసుకోనంటావా? లేదా?

"ఛస్తే... చేసుకోను..."

"హమ్మయ్య... ఇక నా అదృష్టానికి తిరుగు లేదన్నమాట"



"ఓ అయిదు రూపాయలు అప్పు కావాలోయ్...." అడిగేడు ఆనందరావు.

"దేనికి...." అన్నాడు దేవేందర్

"ఆర్థిక పరమైన క్రమశిక్షణ లేకపోవటం వలన కలిగే అనర్థాలు అంటూ ఓ వ్యాసం రాశాను. అది పత్రిక్కి పంపడానికి..." చెప్పాడు ఆనందరావు.



"తొందరగా పడుకుని పెందరాళే లేవడం చాలా మంచి అలవాటు. నన్ను చూడు... తొందరగా పడుకుని కోడితో పాటు నిద్ర లేచిపోతాను... మరి నువ్వో?"

"నీలా... నాకు కోడి దగ్గర పడుకోవటం యిష్టం లేదు నాన్నమ్మా. నా మంచం మీదే నేను పడుకుంటాను.



"నాకు ఎలుకల బోనొకటి యివ్వండి. తొందరగా వెళ్ళి పోవాలి. ట్రైన్ టైమ్ అయిపోతోంది. ఎలాగైనా సరే క్యాచ్ చెయ్యాలి." దుకాణంలోకి వచ్చి ఆయాసపడుతూ అడిగింది ఓ పెద్దావిడ.

"ట్రైన్ పట్టేంత పెద్దబోనులు మా దుకాణంలో లేవమ్మా...." చెప్పాడు దుకాణదారుడు.



"శనివారం నాడు నా పుట్టిన్రోజు పార్టీకి తప్పకుండా రావాలి మరి..."

"తప్పకుండా వస్తాను. మీ చిరునామా ఏంటి?"

'జవహర్ కాలనీలో ఆరో నంబర్ రోడ్డులో మూడో యిల్లురా.... వచ్చి నీ మోచేత్తో కాలింగ్ బెల్ నొక్కావంటే చాలు... ఎవరో ఒకళ్ళు తీస్తారు".

"మోచేత్తో ఎందుకూ? వేల్తో నొక్కకూడదా?"

"పోరా బడాయి. నువ్వు వట్టి చేతుల్తో వస్తావేంటి? నీ రెండు చేతుల్నిండా బోలెడన్ని బహుమతులుండవూ!?".



"మనకు సూర్యుడు ముఖ్యమా? చంద్రుడు ముఖ్యమా?" అడిగేడు టీచర్.

"చంద్రుడు...." ఠక్కున చెప్పాడు ఓ కుర్రాడు.

"అలా అనే నువ్వు ఎందుకనుకుంటున్నావ్?".

"చంద్రుడేమో చీకటిగా వున్నప్పుడు రాత్రి పూట ప్రకాశిస్తాడు. సూర్యుడేమో వగలు పూట ప్రకాశిస్తాడు....పగలు పూట ఎలాగూ వెలుగుంటుంది కదా.. అప్పుడు సూర్యుడు వున్నా ఒకటే లేకపోయినా ఒకటే కదా టీచర్.... అందుకు చంద్రుడే మనకు ముఖ్యం..." వివరించి చెప్పాడు ఆ కుర్రాడు.

అక్టోబరు 10 ఆలీ పుట్టినరోజు సందర్భంగా...

# ఇడ్లీపాత్ర మినహా అన్ని రకాల పాత్రలూ చేసాను - ఆలీ






❑ అప్పట్లో మీరు ఉపయోగించిన 'అక్కుంబక్కుం', 'ఎందచేట', లాంటి ఊతపదాలు బాగా పాపులర్ అయ్యాయి. ఈ మధ్య అలాంటి కొత్త పదాలేమీ కనిపెట్టలేదా?

✿ కొత్తవి కనిపెట్టడానికి ఏమీ లేవు. షూటింగ్స్ కోసం వివిధ ప్రాంతాలకు వెళ్ళినపుడు అక్కడ కొంతమంది జనాలు మాట్లాడే తీరు, మాటలను బట్టి ఇలాంటి ఊతపదాలు పుడుతుంటాయి. అలా జనాల దగ్గర విన్నవాటినే కొంచెం పాలిష్ చేసి సందర్భోచితంగా సినిమాల్లో ఉపయోగిస్తుంటాం. అవి మళ్ళీ జనాల దగ్గరకెళ్ళి బాగా రక్తి కట్టిస్తుంటాయి. రేలంగి గారి 'జంబలకిడి పంబ' ఎంతలా పాపులర్ అయిందో మీకు తెలిసిందే. ఏదో డిఫరెంట్‌గా చెబితే బాగుంటుందని చెప్పడం తప్ప, ఇందులో జుట్టు పీక్కుని, తల పగలకొట్టుకునేంత క్రియేషన్ ఏమీ లేదు. ఐఎస్ఐ మార్క్‌ని కొన్ని కంపెనీలే ఉపయోగిస్తాయి. అలాగే 'ఎంద చేట' లాంటి ఊతపదాలు ప్రతి సినిమాలోనూ ఉపయోగిస్తే 'వీడేంట్రా చెప్పిందే చెబుతున్నాడు' అనుకుంటారు. దేనికైనా సందర్భం కలిసిరావాలి. ఏదైనా ఇతర భాషకు సంబంధించిన పదాన్ని ఊతపదంగా చెప్పామనుకోండి ఆలీ గాడేదో కొత్త పదం చెప్పాడ్రా అని నవ్వుకుంటారు జనం.



❑ మిమ్మల్ని బైట ప్రేక్షకులంతా ఆలీగాడనే అంటూంటారు. ఈ విషయం ఎప్పుడైనా గమనించారా?

✿ నన్ననే కాదు, ఎన్.టి.రామారావు గారిని కూడా ప్రేక్షకులు గాడనే అంటుంటారు. అలా గాడని ప్రేక్షకులు పిలుచుకుంటున్నారంటే ఆ ఆర్టిస్ట్ ఇమేజ్ పదిరెట్లు పెరిగినట్టు. చిరంజీవి గార్రా అనరు. 'అబ్బ ఏం కొట్టాడ్రా చిరంజీవి గాడు' అనే అనుకుంటారు. వాళ్ళు ఇగోతో గానీ, కోపంతో గానీ అనడం లేదు. ఓ రకమైన క్రేజ్‌తో అంటున్నారు. వాళ్ళ తిట్లే మాకు దీవెనలు. 'శ్రీమంజునాథ' సినిమాలో అర్జున్ కేరెక్టర్ శివుడిని తిడుతుంటే, శివ పాత్రధారి చిరంజీవి ఆనందంతో నర్తిస్తుంటారు. మేం కూడా అలా ఊహించుకుంటుంటాం.

❑ చిరంజీవి, బాలకృష్ణ, నాగార్జున, వెంకటేష్, పవన్‌కళ్యాణ్... ఇలా అందరూ 'మా ఆలీ' అని మిమ్మల్ని తెగ లైక్ చేస్తుంటారు. కారణమేమిటంటారు?

✿ నా లైఫ్ ఏమిటో వాళ్ళందరికీ తెలుసు. నాకు చిన్నప్పట్నుంచీ కష్టమేమిటో తెలుసు. నా

వర్క్ ఏమిటో బాగా చేయడం తప్ప, లేనిపోని విషయాల్లో ఎప్పుడూ తలదూర్చను. అక్కడ మాటలు ఇక్కడికి, ఇక్కడ మాటలు అక్కడికి మోయడం నాకు తెలియదు. ఒకవేళ విన్నా కూడా అక్కడికక్కడే మరిచిపోతాను. బైట తిరిగి ఇంట్లోకి అడుగుపెట్టే ముందు కాళ్ళు కడుక్కోమని మన పెద్దలు ఎందుకు చెప్పారంటే ఏదీ కూడా మనతో పాటు ఇంట్లోకి రాకూడదని. అలాగే బైటి వర్క్ అయిపోగానే కాళ్ళు కడిగేసుకుంటాను. అందుకే నేనంటే అంతా లైక్ చేస్తారు.

❑ తెరమీద విపరీతంగా కామెడీ చేసి నవ్వించే మీరు బైట మాత్రం చాలా సీరియస్‌గా కనిపిస్తారు ఎందుకని?

✿ సినిమాల్లో ఎలాగో కామెడీ చేస్తున్నాం, బైటకూడా ఎలా కామెడీ చేస్తాం. ఒకవేళ అలా కామెడీ చేస్తే 'కొంచెం ఎక్స్ట్రాలు చేస్తున్నాడు' అని అంతా అనుకుంటారు. మరీ సీరియస్ మెయింటెయిన్ చేయను. కొంచెం రిజర్వ్‌డ్‌గా వుంటానంతే.

❑ కొన్నాళ్ళు హీరోగా చేసి, మళ్ళీ ఇప్పుడు కమెడియన్‌గా చేయడం బాధ అనిపించడం లేదా?

✿ చాలా హేపీగా వుంది. కామెడీ కేరెక్టర్లు చేసుకుంటూ హీరోగా చేసి, మళ్ళీ కామెడీ కేరెక్టర్లు చేస్తున్నానంటే అది నేనే కావాలని చేసుకున్నాను. 'యమలీల' తర్వాత ఇక నేను చేయనని ఆపేసి వుండొచ్చు. కానీ కొన్ని సినిమాలు సక్సెసయ్యాయి. సక్సెస్, ఫెయిల్యూర్‌లనేవి ప్రతి ఆర్టిస్ట్‌కి తప్పవు. ఎన్టీఆర్ లాంటి వారికే ఇవి తప్పలేదు. రోడ్డు మీద స్పీడ్ బ్రేకర్‌ని మన స్పీడ్‌ని తగ్గించడం కోసం పెడతారు. అలాగే మన హార్ట్‌బీట్‌లో కూడా అప్ అండ్ డౌన్స్ వుంటాయి (స్కానింగ్‌లో చూస్తే కనిపిస్తుంది). అలాగే లైఫ్‌లో కూడా ఇలాంటి అప్ అండ్ డౌన్స్ యాక్టింగ్ అనే కాదు, ఏ బిజినెస్‌లోనైనా వుంటాయి.

అలాగే నేను హీరోగా ఆరు సక్సెస్‌ఫుల్ సినిమాలు చేసాను. 'యమలీల', 'అమ్మాయి కాపురం', 'పిట్టలదొర', 'మిస్టర్ మాయగాడు', 'ఆడాళ్ళా మజాకా', 'ఆలీబాబా అద్భుత దీపం'. అలాగే ఆరు సినిమాలు ఫెయిల్యూర్ చూసాను. ఇక మిగతా కాంబినేషన్లు చాలా చేసాను. అవి హిట్టయినా, ఫ్లాపయినా అవి నా ఒక్కడి వల్లనే అని చెప్పుకోకూడదు.

అయితే కమెడియన్‌గా నేను మంచి పేరు సంపాదించుకున్నాను. హీరోగా చేస్తూ కూడా ఒకరోజు వేషాలు చేసాను. నాకు మెయిన్ కామెడీయే. హీరో కాదు.



❑ ఈ మధ్యకాలంలో హీరోగా చేయమని ఎవ్వరూ అడగలేదా?

✿ అడిగారు. నేనే చేయనన్నాను. నాకిష్టంలేదు. సబ్జెక్ట్ నాకు తగ్గట్టుగా వుండాలి. వాళ్ళు వేరే ఏదో అనుకుని చేస్తారు. ఆ తర్వాత వాళ్ళూ బ్యాడ్ అయిపోయి, నేనూ బ్యాడ్ అయిపోతాను.

❑ నటన తప్ప ఇతర రంగాల్లోకి ప్రవేశించే అవకాశం ఏదైనా వుందా?

✿ నటుడికి ఒకటే రంగం. అది సినిమారంగం. ఒకవేళ వెళ్ళినా పప్పులో కాలువేయాల్సి వస్తుంది. ఎందుకంటే ఆ రంగం గురించి తెలియదు కాబట్టి.

❑ ఇప్పటికి చాలా రకాల పాత్రలు చేసారు. ఇంకేమైనా పాత్రలు చేయాలనుకుంటున్నారా?

✿ ఒక్క ఇడ్లీపాత్ర మినహా అన్నిరకాల పాత్రలు చేసాను.

❑ బైట సీరియస్ గా ఉంటారు... సరే...కనీసం ఇంట్లోనైనా సరదాగా వుంటారా?

✿ చాలా సీరియస్‌గా వుంటాను. అస్సలు జోకులు వేయను. వాళ్ళు వేసినా నేను నవ్వను. ఎందుకంటే ఇంట్లో ఎవరో ఒకరి మీద భయం వుండాలి. లేకపోతే అందరూ సరదాగా వుంటే, మనం ఏం చెప్పినా వీడేం పట్టించుకోవడం లేదని సీరియస్‌గా వుంటారు.

❑ మీకు బాగా నచ్చిన హాస్యనటుడు?

✿ ఒకప్పుడు రాజబాబు, ఇప్పుడు బ్రహ్మానందం.

❑ నవ్వు నాలుగు విధాల చేటు అంటారు. దీనికి మీరేమంటారు?

✿ నవ్వు నాలుగు విధాల చేటు అని అవతలి వాడు అనుకుంటేనే చేటు, అనుకోకపోతే ఆరోగ్యమే.

❑ ఇన్నేళ్ళూ నవ్వించి నవ్వించి మీకు బోర్ కొట్టడం లేదా?

✿ నవ్వించి, నవ్వించి చాలా మంది ఏడుస్తున్నారు కూడా థియేటర్‌లో కూర్చొని. బోర్ మాత్రం కొట్టదు. బోర్ కొట్టించలేం కూడా. అలాంటి నటులం మేం.

❑ మొత్తం మీ సినిమాలు?

✿ 565 కు పైగా.

-శ్రీవిక్రమ్

అక్టోబర్ 7న శివనాగేశ్వరరావు పుట్టిన రోజు సందర్భంగా....



# వినోదం తప్ప విసుగు పంచని దర్శకుడు

## శివనాగేశ్వరరావు

**కొంతమంది వ్యక్తులు ఎంతకాలంగా మనకి పరిచయం వున్నా వాళ్ళు ఎలాంటివారో మనకి తెలీదు. ఎందుకంటే సమయాన్నీ, సందర్భాన్నీ, అవసరాన్నీ, అవకాశాన్నీ బట్టీ వాళ్ళు మారిపోతుంటారు. దాన్ని లౌక్యం అనుకోవచ్చు! కానీ అతికొద్దిమంది మనుషులు మాత్రమే ఒకసారి మాట్లాడితేనే బాగా తెలిసినట్టవుతారు. హిపోక్రసీ లేకుండా మాట్లాడడం దానికి కారణం కావచ్చు. అటువంటి వ్యక్తి డైరెక్టర్ శివనాగేశ్వరరావు.**

ఆయన 'మనీ' శివనాగేశ్వరరావుగా అందరికీ తెలిసారు. మొదటి సినిమాలోనే తనదైన స్టయిలు ఎస్టాబ్లిష్ చేసుకున్న డైరెక్టర్. 'వన్ బై టూ', 'లక్కీ ఛాన్స్', 'వామ్మో.... వా అత్తో... వా పెళ్ళామో', 'నాయనమ్మ', 'వన్స్‌మోర్', 'సిసింద్రీ', 'పట్టుకోండిచూద్దాం', 'ఓ పనయిపోతుంది బాబూ', 'హేండ్సప్', తాజాగా 'ధనలక్ష్మి ఐ లవ్ యూ' ఇలా టైటిల్స్‌లో కూడా బోలెడు వైవిధ్యం చూపిస్తారు.



చిన్నా, చక్రవర్తిలతో శివనాగేశ్వరరావు

కామెడీలో చిన్న క్రైమ్ పాయింట్ మిక్స్ చేసి ప్రేక్షకుల్ని రెండు గంటల సేపు హాయిగా నవ్వించి ఎటువంటి బాధా కలగకుండా పంపించే మనస్తత్వం.

'Humour cures people - both the one who gives it and the one who receives it'.



కామెడీకి నిఘంటువు లాంటి మన 'బాపూ' గారు కూడా మెచ్చుకున్న కామెడీ ఆయనది. శివనాగేశ్వరరావు - హాస్యానికీ అపహాస్యానికీ మధ్యన గీసిన సన్నని గీత పట్టుకోగలిగిన వారు. ముఖ్యంగా స్త్రీ ప్రేక్షకుల్ని ఇబ్బంది పెట్టని విధంగా సినిమాలు తియ్యగలిగిన వారు. పాటల్లో హాస్యపు విరుపుల మెరుపుల్ని మేళవించే వారు. ఊహ తెలీని పసివాడి చేత ఫీట్లు చేయించారు. నటనలో పండిపోయిన సూర్యకాంతమ్మ గారి చేత తన బాణీలో తిట్లు చిలకరింప చేయించారు. ఏ చిత్రమైనా తనదైన ముద్ర వుండేలా జాగ్రత్త పడ్డారు. ఆయన సినిమాల్లో హీరోలు కష్టాలు పడ్తూ మనని నవ్విస్తుంటారు.



'పట్టుకోండి చూద్దాం'లో ఓ దృశ్యం

ఉడ్‌హౌస్ నవలలూ, చాప్లిన్ సినిమాలూ ఇష్టపడే వాళ్ళకి ఈయన నచ్చుతారు. ఈయన సినిమాల్లో కామెడీనే హీరో! వ్యక్తిగా పరమ నిర్మొహమాటీ, నిష్కపటీ. 'Adopt silence or Speak Frankly' అన్న పంథాలో మాట్లాడతారు.

ఆయన తీసిన చిత్రాల జయాపజయాల ప్రభావం ఆయన్ని అభిమానించే వాళ్ళ మీద వుండదు. నలుగురు కలిసినప్పుడు ఆయన పేరొస్తే పెదవుల మీదకి చిరునవ్వొస్తుంది. ఆయనతో పరిచయం అయిన ప్రతివాళ్ళు ఏదో ఒక సందర్భంలో ఆయన సెన్స్ ఆఫ్ హ్యూమర్ తాకిడికి గురయ్యే వుంటారు! ఇంగ్లీషులో ఒక సేయింగ్ వుంది.

'Even though the room is big
If there is no place for wit,
we can say it is congested'

అని

రిసీవ్ చేసుకోవాలేగానీ ఆయన వున్నచోట అంతా హ్యూమరే!

మొదటి పరిచయంలోనే "మీరేం రాసారో ఇప్పటిదాకా నాకు తెలీదు... మీకు తెలుసా?" అని నన్ను అడిగిన వ్యక్తి!!!

నేటివిటీ విడిచిపెట్టని వ్యక్తి. తెలుగు భాష మీదున్న కమాండ్ వల్ల సామెతలతో సాము గరిడీలూ, నానుడులతో నాట్యాలూ చేయించగల వ్యక్తి. పొగుడుత్తున్నట్లుగా చురకలెయ్యడం, చమత్కరిస్తున్నట్లుగా తిట్టడం, తిడ్తున్నట్లు తెలీకుండా నవ్వించడం ఆయన ప్రత్యేకతలు. సాహిత్యం మీద మంచి అభిరుచీ, అవగాహనలో మంచి డెప్త్ వున్న మనిషి. ఆయనతో కాసేపు మాట్లాడి కామెడీ డైలాగులు రాసుకునే రచయితలున్నారు.

ఎందుకంటే - ఎదుటి మనిషి బాధల్ని మనవిగా ఫీల్ అవగలిగిన వాళ్ళే వాటిని అందంగా స్క్రీన్ మీద ప్రెజెంట్ చెయ్యగలరు. మధ్యతరగతి మానవుడి జీవితంలోని ట్రాజెడీలని కామెడీ ఆఫ్ ఎర్రర్స్‌గా చూపించగలగే ఆయనలో మంచి క్రియేటర్ వున్నాడు.

సలహా కోసం సమస్యతో వెళ్తే సరదాగా నవ్వించి పంపే మంచి మిత్రుడున్నాడు.

పాతిక రూపాయల టికెట్టు కొని సినిమాకెళ్ళే ప్రేక్షకుడికి వినోదం తప్ప విసుగు పంచని మంచి డైరెక్టర్ వున్నారు.

రిటార్ట్‌లతో రికగ్నిషన్ సంపాదించిన చతురుడున్నాడు.

ఎటువంటి పరిస్థితులలోనైనా నిబ్బరంగా వుండగలిగే ఫిలాసఫర్ వున్నాడు.

ఎదుటివారి ముఖ కవళికల్ని బట్టి వారి మనస్తత్వం చదవగలిగిన మేధావి వున్నాడు.

అందరూ నా వాళ్ళే అనుకునే అమాయకుడున్నాడు.

వెరసి ఒక మంచి మనిషున్నాడు. ఏ వ్యక్తి మీదా ఆర్టికల్ రాయని నేను ఈసారి రాయడానికి కారణం అదే.

**- బలభద్రపాత్రుని రమణి**

## రచన: వేటూరి — 1 — గానం : బాలు, అనురాధా శ్రీరామ్

ఆ: చెలి చెడుగుడు జెమిని జెమిని
తల తిరుగుడు జెమిని జెమిని
చలి విరుగుడు జెమిని జెమిని
పిలు పెరగడు జెమిని జెమిని
కల బడుమరి జెమిని జెమిని
కథ ముదిరిన జెమిని జెమిని
నిలబడుమరి జెమిని జెమిని
చెలి వలచిన జెమిని జెమిని
జెమిని జెమిని జెమిని జెమిని కామిని కామిని కామిని కామిని
జెమిని జెమిని జెమిని జెమిని కామిని కామిని కామిని కామిని
లీకేజీ సొగసులతో - టీనేజీ వయసులతో
ఈ లేజీ పురుషుడికీ - ఈలేసే తికమకలో
వెయ్ పోటు వెయ్ పోటు(4) ॥చెలి॥
ఆ: జెమిని జెమిని జెమిని జెమిని జెమిని జెమిని జెమినీ
అ: సిగ్గిడిచిన పిల్లరో మొగ్గచెడిన మల్లెరో
బుగ్గపండు గిల్లరో - తిక్కదించరో..
ఓ బజారు కోకిల.. కాలు జారు షోకిలా
మారుతావు కాకిలా.. రెచ్చిపోకిలా..
ఏలూరులో ఎక్కినా వుయ్యూరులో వూగినా
బెజవాడలో బెంగపడి మంగళగిరి చేరినా
వచ్చేస్తా.. టచ్చేస్తా.. నచ్చిందే ఇచ్చేస్తా
దాచిందే దోచేస్తా.. దమ్మెంతో చూపిస్తా..
కొట్టు కొట్టు కోకనట్టు కట్టు కట్టు చీరకట్టు
ముద్దులన్ని మూటకట్టు మూట విప్పి ముద్దుపెట్టు
వెయ్ పోటు వెయ్ పోటు వెయ్ పోటు వేసెయ్ పోటు ॥చెలి॥
ఆ: జెమిని జెమిని జెమిని జెమిని జెమిని జెమిని జెమినీ
అ: కంటపడిన చిన్నదీ కంటగించుకున్నదీ
కనకరించకున్నదీ.. కన్నుగీటినా..
లవ్వుమత్తులో పడి.. లైఫ్ బొత్తిగా చెడి
అడ్డరోడ్డునే పడి.. అలమటించినా..
కృష్ణలో మునిగినా కృష్ణుడల్లె తేలినా
భంగు ఎంత కొట్టినా బ్యారేజీ ఎక్కినా
నీ రూపే గుండెల్లో దాచానే ఇన్నాళ్ళు
నీ కోసం వుంచానే కవ్వించే కౌగిళ్ళు
పావడాల పానిపట్టు ప్రాయసాల తేనెపట్టు
ఎక్కమాకు చింతచెట్టు చిట్టిచీమ నిన్ను కుట్టు
ఆ: వెయ్ పోటు.. వెయ్ పోటు.. (4) ॥చెలి॥

## రచన: వేటూరి — 2 — గానం : రాజేష్

ప: పూలలో తేనె ప్రేమ.. ప్రేమ తేనెలో తీపి ప్రేమ.. ప్రేమ
తీపిలో హాయి ప్రేమ.. ప్రేమ హాయి నీవంది ప్రేమ..ప్రేమ
బహుశా నా ప్రాణమై నిలిచే నీ ప్రేమా
మనసో అది ఏమిటో తెలియనిదీ ప్రేమా.. ॥పూలలో॥
చ: కమ్మని కల - కౌగిలి వథ



ఆ: నడుమెరుగని మడమతిప్పి పడమట్లంకొచ్చేస్తా
అ: జిలకమూడి కృష్ణలోన కనకదుర్గ నచ్చిస్తా
తస్సదియా బీటు మీద అశ్వరభా అంటుంటే
చూసినోళ్ళు అందరికీ శుభం కార్డు పడ్డట్టే
ఆ: వెయ్ పోటు.. వెయ్ పోటు.. (2) ॥చెలి॥

## రచన: వేటూరి — 7 — గానం : ఆర్.పి. పట్నాయక్

ప: బంధమే ముల్లు అయినా బాధలో నవ్వు ప్రేమా
ఏడు జన్మాలకైనా తోడు నేనన్న ప్రేమా
లైలా మజ్నూలుగా రాలిన ఆ ప్రేమ
బ్రతుకే ఓ మాయని చాటిన ఈ ప్రేమ ॥బంధమే ముల్లు॥
చ: కమ్మని కల - కంటికి అల వెచ్చని నిషాలదీ ప్రేమ
ప్రేయసి శిల - వలపాక వల నన్ను కాదన్న ప్రేమ ॥కమ్మని॥
కాలం చెల్లని ప్రేమ - మన దూరం చెరపని ప్రేమ
ప్రాణానికి ప్రాణం ప్రేమ.. నీవు సుమా.. ॥బంధమే ముల్లు॥

## రచన: వేటూరి — 8 — గానం : శంకర్‌మహదేవన్, ఉష

సాకి/అ: ఓ సిన్నదానా సందె వేళ
సందు చూసి వచ్చేయనా
నీ గుండెలోన నిద్రపోనా
ప/అ: నడకచూస్తే వయారం కులుకుచూస్తే సింగారం
పడుచు సోకు పలారం దుమ్ము దుమారం
పిడత ముద్దు పింగాణం ఉడత నడుము వడ్డాణం
మనసుపడ్డ మాగాణం గుట్టు గుడారం
వియ్యాల వారి ఉయ్యాల కట్నం వయ్యారిభామ
ఆ: అల్లారు ముద్దు చల్లారనీదు పిల్లాడి ప్రేమ
అ: ఖిల్లా లంగడియో.. ఖిల్లా లంగడియో(4) ॥నడక॥
అ: మనసు నిలపదంట మడి కట్టుకుంటే ఎట్టా
మల్లెమొగ్గలన్నీ నన్ను గిల్లేసె ఈ పూట
ఆ: వయసు పిలిచెనంట ఇక వాయిదాకి టాటా
ముద్దులెన్నో వచ్చి నన్ను ముంచేసె ఈ పూట
అ: మాట ఇచ్చినాక మొహమాటమేలనంట
చాటు చూసుకుంటా తొలికాటు వేసుకుంటా
ఆ: ఆటు పోటులన్నీ నీతోటి పంచుకుంటా
ఆట విడుపు కోసం నా రూటు మార్చుకుంటా
అ: ఖిల్లా లంగడియో.. ఖిల్లా లంగడియో(4) ॥నడక॥
ఆ: మంచు పల్లకీలో మరుమల్లె ఒత్తిడంట
అ: ఒత్తిడెంత ఉన్నా నీ ఒళ్ళంతా పువ్వంట
ఆ: పంచదార ఇసకే ఈ మంచు వెన్నెలంట
అ: నంచుకుంటే రుచిలే నీ ముద్దంతా యిమ్మంట
ఆ: పడుచు ఎండకెన్నో మురిపాలు పొంగెనంట
అ: ఒడిసి పట్టగానే ఒళ్ళంత మీగడంట
ఆ: అహ ఓపలేను నాలో వయసమ్మ గుండెకోత
అ: చెరగనీకు పాప చెలిమైన బ్రహ్మరాత
అ: ఖిల్లా లంగడియో.. ఖిల్లా లంగడియో(4) ॥నడక॥



## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 1 — గానం: దేవన్, కోటి, త్రివిక్రమ్, అనురాధాశ్రీరామ్

సాకి: పాపంరో పాపాయ్‌రో కోపమొద్దుబాసూ
ఈస్టికి వెస్టికి తేడా తెలీని ఇన్నోసెంట్ ఫేసు
తప్పదుగా నెమ్మదిగా తీసుకోర క్లాసు
ఒకటా రెండా ఎన్నున్నాయొకద కండిషన్సు
ప: కంప్యూటర్స్ ఆర్ట్సు మేథ్సు కామర్సు
ఇవన్నీ క్లాసురూం సబ్జెక్ట్సు ఎలాగా తప్పని న్యూసెన్సు
క్యాంపస్ అబ్బాయిల మధ్యన తిరిగే మేనర్సు
తెలీదంటే తప్పే మిస్సు వెరీ ఇంపార్టెంట్ సిలబస్సు
టాటా బిర్లా డాటర్లైనా తలొంచి తీరాలి
మీరేం చెయ్యాలనుకున్న మా పర్మిషనుండాలి
ఈ మాటల్నే పాఠంగా చదువుకోండి డైలీ ॥కంప్యూటర్స్॥
దట్స్ ది వే.. ఐ లైకిట్
చ/అ: ఐస్ క్రీం లు గట్రా తింటూ హై స్పీడులో లావైపోకు
డైటింగ్ పాటిస్తూ స్లిమ్‌గా ఉండు
ఆ: బోండాంలా ఉన్నావ్ పండూ నీ బాడీ చూస్కో ముందు
నీక్కూడా కావాలా గర్ల్‌ఫ్రెండు
అ: నేనెంత అంటే నువ్వెంతంటూ డిబేటు మానెయ్యాలి
మగాళ్ళ పనులను మహాద్భుతం అని పదే పదే పొగడాలి
ఆ: ప్రతీ దినం మాకోసం తాజా ఫ్లవర్ బొకే తేవాలి
దిల్‌దే సనమ్ అంటూ దీనంగా మమ్మల్ని బతిమాలాలి
అ: ఆ బెట్టు కాస్త తగ్గాలి మా పట్టుదలే నెగ్గాలి
మా కంటి చూపుకే భయపడుతూ కంట్రోల్లో ఉండాలి
దట్స్ ది వే.. ఆహా.. వుయ్ లైకిట్ ॥కంప్యూటర్స్
చ/అ: గన్నీ బ్యాగ్ అనిపించేలా చున్నీతో చుట్టేయ్యాలా
కాస్తైనా డ్రెస్సింగ్ సెన్సుండాలి
ఆ: సన్నగా కనిపించేలా నున్నంగా షేవింగ్‌తో కొంచెం రఫ్ మ్యాన్లీనెస్సుండాలి
అ: ఎలాగ మీరుండాలో చెప్పే ప్రతీ డెసిషన్ మాది
సరే సరే అని ఫాలో అయ్యే డిసిప్లినొకటే మీది
ఆ: సరేలే పోనీ సరదాపడనీ అన్నంత సహనం మాది
మరీ ఇలా శృతిమించుంటే కథంతా చెడిపోతుంది
అ: మీరుడుక్కుంటే చూడాలి మా హుషారు చెలరేగాలి
మీరేడుస్తుంటే ఓదార్చే అవకాశం కావాలి
దట్స్ ది వే.. ఆహా.. వుయ్ లైకిట్ ॥కంప్యూటర్స్॥

## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 2 — గానం: ఉదిత్‌నారాయణ్, నిత్యసంతోషిణి

ప/అ: నా మనసుకేమయింది.. నీ మాయలో పడింది..
నిజమా కలా? తెలిసేదెలా?
ఆ: నాకూ అలాగే వుంది.. ఎన్నో అనాలనుంది..
దాచేదెలా.. లోలోపలా
అ: మనిద్దరికీ తెలియంది.. ఏదో జరిగే వుంటుంది..



## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 5 — గానం: శంకర్‌మహదేవన్

సాకి: చెలియా నీవైపే వస్తున్నా కంటపడవా ఇకనైనా ఎక్కడున్నా
ప: నిద్దరపోతున్న రాతిరినడిగా గూటికి చేరిన గువ్వలనడిగా
చల్లగాలినడిగా ఆ చందమామనడిగా ప్రియురాలి జాడ చెప్పరేమని
చస్తున్నా చెలీ ఈ చలితో పడలేక
చూస్తున్నా ఇలా ఏ దారి కనపడక
చ: ఓ.. అసలే ఒంటరితనం అటుపై నిరీక్షణం
అరెరె పాపమని జాలిగా చూసే జనం
గోరంత గొడవ జరిగితే కొండంత కోపమా
నన్నొదిలి నువ్వు ఉండగలవ నిజం చెప్పవమ్మా
చ: ఓ.. నువ్వు నా ప్రాణం అని విన్నవించు ఈ పాటని
ఎక్కడో దూరానున్న చుక్కలే విన్నాగాని
కదిలించ లేద కాస్త కూడా నీ మనస్సుని
పరదాలు దాటి ఒక్కసారి పలకరించవేమి

## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 6 — గానం: రాజేష్, కౌసల్య

అ: అమ్మాయి నచ్చేసింది - ఆహ్వానం ఇచ్చేసింది
ఓ ముద్దమందారంలా ముస్తాబయ్యింది
వైశాఖం వచ్చేసింది - ఇవ్వాళో రేపో అంది
ఓ మంచి ముహూర్తం చూసి సిద్ధంకమ్మంది
ఓ.. ఈ కబురు విన్న ఎదలో ఎన్నెన్ని పాడుపు కథలో
ఆ: మనువే కుదిరి - కునుకే చెదిరి -
మురిపెం ముదిరి (నా మనసు)
కొమ్మల్లో చిలక - మోమాట పడక -
వచ్చివాలమ్మా (రావే నావంక)
చ/అ: ఈ గాలి రోజులా వీస్తున్న -
ఈ వేళ వేరేలా వింటున్నా సన్నాయి రాగాలుగా
ఆ: నా వైపు రోజులా చూస్తున్నా -
ఈనాడే ఏదోలా అవుతున్నా
నీ కన్ను ఏమన్నదో నా ఈడు ఏం విన్నదో
అ: ఆశ పెట్టి పెట్టి చంపుతూంటే అటో ఇటో కానా
ఆ: నువ్వు పట్టి పట్టి చూస్తూ ఉంటే కంగారుపడిపోనా
అ: ఎన్నెన్నో అనిపించి ఉక్కిరి బిక్కిరి అవుతున్నా
చ/ఆ: ముత్యాల మేనాలే రప్పించి -
మేఘాల వీధుల్లో తిప్పించి ఊరేగనీ హాయిగా
అ: అందం హద్దుల్నే తప్పించి -
వందేళ్ళ కౌగిళ్ళే అందించి ఊరించు ఆ వేడుక.. ఓ..
ఆ: అంత గిచ్చి గిచ్చి రెచ్చకొట్టకట్టా చీచీ పాడు
అ: ఇంత పిచ్చి పిచ్చి పెంచుతోంది నువ్వేకదా చూడు
ఆ: కవ్వించి కరిగించి కలిగే వయసుని కాపాడు

ఆ నవ్వు మీటింది వీణ
ఏడేడు లోకాలలో యింత అందాన్ని ఈ రోజే చూశానుగా ॥బ్రహ్మ॥
చ: నీలాల ఆ కళ్లలో నీరెండ దాగున్నదో
ఆ లేడి కూనమ్మ ఈ వింత చూసింద ఏమంటదో
ఆ పాల చెక్కిళ్లలో మందారమే పూచెనో
ఈ చోద్యమే చూసి అందాల గోరింట ఏమంటదో
నా గుండె దోసిళ్ళు నిండాలిలేనాడు ఆ నవ్వు ముత్యాలతో
ఈ జ్ఞాపకాలన్ని నే దాచుకుంటాను ప్రేమతో ॥బ్రహ్మ॥
చ: నూరేళ్ళ ఈ జన్మనీ ఇచ్చింది నువ్వేననీ
ఏ పూజలూ రాని నేనంటె నీకెంత ప్రేముందనీ
ఈ వేళ ఈ హాయినీ నా గుండెనే తాకనీ
అందాల ఆ రాణి కౌగిళ్లలో వాలి జీవించనీ
ఆ పంచభూతాలు ఒక్కొక్కటై వచ్చి చల్లంగ దీవించనీ
తన చెంతకే చేరి ఏ రోజు చెప్పాలి ప్రేమనీ ॥బ్రహ్మ॥

## రచన: వేటూరి — 6 — గానం : బాలు, అనురాధా శ్రీరామ్

ప/ఆ: చెలి చెడుగుడు జెమిని జెమిని  చలి విరుగుడు జెమిని జెమిని
కలబడుమలి జెమిని జెమిని  కథ ముదిరిన జెమిని జెమిని
అ: చెలి చెడుగుడు జెమిని జెమిని  చలి ఎరుగడు జెమిని జెమిని
తొలి వలపుల కబడి కబడి  తెగ ఆడిన జెమిని జెమిని
జెమిని జెమిని జెమిని జెమిని  కబడి కబడి కబడి కబడి
జెమిని జెమిని జెమిని జెమిని  కబడి కబడి కబడి కబడి
మోజంటే నీజంటే - జెంటిల్‌మన్ జెమిని జెమిని
ఓ మాటా ఓ బాణం - ఓ వనితా జెమిని జెమిని
ఆ: వెయ్ పోటు.. వెయ్ పోటు (2)
అ: వయసున్న మనసు జెమిని  మనసుల్లో సొగసు జెమిని
సొగసైన మనిషి జెమిని  మనుషుల్లో మంచి జెమిని
ఆ: జెమిని జెమిని జెమిని జెమిని జెమిని జెమిని జెమిని జెమిని
అ: పొంగెరుగని పాలులా  తీపెరుగని తేనెలా
నిన్నెరుగని నేనిలా ఉండలేనులే
ఆ: నీరులేని మబ్బులా  నీదికాని మనసులా
ఆడజన్మ మోడుగా ఉండలేనులే
అ: గోదావరి నీటి మీన  రాదారి పడవలోన
చేరుకునే రేవు పేరు జంటవలపులే
ఆ: తీర్చలేని ఋణము చేసి  వలపు వడ్డీ చెల్లించు
అ: ప్రేమసరీ నోటు మీద  శుభలేఖలు వేయించు
మిస్సుమిసా బుగ్గపండు  కిస్సుపిట్టా కొట్టేస్తే
కస్సు బుస్సు కన్నెపిల్ల  కిస్సుకి యస్ అన్నట్టే
ఆ: వెయ్ పోటు.. వెయ్ పోటు (2)
ఆ: జెమిని జెమిని జెమిని జెమిని  జెమిని జెమిని జెమిని జెమిని ॥చెలి॥
అ: చదువుల్లో మర్మము  పెదవుల్లో మధురము
బతుకుల్లో ధర్మము తెలిపినావులే
ఆ: మల్లెల్లో గంధము  మనసుల్లో బంధము
అందానికి అందమే తెచ్చినావులే
అ: కుర్రగాలి మల్లగానే  వెర్రి వేణువూదుకున్నా
అనురాగపు అష్టపదుల పాట మనదిలే



ఎర్రని పెదాలలో ప్రేమ
వెన్నెల కల - వెచ్చని వల  నీవు నేనైన ప్రేమ ॥కమ్మని॥
కాలం చెల్లని ప్రేమ.. నీ దూరపు చేరువ ప్రేమ
సింధూరపు తూరుపు ప్రేమ... నీవు సుమా... ॥పూలలో॥
ఆ పరిచయం - ఈ పరిమళం  పూసిన ఎడారి నా ప్రేమ
కోరిన సుఖం - చేరిన సగం  నాకు నీవైన ప్రేమ ॥ఆ పరిచయం॥
చూపుగ నాటిన ప్రేమ - కను చూపుకు అందని ప్రేమ
అందానికి అందం తెచ్చే.. ప్రేమ సుమా ॥పూలలో॥

## రచన: వేటూరి — 3 — గానం : ఉష

ప: దిల్ దివాన మై హసీన ప్యార్ మే పాగల్
చైన్ చురాయే నీందుడాయే కౌన్ ఏ హార్‌పల్
వేణువూది చంపుతావు వేళగాని వేళలో
ఉట్టిగొట్టి పుట్టికాస్త ముంచుతావు వాడలో
కన్నెముద్దు వెన్నముద్ద దోచుకున్న హాయిలో
చీరనైన వదలవాయే సిగ్గుపడ్డ ఈడులో.. ॥దిల్ దివాన॥
చ: కోయిలమ్మ కొమ్మకొచ్చి కొత్తపాట పాడుతుంటే
తుమ్మెదొచ్చి రెమ్మపూల గుమ్మతేనె కోరుకుంటే
అందమైన ఇంట్లో నందనాలు పూసే
చిలకముక్కు పచ్చ తోరణాలుకట్టే
నోరుపండనివ్వు ముద్దుతో...
మిలి ఏక్ అజ్‌నబీసే కోయీ ఆగేనా పీఛే
తుమ్ హి కహోయే కోయీ బాత్ హై ॥దిల్ దివాన॥
చ: అందమంతా లాలపోసి  ముద్దచేసి జంటలోన
నీటిపైట మీటి పోయే  వీణలాంటి ఒంటి మీన
మరుగుతున్న ఎండే కరిగి వెన్నెలాయే
పాలవెల్లువల్లె ఈడు తుళ్ళి పోయె
గోరువెచ్చ వాలు పొద్దులో..
మిలి ఏక్ అజ్‌నబీసే కోయీ ఆగేనా పీఛే
తుమ్ హి కహోయే కోయీ బాత్‌హై ॥దిల్ దివాన॥

## రచన: వేటూరి — 4 — గానం : వందేమాతరం శ్రీనివాస్

ప: చుక్కల్లోకెక్కినాడు చక్కనోడు  ఎప్పటికీ ఎవ్వరికీ చిక్కనోడు(2)
తల్లడిల్లి పోతుందీ తల్లి అన్నదీ  బొట్టురాల్చుకుంటుందీ కట్టుకున్నదీ
పాడె ఎత్తటానికే స్నేహమన్నదీ  కొరివి పెట్టడానికే కొడుకు వున్నదీ ॥చుక్కల్లో॥
చ: పోయినోడు యిక రాడు
ఎవడికెవడు తోడు  ఉన్నవాడు పోయినోడి గురుతు నిలుపుతాడు
నువ్వు తిన్న మన్నేరా నిన్ను తిన్నదీ  కన్నీళ్లకు కట్టెకూడ ఆరనన్నదీ
చావు బ్రతుకులన్నవి ఆడుకుంటవీ  చావులేని స్నేహమే తోడువుంటదీ... ॥చుక్కల్లో॥

## రచన: కులశేఖర్ — 5 — గానం : బాలు

ప: బ్రహ్మ ఓ బ్రహ్మ
మహా ముద్దుగా వుంది గుమ్మ
బొమ్మా ఈ బొమ్మా
అరె అందానికే అందమా ॥బ్రహ్మ॥
జాబిల్లిలా వుంది జాణ



నడిపే వెలుగై రావా..
ప: నువ్వే నువ్వే కావాలంటుంది పదే పదే నా ప్రాణం
నిన్నే నిన్నే వెంటాడుతూ వుది ప్రతిక్షణం నా మౌనం
రేపు లేని చూపు నేనై
శ్వాస లేని ఆశ నేనై మిగలనా
ఏ చోట వున్నా నీవెంటలేనా..
సముద్రమంతా నా కన్నుల్లో కన్నీటి అలలౌతుంటే
ఎడారి అంతా నా గుండెల్లో నిట్టూర్పు సెగలౌతుంటే
రేపు లేని చూపు నేనై
శ్వాస లేని ఆశ నేనై మిగలనా..
ఏ చోట వున్నా నీవెంటలేనా..

## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 4 — గానం: కె.కె.

ప: అయామ్ వెరీ సారీ అన్నాగా వందోసారి
సరదాగా నవ్వేసెయ్ ఒకసారి
అయామ్ వెరీ సారీ అన్నాగా వందోసారి
సరదాగా నవ్వేసెయ్ ఒకసారి
హాయో హాయో హాయో పెదాలలా బిగించి శపించకే మరీ
మంత్రాలవీ జపించి వదిలెయ్ క్షమించి
అరె పాపం - చిరుకోపం - నిజమేనా - మేకప్పా
అరె పాపా సారీ చెప్పా ఓ మై గోల్డెన్ చేపా
ఫారెక్స్ బేబీ ట్రైపా లౌలీ లాత పాప్పా ॥అయామ్ వెరీ॥
చ: తరిమి తరిమి తరిమి నిను ఏడిపించడం
ఎందుకా అని అడిగావనుకో చెబుతా వింటావామరి (2)
సమ్మర్ గిమ్మర్ వింటర్ అంటూ
ప్రతీ ఋతువుకో డిఫరెన్సూ
ఉన్నప్పుడే కద బావుంటుంది
చిరునవ్వు తప్ప నీ ఫేసుకెప్పుడూ మరో కలర్ రాదా
అని డౌటుపుట్టి అదె తీర్చుకుందుకే
తమాషాగా ట్రైలేసి చూసానే బేబీ..
అయామ్ వెరీ సారీ అన్నాగా వెయ్యోసారి
సరదాగా నవ్వేసెయ్ ఒకసారి..
చ: లిప్‌స్టిక్ అవసరమైనా లేనంత
ఎర్రగా పెదవివుందిగా
కందే వరకూ కొరికి తెగ హింసించకే (2)
టొమేటో పళ్ళకి డూపుల్లా
సుమారు సిమ్లా యాపిల్లా
వున్నావే పిల్లా నువు నిలువెల్లా
నీ బుంగమూతిలో పొంగనీయకే బుగ్గలు బర్గర్లా
నన్నుండనీక ఊరించితే అవి
నిజం చెప్పు నీ తప్పు కాదా అది.. ॥అయామ్ వెరీ॥



అందుకే ఇంతలా గుండె ఉలికిపడుతువుంది
నా మనసుకేమయింది.. నీ మాయలో పడింది.. ॥నా మనసు॥
చ/అ: చుక్కలే తెచ్చి ఇవ్వనా.. అంది నీమీద నాకున్న ప్రేమ
కొత్తగా వుంది బొత్తిగా నమ్మలేనంత ఈ వింత ధీమా..
ఆ: జంటగా వెంట నువ్వుంటే.. అందదా నాకు ఆ చందమామ
అందుకే నాకు నువ్వంటే.. మాటలో చెప్పలేనంత ప్రేమ
అ: పంచుకున్న ముద్దులో.. ఇలా జతేపడి..
ఆ: పెంచుకున్న మత్తులో.. మరీ మతే చెడీ..
అ: గాలితో చెప్పనీ మన మొదటి గెలుపు ఇదని.. ॥నా మనసు॥
చ/ఆ: ఎప్పుడూ గుండె చప్పుడూ కొట్టుకుంటుంది నీపేరులాగా...
ఎప్పుడో అప్పుడప్పుడూ గుర్తుకొస్తుంది నాపేరు కొద్దిగా..
అ: ఒంటిగా ఉండనివ్వదు కళ్లలోవున్న నీ రూపురేఖ
ఇంతగా నన్ను ఎవ్వరూ కమ్ముకోలేదు నీలా ఇలాగ
ఆ: లోకమంటే ఇద్దరే.. అదే మనం అని..
అ: స్వర్గమంటే ఇక్కడే.. అంటే సరె అని..
ఆ: వెన్నెలే.. పాడనీ.. మన చిలిపి చెలిమి కథని.. ॥నా మనసు॥

## రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి — 3 — గానం: చిత్ర

ప: ఏ చోట వున్నా నీ వెంటలేనా..
సముద్రమంతా నా కన్నుల్లో కన్నీటి అలలౌతుంటే
ఎడారి అంతా నా గుండెల్లో నిట్టూర్పు సెగలౌతుంటే
రేపు లేని చూపు నేనై శ్వాస లేని ఆశ నేనై మిగలనా
నువ్వే నువ్వే కావాలంటుంది పదే పదే నా ప్రాణం
నిన్నే నిన్నే వెంటాడుతూ వుంది ప్రతిక్షణం నా మౌనం
చ: నేలవైపు చూసే నేరం చేశావని
నీలిమబ్బు నిందిస్తుందా వాన చినుకుని
గాలి వెంట వెళ్ళే మారం మానుకోమని
తల్లితీగ బంధిస్తుందా మల్లెపువుని
ఏమంత పాపం ప్రేమా! ప్రేమించడం
ఇకనైనా చాలించమ్మా! వేధించడం
చెలిమై కురిసే సిరివెన్నెలవా క్షణమై కరిగే కలవా..
ప: నువ్వే నువ్వే కావాలంటుంది పదే పదే నా ప్రాణం
నిన్నే వెంటాడుతూ వుంది ప్రతిక్షణం నా మౌనం
రేపు లేని చూపు నేనై శ్వాసలేని ఆశ నేనై మిగలనా..
చ: వేలుపట్టి నడిపిస్తుంటే చంటిపాపలా!
నా అడుగులు అడిగే.. తీరం చేరేదెలా?
వేరెవరో చూపిస్తుంటే నా ప్రతి కలా..
కంటిపాప కోరే స్వప్నం చూసేదెలా?
నాక్కూడ చోటేలేని నా మనసులో
నిన్నుంచగలనా ప్రేమా ఈ జన్మలో
వెతికే మజిలీ దొరికే వరకూ

సురేష్ ప్రొడక్షన్స్ సమర్పించు

# జెమిని

శరణ్
ఆర్.పి.పట్నాయక్
వేటూరి

AVM PRODUCTIONS

యం.శరవణన్, యం.బాలసుబ్రహ్మణ్యన్, యం.యస్.గుహన్, బి.గురునాథ్

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.


సురేష్


ఆర్.పి.పట్నాయక్


వేటూరి సుందర్రామ్మూర్తి


కులశేఖర్

## సాంకేతిక నిపుణులు

మాటలు : పోసాని కృష్ణ మురళి
పాటలు : వేటూరి సుందర్రామ్మూర్తి, కులశేఖర్
ఎడిటింగ్ : సురేష్ ఉర్స్
ఫైట్స్ : సూపర్ సుబ్బరాయన్
కళ : తోట తరణి
సినిమాటోగ్రఫీ : ఎ.వెంకటేష్ డి.ఎఫ్.టెక్
నృత్యం : రాజు సుందరం, సుచిత్రా చంద్రబోస్, అశోక్ రాజ్
సౌండ్ ఎఫెక్ట్స్ : రాజు
కో -డైరక్టర్స్ : మణి భారతి, ఈశ్వర్ రెడ్డి, రాజ్ కుమార్, మద్దినేని రమేష్
అసోసియేట్ డైరక్టర్స్ : ఆనంద్, సుమంత్, ఎల్ బాల మురగన్, వెంకట్, బాబి బోస్
ప్రొడక్షన్ మేనేజర్ : ఆర్.టి.రాయుడు
అసోసియేట్ కెమెరామెన్స్ : పద్మేష్, ప్రసాద్
అసిస్టెంట్ కెమెరామెన్ : శ్రీనివాసరావు
స్టిల్ కెమెరామెన్ : విజయ్ కుమార్
కాస్ట్యూమ్ చీఫ్ : జగదీష్
మేకప్ చీఫ్ : రాఘవ
హెయిర్ డ్రెస్సర్ : శివ
గ్రాఫిక్స్ : దక్కన్ డ్రీమ్స్

సంగీతం
ఆర్.పి.పట్నాయక్
నిర్మాతలు
ఎం.శరవణన్, బి. గురునాధ్, ఎం.బాలసుబ్రమణియన్, ఎం.ఎస్.గుహన్
కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం
శరణ్

## తారాగణం

వెంకటేష్ బాబు, నమిత, సుజాత, 'కళాభవన్' మణి, ముంతాజ్, మురళి, బ్రహ్మానందం, సుధాకర్, కోటశ్రీనివాసరావు, వేణుమాధవ్, గుండు హనుమంతరావు, ఆహుతి ప్రసాద్, సూర్య, పోసాని కృష్ణ మురళి, కాదంబరి కిరణ్, లక్ష్మీపతి, వైజాగ్ ప్రసాద్, కృష్ణ మోహన్, ఆశాలతా, సంపత్ రాజు, రమణ, ఇసాక్, బాలాజీ, పాలకొల్లు శ్రీను, మల్లేశ్ యాదవ్, ఈశ్వర్ రెడ్డి, టి.కె.చక్రవర్తి, మను శెట్టి, ప్రీతి, భార్గవ్, దేవీ చరణ్, నాగరాజు, శ్రీకాంత రావు, మురళి, చందు, రమేష్, రాధా కృష్ణ, శ్రావణ్ కుమార్, మధు, అనిల్, పవన్, కొండల రావు, టైసన్, పి.టి.రాజు, వేణు, సారంగపాణి, ధనరాజ్, గంగారామ్ సింగ్, టి.ఆర్.ప్రసాద్, చలపతి, బోరా ప్రసాద్, మొయిన్ ఖాన్, మహావాది రవి, రామతీర్థం, శశాంక్, అశ్విని, హరీష్ గౌడ్, మస్తాన్, కె.వి.మాలిక్, చలం, గణపతి, యు.ప్రసాద్ బాబు, సయ్యద్, శివరామకృష్ణ, చంద్ర మౌళి, పుండరీక్, సుబ్రమణ్యం, సుధాకర్.బి.



శ్రీ స్రవంతి మూవీస్

# నువ్వే.. నువ్వే...

'Just 'U''

'స్రవంతి' రవికిషోర్ త్రివిక్రమ్ కోటి

పాఠక పుస్తక ప్రియులకోసం
సినీ సంగీత విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న
ప్రత్యేక కానుక ఇది.


రవికిషోర్


కోటి


సీతారామశాస్త్రి


త్రివిక్రమ్ శ్రీనివాస్

## సాంకేతిక నిపుణులు

సంగీతం : కోటి
పాటలు : సిరివెన్నెల సీతారామశాస్త్రి
ఫోటోగ్రఫీ : హరి అనుమోలు
ఎడిటింగ్ : శ్రీకర్ ప్రసాద్
ఆర్ట్ : పేకేటి రంగా రామ్మోహన్
కొరియోగ్రఫీ : సుచిత్రాచంద్రబోస్, శంకర్
స్టిల్స్ : మనీషా ప్రసాద్
మేకప్ : నరసింహ్మ
కాస్ట్యూమ్స్ : శివ, ఖాదర్
కాస్ట్యూమ్ డిజైనర్ : ప్రియ
ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్ : ఎస్.రవీందర్‌రెడ్డి, ఎమ్. శ్రీనివాసరావు
అసిస్టెంట్ డైరెక్టర్స్ : మధు
అసోసియేట్ డైరెక్టర్స్ : ఎన్.రవీంద్రబాబు, గోపి, అబ్బూరిరవి
కో-డైరెక్టర్స్ : బి.సుబ్బారావు, జి.సుధాకర్

నిర్మాత : 'స్రవంతి' రవికిషోర్
కథ, మాటలు, స్క్రీన్‌ప్లే - దర్శకత్వం : త్రివిక్రమ్

## తారాగణం

తరుణ్, శ్రీయ
ప్రకాష్‌రాజ్, చంద్రమోహన్, సునీల్, యమ్మెస్‌నారాయణ, ధర్మవరపుసుబ్రహ్మణ్యం, చిట్టిబాబు, సుధ, ప్రగతి, రాజీవ్ కనకాల, అనితాచౌదరి, స్వప్నమాధురి, శిల్పాచక్రవర్తి, సుదర్శన్, నవీన్

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం



| | |
|---|---|
| చిత్రం | : హమ్ దోనోఁ (1961) |
| సంగీతం | : జయ్‌దేవ్ |
| రచన | : సాహిర్ లుధియాన్వి |
| గానం | : లతా మంగేష్కర్, బృందం |
| అభినయం | : నందా, లలితా పవర్, బృందం |



## అల్లా తేరో నామ్

అల్లా తేరో నామ్, ఈశ్వర్ తేరో నామ్
సబ్‌కో సన్మతి దే భగవాన్ ॥అల్లా॥
మాంగోఁ కా సిందూర్ నా ఛూటే (2)
మాఁ బహనోం కీ ఆస్ నా టూటే (2)
దేహ్ బినా, దాతా,
దేహ్ బినా భట్‌కే న ప్రాణ్ ॥సబ్‌కో॥ ॥అల్లా॥
ఓ సారే జగ్ కే రఖ్‌వాలే (2)
నిర్బల్ కో బల్ దేనేవాలే (2)
బల్‌వానోంకో, ఓ, బల్ వానోంకో దేదే జ్ఞాన్ ॥సబ్‌కో॥ ॥అల్లా॥







మహాత్మా గాంధీ అహింసకు ఎంత ప్రాధాన్యత ఇచ్చేవారో భక్తికి, మతసామరస్యానికి కూడా అంతే ప్రాధాన్యత ఇచ్చేవారు. స్వాతంత్రోద్యమ సమయంలో బ్రిటిష్ వారు హిందువులకు, ముస్లిములకు కలహాలు సృష్టిస్తే ఆయన వారిలో సౌభ్రాతృత్వ భావన పునరుద్ధరించటానికి సత్యాగ్రహం కూడా పాటించారు. ఒక హిందూ అతివాది ఉన్మాదానికి బలైనపుడు ఆయన 'హేరామ్' అంటూ తుదిశ్వాస విడిచారని అంటారు. ఇక్కడ 'రామ్' అంటే 'దైవం' అనే అర్థం. ఆయన దైవాన్ని 'రమ్' అని పిలుచుకునే వారే కానీ ఆయన దృష్టిలో రాముడైనా అల్లా అయినా ఒకటే. ఆయనకు అత్యంత ఇష్టమైన భజనలో ఇదే భావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

రఘుపతి రాఘవ రాజారామ్
పతిత పావన సీతారామ్
ఈశ్వర్ అల్లా తేరో నామ్
సబ్‌కో సన్మతి దే భగవాన్

హిందీలో ఈశ్వర్ అంటే 'దైవం' అని అర్థం. మనం తెలుగులో 'ఈశ్వరుడు' అంటే 'శివుడు' అనే అర్థంలో అంటాం. ' ఓ భగవాన్!', 'ఈశ్వర్' అన్నా 'అల్లా' అన్నా నీ పేరే. అందరికీ మంచి బుద్ధిని ప్రసాదించు' అని భావం. ఇదే భావంతో 'హమ్ దోనోఁ' చిత్రంలో సాహిర్







లుధియాన్వి వ్రాసిన భజనను జయ్‌దేవ్ స్వరపరిచారు. ఇది హిందీ సినీ చరిత్రలోని భక్తి గీతాలలో ఆణి ముత్యంగా నిలిచి పోయింది.

జయ్‌దేవ్ తొలుత అలీఅక్బర్ ఖాన్, ఎస్.డి.బర్మన్‌లకు అసిస్టెంట్‌గా పనిచేశారు. 'జోరూ కా భాయి' చిత్రంతో ఆయన పూర్తి స్థాయి సంగీత దర్శకుడిగా మారారు. సంగీతం నాణ్యత విషయంలో ఏ మాత్రం రాజీపడని సంగీతదర్శకుడిగా పేరు సంపాదించారు. ఆధునిక సినీ సంగీతం ప్రభావంలో పడిన ప్రేక్షకులు ఆయన అందించిన ఉత్తమ సంగీతాన్ని ఆస్వాదించలేకపోయారు. ఆయన సంగీతం అందించిన చిత్రాలలో 'హమ్‌దోనోఁ', 'ముఝే జీనేదో', 'రేష్మా ఔర్ షేరా', 'ఆలాప్', 'ఘరోందా', 'గమన్', 'అన్‌కాహీ' ఉన్నాయి. వీటిలో 'హమ్ దోనోఁ' సంగీతం అద్భుతమైన ప్రేక్షకాదరణ పొందగా 'ముఝే జీనే దో' పాటలు హిట్టయ్యాయి. మిగతా చిత్రాలలోని పాటలు వాటి స్థాయికి తగ్గట్టు హిట్ కాలేదు. కానీ ఆయనకు మూడుసార్లు జాతీయ అవార్డు లభించిందంటే ఆయన సంగీతం ఎంత గొప్పదో మనం అర్థం చేసుకోవచ్చు. 'రేష్మా ఔర్ షేరా', 'గమన్', "అన్‌కాహీ' చిత్రాలకు ఆయనకు ఈ అవార్డు దక్కింది. శాస్త్రీయ సంగీతం అభివృద్ధికి కృషి చేసే 'సుర్ సింగార్ సన్సద్' అనే సంస్థకు ఆయన చేయూత నందించారు. ఆ సంస్థ నిర్వహించిన ఒక పోటీలో ఉత్తమ గజల్ గాయకుడిగా అవార్డు అందుకున్న హరిహరన్ ప్రతిభను గుర్తించి 1977లో 'గమన్' చిత్రం ద్వారా నేపథ్యగాయకుడిగా పరిచయం చేశారు. హరిహరన్ ఇప్పుడు హిందీ, తెలుగు, తమిళ భాషలలో ప్రసిద్ధ గాయకుడనే సంగతి తెలిసినదే. జయ్‌దేవ్‌కు నాలుగు సార్లు 'సుర్ సింగార్ సన్సద్' అవార్డులు అభించాయి. మధ్యప్రదేశ్ ప్రభుత్వం ఇచ్చే లతామంగేష్కర్ అవార్డు కూడా లభించింది. ఇంతటి ప్రతిభావంతుడైన సంగీతదర్శకుడికి ప్రజాదరణ లభించకపోవడం దురదృష్టకరం.



'హమ్ దోనోఁ' భారత సైన్యంలోని ఇద్దరు సైనికుల కథ. వారి పేర్లు కెప్టెన్ ఆనంద్, మేజర్ వర్మ. ఇద్దరికీ ముఖకవళికల్లో పోలికలు ఉంటాయి. ఆనంద్‌కి మీతా అనే ప్రేయసి ఉంటుంది. వర్మ భార్య రూమా. యుద్ధంలో మేజర్ వర్మ జాడ తెలియకపోవటంతో అతను మరణించాడని భావిస్తారు. ఆనంద్ మేజర్ వర్మ ఇంటికి వెళ్తే అతని తల్లి ఆనంద్‌ని తన బిడ్డగా భావిస్తుంది. రూమా ఆరోగ్యం బావుండకపోవడంతో ఆనంద్ నిజం దాచి ఆమెను దగ్గరుండి చూసుకుంటాడు. యుద్ధంలో వికలాంగుడైన మేజర్ వర్మ తిరిగి వచ్చి జరుగుతున్నది చూసి ఆనంద్ తన స్థానాన్ని ఆక్రమించాడని భావించి అపార్థం చేసుకుంటాడు. మీతా కూడా ఆనంద్‌ని అపార్థం చేసుకుంటుంది. చివరికి ఒక గుడిలో నలుగురూ కలవటంతో అపార్థాలు తొలగిపోయి కథ సుఖాంతమవుతుంది.

నవ్‌కేతన్ సంస్థలో పబ్లిసిస్ట్‌గా పని చేసిన అమర్‌జీత్ 'హమ్ దోనోఁ' చిత్రానికి దర్శకత్వం వహించారు. ఈ చిత్రంలో రూమా పాత్రలో నందా నటించింది. అప్పటి వరకు చెల్లెలి పాత్రలలో నటించిన నందాకు ఈ చిత్రంలో ప్రముఖ పాత్ర లభించింది. ఇక కెప్టెన్ ఆనంద్, మేజర్ వర్మ పాత్రలలో దేవానంద్ అసమానమైన నటనను ప్రదర్శించి ఈ చిత్రం సూపర్‌హిట్ కావటంలో ముఖ్యపాత్ర వహించాడు. మీతాగా సాధన నటించింది.

జయ్‌దేవ్‌కు సంగీత దర్శకత్వ బాధ్యతలను అప్పగిస్తూ నిర్మాతలు ఈ చిత్రంలో లతా చేత తప్పక పాడించాలని కోరారట. వారి పట్టుదల పుణ్యమా అని 'అల్లా తేరో నామ్' వంటి అద్భుత గీతం రూపొందింది. ఈ చిత్రంలో ఇంకా 'అభీ న జావో ఛోడ్‌కర్', 'మైఁ జిందగీ కా సాథ్ నిభాతా చలా గయా', 'కభీ ఖుద్ పే ' వంటి హిట్ పాటలున్నా ఈ పాటకు మాత్రం అమరమైన కీర్తి లభించిందని చెప్పాలి. శాస్త్రీయ గాయకుడు పండిట్ జస్‌రాజ్‌కు ఈ పాట విన్నప్పుడు అప్రయత్నంగా కన్నీళ్ళు వచ్చాయట. లతా చెల్లెలు ఆశాభోంస్లే తన సోదరి పాడిన పాటలలో ఈ పాట చాలా ఇష్టమని చెప్తూ ఉంటారు.

తన భర్త యుద్ధభూమిలో పోరాడుతున్నాడని తెలిసి రూమా అతని క్షేమంకోసం భగవంతుడ్ని ప్రార్థించేటపుడు వచ్చే బృందగీతం ఇది. ఈ పాటకు మూలమైన భజనలో ఉన్న భావాలతో పాటు సైనికులందరూ క్షేమంగా ఉండాలనే కోరిక కూడా ఉంది ఈ పాటలో.

'తేరోనామ్' అంటే 'నీ పేరు' అని అర్థం. 'సన్మతి' అంటే 'మంచిబుద్ధి'

**'నీ పేరే అల్లా, నీ పేరే ఈశ్వరుడు**
**అందరికీ మంచి బుద్ధి ప్రసాదించు**
**భగవాన్'**

'అల్లా అన్నా ఈశ్వరుడన్నా ఒకరే అనే సుహృద్భావాన్ని అందరిలో కలిగించు భగవాన్!' అని భావం.

'మాంగ్' అంటే పాపిడి. 'సిందూర్' అంటే సిందూరం, బొట్టు. 'నాఛూటే' అంటే 'దూరమవకూడదు' అని. 'మాఁ' అంటే తల్లి. 'బహన్' అంటే చెల్లి లేదా అక్క. 'ఆస్' అంటే ఆశ. 'దేహ్ బినా భట్‌కే న ప్రాణ్' అంటే దేహం లేకుండా ఆత్మ సంచరించకూడదు అని.

**'పాపిట బొట్టు దూరమవకూడదు**
**తల్లీ తోబుట్టువుల ఆశ వమ్మవకూడదు**
**ఆత్మకు దేహం దూరమవకూడదు'.**

సైనికుల భార్యల సౌభాగ్యం దూరమవకూడదు. వారి తల్లీ తోబుట్టువులు పెట్టుకున్న ఆశలు వమ్ము కాకూడదు. సైనికులు ప్రాణాలతో తిరిగి రావాలి. వారి జీవితాలు అర్థంతరంగా ముగిసిపోకూడదని వారి ప్రార్థన.

'సారాజగ్' అంటే యావత్ ప్రపంచం. 'రఖ్‌వాలా' అంటే రక్షకుడు. 'దేనేవాలా' అంటే ఇచ్చేవాడు. 'బల్‌వాన్' అంటే బలవంతులు. 'దేదే' అంటే ఇవ్వు అని.

**'ఓ జగద్రక్షకా!**
**నిర్బలులకు బలమిస్తావు**
**బలవంతులకు జ్ఞానమివ్వు'**

భగవంతుడు నిర్బలులకు కూడా సమయం వచ్చినపుడు శక్తినిస్తాడు. అదే విధంగా బలం ప్రదర్శించేవారికి విచక్షణని, జ్ఞానాన్ని ఇచ్చి బలప్రయోగం కన్నా ప్రేమ గొప్పదని తెలియజేయమని వారి కోరిక. అటువంటి జ్ఞానం అందరికీ ఉంటే యుద్ధాలే ఉండవు కదా!

**-పి. వి. సత్యనారాయణ రాజు**

సీరియల్ ప్రారంభం



# హాస్యవల్లరి సంగీతలహరి

# కిశోర్ జీవనఝరి

-ఎమ్మెస్ స్వాతి

**కిశోర్‌కుమార్ ఒక లెజెండ్. అతని కెరియర్‌లోనే కాదు నిజ జీవితంలోనూ ఎన్నో మలుపులు. ఎన్నో మజిలీలు; ఎన్నో ఉత్థానపతనాలు. వ్యక్తిగా, కళాకారుడిగా కిశోర్ ప్రతిభను, జీవనాన్ని అక్షరబద్ధం చేస్తున్న ఈ సీరియల్ కిశోర్ వర్ధంతి (అక్టోబరు 13) సందర్భంగా ప్రారంభిస్తున్నాం**

**కిశోర్‌కుమార్ కుర్చీలో కూచుని**
**చదువుకుంటున్నాడు.**
**అదే గదిలో అతని భార్య లీనా కూడా ఉంది.**
**వేరే ఏదో పని చూసుకుంటూ.**
**ఆ పని చేసుకుంటూనే ఎందుకో అనుమానం వచ్చి**
**భర్త కేసి చూసింది.**
**అప్పటికే కిశోర్ తల వెనక్కి వాలి వుంది.**
**నోరు తెరుచుకుపోయింది.**
**గడ్డం సాగిపోయింది.**
**కళ్లు మూతలు పడుతున్నాయి.**
**ఏం చేయాలో తోచక**
**లీనా ఖంగారుపడుతూండగానే**
**కిశోర్ కళ్లు మూసుకుపోయాయి.**
**అతని తల ఒక పక్కకు పూర్తిగా వాలిపోయింది.**

లీనాకు ఏం చేయాలో తోచలేదు. గబగబా కిశోర్ వద్దకు వచ్చి ముక్కు దగ్గర వేలు పెట్టి చూసింది. శ్వాస ఆడటం లేదు. ఆమెకు భయంతో ముచ్చెమటలు పట్టాయి. భయం కంటె ఎక్కువగా బాధ వేసింది. దురదృష్టం తనను వెతికి వెంటాడుతోందనిపించింది. ఆమె తొలి వివాహం అతి విషాదంగా ముగిసింది. ఏడేళ్ళ క్రితమే ఈ వివాహం చేసుకుంది. ఇదీ అంతేనా అని అనిపించింది.

లీనా చందావర్కార్‌గా తెరపై హొయలు కురిపించి యువక హృదయాలను వెర్రెత్తించిన ఆమెను సిద్ధార్థ్ బండోద్కర్ అనే అతను ప్రేమించి పెళ్లి చేసుకున్నాడు. సినీ జీవితానికి స్వస్తి చెప్పి, అతనితో పెళ్లికి సిద్ధపడింది లీనా. సిద్ధార్థ మామూలు మనిషయితే ఇబ్బంది లేకపోవును. అతను ఓ మాజీ ముఖ్యమంత్రి (దయానంద్ బండోద్కర్) కొడుకు. అప్పటి ముఖ్యమంత్రి (శశికళ కాకోడ్‌కర్) సోదరుడు. తండ్రి వారసత్వంగా గోవాలో రాజ్యాధికారం అతనికే దక్కుతుందనుకున్నారు. కానీ ఆ అధికారం సోదరి శశికళను వరించింది. సోదరి, సోదరుడు మధ్య ఎప్పటికైనా రాజకీయవైరం తప్పదని అందరూ అనుకుంటూండగానే ఆ ఘోరం జరిగింది. అతి మిస్టీరియస్‌గా సిద్ధార్థ ఒక గన్ యాక్సిడెంట్‌లో చచ్చిపోయాడు.

మనిషన్నాక చావు సహజమే కానీ అంత చిన్నవయస్సులో అసహజం. అందునా పెళ్లయిన తొలినాడే భర్త మరణించటం ఆ వితంతువుకి మరింత దుఃఖదాయకం. తన బేబీ ఫేస్‌తో అందరినీ ఆకట్టుకున్న లీనా చందావర్కార్ శోకమూర్తిగా మారిపోయింది. సినిమారంగం నుండి బయటకు వచ్చేసింది. మనసు ఊరడిల్లడానికి కిశోర్‌కుమార్ లైవ్ మ్యూజికల్ షోన్‌కు హాజరవుతూండేది. అతన్ని ఆరాధించసాగింది. క్రమంగా ఒక స్నేహితురాలిగా చేరువైంది.

అప్పటికే కిశోర్‌కుమార్ వైవాహిక జీవితంలో చాలా దెబ్బతిని



**దురదృష్టం వెంటాడిన బేబి ఫేస్‌డ్ బ్యూటీ** 'మన్ కా మీత్' (1968) సినిమాతో సునీల్‌దత్ ద్వారా తెరకు పరిచయం కాబడ్డ లీనా చందావర్కార్ అనే ఈ కొంకణి అమ్మాయి కిశోర్ నాలుగో భార్య. 1969 నుండి పదేళ్ళపాటు సాగిన తెరజీవితంలో "హమ్ జోలీ", "మెహబూబ్ కీ మెహందీ", "మన్‌చలీ", "అన్‌హోనీ", "కైద్", "ప్రీతమ్" వంటి హిట్స్ ఉన్నాయి.



**తండ్రి గళం వారసత్వంగా వచ్చిన తనయుడు** - ఆగస్టు నెల చివర్లో హైద్రాబాద్ వాసులను తన పాటలతో ఉర్రూతలూగించిన అమిత్‌కుమార్... కిశోర్‌కుమార్ కుమారుడే! కిశోర్‌కు, అతని మొదటి భార్య రూమాకు పుట్టిన అమిత్ కిశోర్ వద్దనే పెరిగాడు. హిందీచిత్రసీమలో చక్కటి గాయకుడిగా పేరు తెచ్చుకున్నాడు.

వున్నాడు. మూడుసార్లు పెళ్ళి చేసుకున్నా ఏదీ సవ్యంగా సాగలేదు. పెద్దభార్య ద్వారా కలిగిన కొడుకు అమిత్‌కుమార్ ఒక్కడే అతనికి తోడుగా ఇంట్లో ఉంటాడు. ఇక మళ్లీ పెళ్లి చేసుకోవడం అంటే భయం పట్టుకుంది. లీనా కర్ణాటకకు చెందిన కొంకణి అమ్మాయి. తను మధ్యప్రదేశ్‌కు చెందిన బెంగాలీ. తామిద్దరి మధ్య వయస్సులో తేడా చాలా ఎక్కువగా ఉంది. కొడుకు అమిత్ కన్నా లీనా మూడు సంవత్సరాలు మాత్రమే పెద్దది!

కానీ లీనా ఆత్మీయత, సౌజన్యం కిశోర్‌ను ఆకట్టుకున్నాయి. పెళ్లి చేసుకోవాలనే అనుకున్నాడు. ఆ అనుకోవడం 1978లో జరిగినా... వివాహం చేసుకున్నది మాత్రం 1980లో. అదీ ఎవరికీ చెప్పకుండా రిజిస్ట్రార్ ఆఫీసులో. ముందు కొంతకాలం వైవాహిక జీవితం సరిగ్గా నడిస్తే అప్పుడు పబ్లిగ్గా అందరికీ చెప్పవచ్చులే అనుకున్నాడు కిశోర్. వివాహం తనకు అచ్చిరాలేదన్న భయం అతన్ని అంతగా పీడించినా పెళ్లయ్యాక ఆ భయాలన్నీ తొలగిపోయాయి. లీనా సవతికొడుకును ఆదరించింది. కిశోర్‌ను సంతోషపెట్టింది. వాళ్ళిద్దరికీ 1982 లో సుమిత్ అనే కొడుకు పుట్టాడు. 53వ యేట తన మరో కొడుకు పుట్టడంతో కిశోర్ ఆనందానికి పట్టపగ్గాలు లేవు. మరి అటువంటి సుఖమయ జీవితంలో ఈ అపశ్రుతి ఏమిటి? ఇలా కిశోర్ ఉన్నట్టుండి తలవాల్చేయడమేమిటి?

లీనా తన ఆలోచనల్లో తాను ఉండగానే కిశోర్ శరీరం కుర్చీలోంచి నేలమీదకు జారిపోయింది. నేలమీద అస్తవ్యస్తంగా పడిపోయివున్న భర్త శవం చూడగానే లీనాకు ఒక్కసారి ఏడుపు ముంచుకువచ్చింది. అంతలోనే ఆశ! అతనింకా మరణించలేదేమో, కేవలం హార్ట్ ఎటాకేమో! అంతకుముందు 1982లో ఒకసారి గుండెపోటు రావడం, అప్పటినుండీ కిశోర్ ఆరోగ్యం విషయంలో చాలా జాగ్రత్తగా ఉండడం అందరికీ తెలుసు. ఆ విషయం గుర్తుకురానందుకు తనను తాను నిందించుకుంటూ లీనా కిశోర్ ముక్కు దగ్గర వేలు పెట్టి చూసింది. శ్వాస ఆడటం లేదు. ఛాతీ కేసి చూసింది. కదలటం లేదు.

లీనా దశాబ్దానికి పైగా సినిమాలలో నటించిన అనుభవజ్ఞురాలు. అనేక చావుసీన్లలో నటించింది. చచ్చిపోయినట్టు ప్రేక్షకులను భ్రమింపజేయడానికి యాక్టర్లు ఊపిరి బిగపట్టి నిశ్చలంగా పడుక్కుని ఉన్నా యాక్టర్ల శరీరంలో కదలికలు ఎలా వుంటాయో బాగా తెలుసు. కిశోర్‌దేహంలో అటువంటి లక్షణాలు ఏమీ కనబడకపోవడంతో ఆమెకు కంగారు ఎక్కువయింది. కీడు శంకిస్తూనే నాడి చూడబోయింది. నాడి అందలేదు. నిజంగా అందలేదా? లేక తనకు చూడడం రాలేదా? ఇది తేల్చవలసినది తను కాదు. డాక్టర్లు మాత్రమే చెప్పాలి.

మనసు చిక్కబట్టుకుంటూ లేచి ఫోన్ వద్దకు వెళ్ళింది. డాక్టర్‌కు ఫోన్ చేసింది. డాక్టరు లైనులోకి వచ్చాక తను చూసినది చెప్పింది. వెంటనే రమ్మనమని కోరింది. "నిజంగానే అంటావా?" అని అడిగాడు డాక్టర్. ఆమెకి కోపం వచ్చింది. "పరాచికాలు ఆడే సమయమా ఇది డాక్టర్" అని అడిగింది కోపాన్ని అణచుకుంటూ.

డాక్టర్ నీళ్లు నమిలాడు. "అది కాదమ్మా? కిశోర్ సంగతి నీకు తెలియనిదేముంది? ఎప్పుడూ ఏదో ఒకటి అల్లరి! ఎన్ని ప్రాక్టికల్ జోక్స్ వేస్తాడో అతనికే తెలియదు. ఎప్పటికప్పుడు కొత్త కొత్త ఐడియాలు వేస్తూ ఉంటాడు. ఇది కూడా అలాంటిదేమోనని నా అనుమానం. ఇక్కడ పేషంట్లు నాకోసం వెయిట్ చేస్తున్నారు. నీ కంగారు చూసి హడావుడిగా నేను అక్కడికి పరిగెట్టుకుని రావడం, తీరా చేసి అతను లేచి కూచుని "హ హ" అని నవ్వడం - ఇదంతా ఎందుకని, ముందుగానే అడుగుతున్నాను. అతనికి నిజంగానే సీరియస్‌గా ఉందా?"

లీనా కోపం కట్టలు తెంచుకుంది. "డాక్టర్, కిశోర్ ప్రాక్టికల్ జోక్స్ వేస్తాడన్న సంగతి అందరికీ తెలుసు. కానీ నేను ఒక సినిమా యాక్ట్రెస్‌నన్న విషయం మీరు మర్చిపోతున్నారు. చావు నటించడానికి, నిజం చావుకి నాకు తేడా తెలియదా? ఒక మనిషి



## కొంటె చేష్టల కిశోర్

'మిస్సమ్మ" సినిమాను మీనాకుమారి హీరోయిన్‌గా ఎ.వి.యమ్. వారు హిందీలో "మిస్‌మేరీ"(1957)గా తీశారు. రామారావు, నాగేశ్వరరావు పాత్రలను జెమినీగణేశ్, కిశోర్‌కుమార్‌లు వేశారు. షూటింగ్ మద్రాసులో. బొంబాయి నుండి కిశోర్‌ను రప్పించారు. ఓ షెడ్యూల్‌లో రెండురోజుల పాటు కిశోర్‌ను మేకప్ వేసి కూచోబెట్టి... షాట్ తీయడానికి పిలవలేదట. దాంతో కిశోర్ మండిపడ్డాడు. డైరెక్టరు ఎల్వీప్రసాద్ తో గొడవపడ్డాడు. డైరెక్టరు "నిన్ను ఎప్పుడు ఎలా ఉపయోగించుకోవాలో నాకు తెలుసు. షెడ్యూల్‌కు డబ్బు ఇచ్చిన తర్వాత మా ఆధీనంలో ఉండడమే మీ పని." అని అనడంతో కిశోర్‌కు కోపం వచ్చేసింది. "నా చేత సినిమాలో ఎలా పనిచేయించుకుంటారో చూస్తాను." అని వెళ్ళి గుండు కొట్టించుకుని వచ్చేశాడు. జుట్టు లేదు కాబట్టి తనని యాక్ట్ చేయమనరని, డైరెక్టరును భలేగా ఏడిపించానని కిశోర్ అనుకున్నాడు. కానీ ఎల్వీప్రసాద్ సంగతి తెలియదు పాపం. కిశోర్ నెత్తిమీద హేట్ పెట్టి పని పూర్తి చేసి, ఇప్పుడు బొంబాయి వెళ్ళు అన్నారు!

బోడిగుండు వేసుకుని బొంబాయి చేరిన కిశోర్‌కి ఇంకో ఉపద్రవం వచ్చిపడింది. అప్పుడు హృషీకేశ్ ముఖర్జీ తీస్తున్న "ముసాఫిర్" సినిమాలో నటిస్తున్నాడు కిశోర్. ఒక్కరోజు షూటింగు మిగిలివుంది. షూటింగు రోజున కిశోర్ గైర్‌హాజరు కావడంతో హృషీకేశ్ కంగారుపడ్డాడు. చూసి, చూసి ఇంటికి ఫోన్ చేస్తే కిశోర్ భార్య "ఇంటికొచ్చి చూడండి, ఏం జరిగిందో" అంది. పాపం జ్వరమేమో అనుకుంటూ ఇంటికి వచ్చాడు హృషీకేశ్. "రావద్దు, రావద్దు" అని కిశోర్ అరుస్తున్నా లోపలికి వచ్చి చూస్తే బోడిగుండుతో కిశోర్! బొంబాయి పరిశ్రమలో సాధారణంగా విగ్గులు ఉపయోగించరు. కానీ కిశోర్ జుట్టు మొలిచేదాకా షూటింగు కాన్సిల్ చేయడం ఎలా? అందువల్ల తప్పనిసరి పరిస్థితుల్లో కిశోర్‌కు విగ్గు పెట్టి షూటింగ్ పూర్తి చేసేశారు.



'మిస్ మేరీ' గా మీనాకుమారి. ఈ చిత్రంలో మీనాకుమారికి జోడీగా జెమినీగణేషన్, కిశోర్‌కుమార్ కి జంటగా జమున నటించారు. మీనాకుమారి, కిశోర్‌కుమార్ నాయికా నాయకులుగా నటించిన చిత్రాలు - 'రుక్సానా' (1956), 'నయా అందాజ్' (1956), 'షరారత్' (1959).

ఎంతసేపు ఊపిరి బిగబట్టి వుంచగలడో నాకు అనుభవపూర్వకంగా తెలుసు. ఆ టైము కూడా దాటిపోయింది కాబట్టే కంగారు. ఇప్పటికే అంతా అయిపోయిందని అనిపిస్తోంది. ఏ మాత్రం ప్రాణం మిగిలి వున్నా మీ డిస్కషన్ల వల్ల అది కూడా..." ఇక ఆపై మాట్లాడలేక లీనా గొంతు గద్గదమయిపోయింది.

"నరే, నరే... డోంట్ వర్రీ, ఇదిగో ఇప్పుడే బయలుదేరుతున్నానమ్మా... హేవ్ కరేజ్. నేను వచ్చేలోపున ఫస్ట్ ఎయిడ్‌గా..." అంటూ డాక్టర్ చెప్పబోతూండగా "ఆగండాగండి. రాసుకుంటాను." అంటూ పెన్ను గురించి వెతకబోయింది లీనా. అంతలోనే ఎవరో ఆమెకు పెన్ను, కాగితాల ప్యాడ్ అందించారు.

"థాంక్స్" అంటూ అవి అందించిన వారి కేసి చూసిన లీనా తెల్లబోయింది. కాస్సేపటి క్రితం శవంగా మారిన ది గ్రేట్ యాక్టర్ కిశోర్‌కుమారే తన సపర్యల కోసం కలం, కాగితం స్వయంగా అందిస్తున్నాడు...!

మతిపోయిన లీనా "సారీ డాక్టర్, మరేమో... శవం లేచి... ఛ, ఛ... కిశోర్ ఉత్తినే..." అంటూ సర్దుకుని "డాక్టర్, ఫస్ట్ ఎయిడ్ చేయడం కంటే ఫస్టు చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయి. అవి పూర్తయిన తర్వాత ఫోన్ చేస్తాను." అంటూ ఫోన్ పెట్టేసి ఓ మూల పెట్టివున్న వాకింగ్ స్టిక్ తీసుకుని కిశోర్ వెంటపడింది.

## కొంటె చేష్టల కిశోర్



కిశోర్ ఇంట్లో డైనింగ్ ఏరియాకు వెళ్లాలంటే పాలరాతి మెట్లు ఎక్కి పైకి వెళ్ళాలి. లాండింగ్ దగ్గర పెద్ద తలుపు వుండేది. తమాషా ఏమిటంటే అది మొత్తం గాజు తలుపు. అవతలివైపు కనబడుతూండడం వల్ల అది తలుపు అని ఎవరూ అనుకోరు. కొత్తగా వచ్చిన అతిథులు దాంట్లోంచి వెళ్లిపోదామని ప్రయత్నించి మొహం బద్దలుకొట్టుకుంటూరు. అది చూసి కిశోర్ పడిపడి నవ్వేవాడు. అతనికి అదో ఆట. ఇంట్లో ఏళ్ల తరబడివున్నా లీనా కూడా అనేకసార్లు పొరబడి తలుపుకు కొట్టుకుని తల బొప్పి కట్టించుకుంది. "ఈ అద్దం తీయించేయండి బాబూ" అని బతిమాలినా కిశోర్ ఒప్పుకోలేదు. చివరికి అతని మరణానంతరం లీనా ఆ గాజు తలుపు తీయించేసింది.

ఇదీ కిశోర్ స్టైయిల్! అతను తరచుగా చేసే ప్రాక్టికల్ జోక్స్‌లో చచ్చిపోయినట్టు నటించడం ఒకటి! బాగా సాధనచేసి చాలా సేపు ఊపిరిబిగబట్టడంలో నేర్పు సంపాదించాడు. మహా డ్రమెటిక్‌గా ఎంతబాగా 'చచ్చిపోయే వాడం'టే దగ్గరున్నవాళ్ళు హడిలి చచ్చేవాళ్లు! ఆ తరువాత తాము ఎలా ఫూల్ అయ్యామో తెలుసుకుని పడిపడి నవ్వేవారు.

కానీ అక్టోబరు 13, 1987న అలా జరగలేదు!

.....(ఇంకావుంది)

## కిశోర్ గానావళి

కె.ఎస్.ఫిల్మ్స్ పేర కిశోర్ నిర్మించిన 'చల్తీకా నామ్ గాడీ'(1958) సూపర్ హిట్ కామెడీ ప్లస్ మ్యూజికల్.
దరిమిలా అతని భార్య అయిన మధుబాల ఆ సినిమాలో హీరోయిన్.
ఇందులో 'ఇక్ లడ్‌కీ భీగీ భాగీసీ' పాట చాలా పాపులర్.
కారు రిపేర్‌చేసే టూల్స్‌తో ఈ పాటలో మంచి మ్యూజికల్ సౌండ్స్ పుట్టించారు సంగీతదర్శకుడు ఎస్.డి. బర్మన్.
ముజ్రూ సుల్తాన్‌పురి రాసిన ఈ పాటలోని 'మిలే ఇక్ అజ్‌నబీసే...' అనే లైన్ ని ఇటీవల విడుదలయిన 'జెమిని'- 'తెలుగు', 'తమిళ' సినిమాలో కూడా ఉపయోగించారంటే ఇప్పటికీ ఈ పాట ఎవర్‌గ్రీన్ అనేగా అర్థం!




ఇక్ లడ్‌కీ భీగీ భాగీసీ, సోతీ రాతోంకో జాగీసీ
మిలీ ఇక్ అజ్‌నబీసే, కోయి ఆగే న పీఛే
తుమ్‌హీ కహో కోయీ బాత్‌హై? ॥ఇక్ లడ్‌కీ॥
దిల్‌హే దిల్‌మేఁ జలీ జాతీహై
బిగ్‌డీ బిగ్‌డీ చలీ ఆతీహై
ఝుంఝులాతీ హుయీ, బల్ ఖాతీ హుయీ
సావన్‌కీ సూనీ రాత్ మేఁ ॥మిలీ॥ ॥ఇక్ లడ్‌కీ॥
డగ్‌మగ్ డగ్‌మగ్ లహకీ లహకీ
భూలీ భటకీ, బహకీ బహకీ
మచ్‌లీ మచ్‌లీ, ఘర్‌సే నిక్‌లీ
పగ్‌లీ సీ కాలీ రాత్ మేఁ ॥మిలీ॥ ॥ఇక్ లడ్‌కీ॥
తన్ భీగాహై సర్ గీలాహై
ఉస్‌కా కోయీ పేచ్ భీ ఢీలాహై
తన్‌తీ ఝుక్‌తీ, చల్‌తీ రుక్‌తీ
నిక్‌లీ అంధేరీ రాత్‌మేఁ ॥మిలీ॥ ॥ఇక్ లడ్‌కీ॥



# నవ్వింత ఇంటింటి కథ

సీరియల్

17

-మల్లాది వెంకట కృష్ణమూర్తి



## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ. అనన్య ఆ బామ్మకు మనవరాలు. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్ అన్నయ్య వెంకటరత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. లింగమయ్య అనే వ్యక్తి ఎప్పుడు ఇంటికి వచ్చినా బామ్మ అనారోగ్యం నటిస్తూ ఉంటుంది. అనన్యకు గతం చెప్పడం ప్రారంభిస్తుంది బామ్మ. భర్తపోయి, కొడుకు దూరమయి, ఇల్లు ఒక్కటే మిగిలిన తనకు గ్రామం అనే అతని ఆఫర్ నచ్చుతుంది. ఆ ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంత కాలం ప్రతీనెలా గ్రామం డబ్బు ఇవ్వాలి. బామ్మ పోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. ఒప్పందం జరిగాక అనూహ్యంగా బామ్మ ఆరోగ్యం మెరుగు పడుతుంది. గ్రామం, తర్వాత అతని వారసులూ ప్రతినెలా డబ్బు ఇస్తూ బామ్మ చావుకోసం ఎదురుచూస్తుంటారు. అనన్య తండ్రి గురించి చెబుతోంది బామ్మ-

"మీ నాన్న ఈత కొట్టడానికి వెళ్ళి టేంక్‌బండ్‌లో మునిగి చచ్చిపోయాడు".

"మా నాన్నకి ఈత బాగా రాదా?" అడిగింది అనన్య.

"ఎందుకురాదు? పోస్టుద్వారా నేర్చుకున్నాడు. డిప్లొమా సర్టిఫికెట్ కూడా వచ్చింది"

"ఈత మొత్తం పోస్ట్ ద్వారానే నేర్చుకుని, టేంక్‌బండ్ లోకి దిగాడా?" విస్మయంగా అడిగింది అనన్య.

"అవును. మీ నాన్నకి తన తాతయ్య పోలికలు వచ్చాయి. గుర్తుందిగా మిస్టర్ వెంగళ్రావే మీ నాన్న తాతయ్య".

"ఓ! మా నాన్న కూడా వెర్రిబాగుల వాడని విన్నాకాని, మరీ పోస్టల్ ట్యూషన్ ద్వారా స్విమ్మింగ్ నేర్చుకునేటంతని తెలీదు. మరి మా అమ్మ?"

"నీ రెండో ఏట సహజంగానే మరణించింది, ... ఏ డాక్టర్ సహాయం లేకుండా".

కొద్దిసేపు మౌనంగా ఉండి పోయింది అనన్య. బామ్మ చెప్పిందంతా డైజస్ట్ చేసుకున్నాక అడిగింది.

"అంటే, ఇప్పుడు ఈ ఇంటికి హక్కుదార్లు గ్రామం గారి మనవలన్న మాట".

"అవును".

"వాళ్ళకి ఈ అగ్రిమెంట్ విషయం తెలుసన్న మాట".

"తెలుసున్న మాటేమిటే పిచ్చిపిల్లా. నా విల్లు, సేల్ అగ్రిమెంట్ దస్తావేజులు రెండు ఒరిజినల్స్ వాళ్ళ దగ్గరే వున్నాయి. చచ్చిన వాళ్ల డెత్ సర్టిఫికెట్స్‌తో సహా".

"అంటే, నీ తదనంతరం నేను ఈ ఇల్లు ఖాళీ చేయాలన్నమాటేగా?" దుఃఖంగా అడిగింది అనన్య.

"నా తదనంతరం మాట కదా. అప్పటిదాకా మనల్ని ఈ ఇంట్లోంచి ఎవరూ బయటకి పంపలేరు".

బామ్మకి తన ఆయుష్షు మీద గల గట్టి నమ్మకానికి అనన్యకి ఎంతో ముచ్చటేసింది.

"ఇంతకీ ఆ వారసులు ఎవరు బామ్మా?" అడిగింది అనన్య.

ఆ ప్రశ్నకి బామ్మ సమాధానం చెప్పేలోగా డోర్‌బెల్ మోగింది.

దాని వెనకే 'బామ్మగారూ బాగున్నారా' అన్న పిలుపు వినిపించింది. అది లింగమయ్య కంఠంగా గుర్తించారిద్దరూ.



**పోస్టల్ ట్యూషన్ ద్వారా ఈత నేర్చుకుని, టేంక్‌బండ్‌లో ఈత కొట్టబోయి మునిగి చచ్చిన వ్యక్తి ఉదంతం మీకు తెలుసా? ఈ సరదా సీరియల్‌లో ఆ వింత వ్యక్తిని గురించి చదివి నవ్వుకోండి.**

"నా కర్థమైంది. ఆయనే కదా? ఆయన గ్రామం ఆఖరి కొడుకు కదూ?" అడిగింది.

"కాదు. ఆఖరి కొడుకు కొడుకు. గ్రామం కొడుకులిద్దరూ ఎన్నడో పోయారు. ఆఖరి కొడుకు కొడుకులు ముగ్గురే మిగిలి వున్నారిప్పుడు. వాళ్ళూ టపా కట్టేస్తే అప్పుడు ఈ ఇల్లు మనం అమ్ముకోవచ్చు" ఉత్సాహంగా చెప్పింది బామ్మ.

"ఎంత ఆశావాదివి బామ్మా నీవు?"

"బామ్మగారూ బావున్నారా? అంటూనే ఎందుకితను రంగ ప్రవేశం చేస్తుంటాడో, నువ్వు ఒంట్లో బాలేనట్లు ఎందుకు ఏక్ట్ చేస్తావో ఇప్పుడు నాకర్థమైంది బామ్మ" చెప్పింది అనన్య.

"నాకు అల్సర్ అని డాక్టర్ చెప్పాడని నటిద్దాం" అంటూ జుట్టు రేపుకో బోతున్న బామ్మ చెయ్యి పట్టుకుని ఆపి చెప్పింది అనన్య.

"ఆయుష్షు ఇచ్చేది వీళ్ళు కాదు కదా. దేవుడు. ఎందుకలా వాళ్ళని నమ్మించడం? ఇక మీదట ఈ నాటకాలు వద్దు బామ్మా" చెప్పింది అనన్య. మళ్ళీ డోర్ బెల్ మోగి అదే డైలాగ్ వినబడింది.

"తొందరపడుతున్నట్లున్నాడు. పోయి పిలుచుకురా" చెప్పింది బామ్మ. అనన్య వెళ్ళి తలుపు తీసి లింగమయ్యని వెంట బెట్టుకుని వస్తూ చెప్పింది అతనితో.

"మీరు వచ్చినపుడల్లా మా బామ్మకి ఏదో ఓ అనారోగ్యం వుంటుండేది కదా లింగమయ్య గారూ. దాంతో నేను నిన్న మా బామ్మని అపోలో హాస్పటల్‌కి తీసుకెళ్ళి కంప్లీట్ హెల్త్ చెకప్ చేయించాను. నిజం చెప్తే మీరు నమ్మలేరు"

"నమ్ముతాను. ఏ ఏ పార్టులు దెబ్బ తిన్నాయి?" ఆసక్తిగా అడిగాడు లింగమయ్య.

"అన్ని పార్టులూ దెబ్బతిన్నాయి. అయినా ఈవిడ ఎలా బ్రతుకుతున్నారో ఆ డాక్టర్లకి అర్థమై చావలేదు' అనే సమాధానం వస్తుందనుకొన్న లింగమయ్యకి, అనన్య ఇచ్చిన సమాధానం దాదాపు మూర్ఛపోయేలా చేసింది.

"ఒక్క పార్టూ దెబ్బతినలేదు. మా బామ్మకి ఇంకో ఇరవై ఏళ్ళదాకా ఏం ఢోకా లేదు అని చెప్పారు డాక్టర్లు".

కాసేపు గుడ్లప్పగించి చూస్తుండి పోయాడు లింగమయ్య.

"అలా చెప్పారా? గుండెకేదో అయిందిగా?" అడిగాడు అంతలోనే తేరుకుని.

"గుండెకేం? అది బండరాయిలా వుంది".

"రెండు కిడ్నీల్లో ఒకటి...?"

"రెండు కిడ్నీలు సిడ్ని నగరంలా అందంగా ఆరోగ్యంగా ఉన్నాయి"



"లివర్?"

"లివర్‌లో చాలా పవర్ వుంది"

"లంగ్?"

"కింగ్‌లా వుంది. ఇంకా బ్లడ్ ఫ్లడ్‌లా చక్కగా ప్రవహిస్తోంది. బోన్సన్నీ యమఫైన్‌గా వున్నాయి. ఏ పార్టు కాపార్టు పరీక్షించారు. అన్నీ చక్కగా వున్నాయని తేలింది. ఇక మీదట ఆవిడ వాడే మందులన్నీ బందు చేయమన్నారు".

"ఇన్నాళ్ళు మరి నేనొచ్చినప్పుడల్లా ఏదో ఓ జబ్బుతో ఇబ్బంది పడుతూండే వారుగా?"

"కంప్యూటర్‌తో చెకప్ చేసారీ సారి. నో హ్యూమన్ ఎర్రర్. పూర్వం మనుషులు చేసేవాళ్ళు కాబట్టి కొద్దిగా నిర్లక్ష్యం వున్నా తప్పుడు రిజల్ట్స్ వస్తూండేవి".

"ఓ?! ఐసీ! హేపీ?!? ఐ యాం వెరీ హేపీ!!! కంగ్రాచ్యులేషన్స్!" దాదాపు ఏడుపే తక్కువ లింగమయ్య కళ్ళల్లో. అది గొంతులో ప్రతిఫలించింది.

"థాంక్యూ లింగమయ్యా, థాంక్యూ" ఉత్సాహంగా చెప్పింది బామ్మ

"వాటీజ్ దిస్ నాన్సెన్స్? ఆఁ?" తల ఎత్తి ఆకాశంలోకి చూస్తూ అడిగాడు లింగమయ్య.

"ఏమిటి?" అడిగింది అనన్య.

"మీతో కాదు నే మాట్లాడింది" చెప్పాడు లింగమయ్య అన్యమనస్కంగా పైకి చూస్తూ.

"జవాబు చెప్పని వారితో మాట్లాడి ప్రయోజనం లేదు కదండి" నవ్వింది అనన్య.

"సరే. వెళ్ళొస్తాను" చెప్పాడు లింగమయ్య.



**"నేను నా చిన్నతనంలో మా తాతగారితో కలిసి శ్మశానానికి వెళ్ళాను. నేను తిరిగి వచ్చేసాను. ఆయన అక్కడే ఉండిపోయారు"అన్నాడు ఓ బుద్ధిమంతుడు. ఈ సీరియల్‌లో అలా ఓ బామ్మగారు తన తల్లితండ్రులు, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు, కొడుకులు, కోడళ్ళు మనవళ్ళని అందరినీ స్మశానంలో దింపింది. వాళ్ళు అక్కడే వుండి పోయారు. ఈవిడ వెనక్కి వచ్చింది!!! వివరాలకి సీరియల్ చదవండి.**

ఏదో ట్రాన్స్‌లో వున్న వాడిలా బయటికి నడిచాడు. అతనెళ్ళాక చెప్పింది అనన్య.

"దటీజ్ ఇట్ బామ్మ. లెట్స్ ఆల్వేస్ బి ట్రూత్ ఫుల్".

"పాపం. ఎంత చిన్న మొహం వేసుకుని వెళ్ళాడో చూసావా? నేను త్వరలో పోతానన్న భ్రమలో ఉంచుతూంటే, అతనికి లభించే ఆనందాన్ని ఎందుకు పోగొట్టాలని ఇంత కాలం ఈ నాటకం ఆడుతూ వస్తున్నాను. పాపం ఎంత చిన్నబుచ్చుకున్నాడో!" సానుభూతిగా చెప్పింది బామ్మ.

"ఇక నించీ నీ మందులన్నీ నేను శ్రద్ధగా ఇస్తూంటాను. ఎవరు చెప్పొచ్చారు? నువ్వే ఎక్కువ కాలం బ్రతికి ఈ ముగ్గురు వారసులు కూడా ముందే పోవచ్చేమో?" చెప్పింది అనన్య నవ్వుతూ.




మనిషి ఆశాజీవి.

***

కంపెనీ లెటర్ హెడ్ మీద టైప్ చేయబడి సంతకానికి వచ్చిన లెటర్‌ని చదివాడు సుబ్బారావు.

డియర్ మిస్టర్ ఛటర్జీ,

లెట్స్ సీ. వాట్ షల్ ఐ టెల్ దిస్ ఫూల్.

ఇన్ రిప్లయి టు యువర్ లెటర్ ఆఫ్ సో అండ్ సో డేట్, వి ఆర్ సర్‌ప్రయిజ్‌డ్ టు లెర్న్ దట్ ది ఒన్ టన్ లారి యూ పర్చేస్డ్ ఫ్రం అజ్ ఈజ్ నాట్ గివింగ్ పర్‌ఫెక్ట్ సేటిస్‌ఫేక్షన్ (వి సోల్డ్ ఇట్ క్విక్ బిఫోర్ ఇట్ ఫెల్ టు పీసెస్)...

మిస్టర్ ఛటర్జీ. వి ఇన్‌స్పెక్ట్ ఆల్ యూజ్డ్ వెహికల్స్ థరోలీ బిఫోర్ సెల్లింగ్ దెమ్ అండ్ ది లారీ వజ్ ఇన్ ఎక్సలెంట్ కండిషన్ బిఫోర్ ఇట్ లెఫ్ట్ అవర్ గేరేజ్" (ఏ న్యూ పెయింట్ కోట్ ఆన్ ది ఓల్డ్ జంక్).

ఇట్ ఈజ్ పాజిబుల్ యువర్ డ్రైవర్ ఈజ్ ఎట్ ఫాల్ట్. ఫోర్‌మైల్స్ టు ఒన్ లీటర్ ఈజ్ ఏ వెరీ పూర్‌మైలేజ్ ఫర్ ఏ లారీ ఇన్ సచ్ ఏ గుడ్ కండిషన్. (ఇట్ వజ్ ఫైవ్ లీటర్స్ హియర్ వెన్ ఇట్ వజ్ విత్ అజ్... మిస్ లిజా ది డింపుల్ ఆన్ యువర్ చిన్ ఈజ్ వెరీ గ్లామరస్). ప్లీజ్ బ్రింగ్ లారీ టు అజ్, సో దట్ అవర్స్ ఎక్స్‌పర్ట్స్ విల్ హేవ్ ఏ లుక్ ఎట్ ఇట్ (బ్లడీ ఇడియట్)

యువర్స్ సిన్సియర్లీ

ఆస్క్ మేనేజర్ టు సైన్ దిస్

ఆ టైప్ చేసిన లెటర్‌లోని (బ్రాకెట్స్ లోవి) వాక్యాలు తన స్టెనోగ్రావర్‌ని ఉద్దేశించి మాట్లాడినవైనా వాటినీ ఆమె టైప్ చేయడంతో లింగమయ్యని పిలిచి అడిగాడు.

"ఈ లెటర్ చూడు. ఇంటెలిజెన్స్‌తో పాటుగా గ్రామర్ బాగా వచ్చిన స్టెనోగ్రాఫర్‌ని సెలక్ట్ చేయమంటే, ఎలాంటి అమ్మాయిని సెలక్ట్ చేసావో"

లింగమయ్య ఆ లెటర్ చదివి చెప్పాడు.

"ఇంటలిజెన్స్‌తో పాటు మీరు గ్రామర్ అన్నారా?"

"అవును?"

"నాకు గ్లామర్ అన్నట్లు వినబడి మిస్ లిజాని సెలక్ట్ చేసాను సార్".

"చెవుడు మిషన్ ఒకటి కొనుక్కోమను. హడావిడిగా ఆ లెటర్ సైన్ చేసి పంపివుంటే ఇరుక్కునే.వాళ్ళం"

"నాకు అప్పుడే అనిపించింది. మీరు గ్లామర్ గర్ల్స్‌ని టైపిస్ట్‌గా కోరుకుంటున్నారేమిటా అని. అయినా 'పోయే వయసు కాని వచ్చే వయసు కాదు కదా... ఉండమ్మలే' అనుకున్నాను సార్. మిస్ లిజాని వెంటనే డిస్మిస్ చేసేసి ముప్పై ఏళ్ళ అనుభవం వున్న టైపిస్ట్‌ని పెడతాను సార్".

"వద్దులే. ఈమె వుంటే, నా మనసు కొత్తగా కళకళలాడుతోంది. ఎలాగో నేనే అడ్జస్ట్ అవుతాను".

"వెరీ గుడ్ సర్"

"ఇంతకీ నే చెప్పిన ఆ విషయం ఏం చేసావు?" అడిగాడు సుబ్బారావు.

"దానికే వస్తున్నాను సార్. మన ప్లాన్‌లో తప్పేం లేదు సార్. వాళ్ళే వాస్తు దోషం అని వంట గదిని ఆగ్నేయమూలకి, బాత్‌రూంని నైరుతి మూలకి మార్చుకోవడంతో, వాళ్ళ మెయిన్‌డోర్ తలుపు తీయగానే ముందు గది కాస్తా బాత్‌రూం అయింది సార్".

"దాని గురించి కాదయ్యా నేను చెప్పేది".

"నాకది గుర్తుంది సార్. ఈ చిన్న విషయాలన్నీ తేల్చాక, చివరికి నేనే దాంట్లోకి వద్దాం అనుకుంటున్నాను సార్".

"నేను దేన్ని గురించి మాట్లాడుతున్నానో నీ కర్థమైనట్లే మాట్లాడుతున్నావే" చిరాగ్గా చెప్పాడు సుబ్బారావు.

"మీ దగ్గర పదిహేనేళ్ళుగా పని చేస్తున్నాను ఎందు కర్థం కాదు? సద్దాం ఆంటీ గురించేగా మీరడిగేది? నే చెప్పబోయేది సద్దాం ఆంటీ గురించే".

"సద్దాం ఆంటీ ఎవరయ్యా?"

"అదేనండి. రామ్‌నగర్‌లో మీరు కొని, పడకొట్టించి ఫ్లాట్స్ కడదామనుకున్న ఇంటి ఓనర్".

"ఆఁ అదే నే మాట్లాడదలచుకుంది. ఏమిటి? ఏమందావిడ?"

"ఇల్లు అమ్మనంటోంది సార్"

"ఎలాగయ్యా ఆవిడ చేత దాన్ని అమ్మించడం? కట్టుకుపోతుందా వెంట?" చిరాగ్గా అడిగాడు సుబ్బారావు.

"ఏం చేద్దామనుకుంటుందో నాకైతే క్లియర్‌గా తెలీదుకాని ఓ పది, పదిహేనేళ్ళు దాకా దాన్ని ఆవిడ అమ్మే ప్రసక్తి లేదు. అమ్మితే గిమ్మితే ఆవిడ తర్వాత నేనే మీకది అమ్మాలి".

"నువ్వయినా అమ్ముతావా లేక ఆవిడలా.... ఏమిటి?! నువ్వా!! ఆ ఇల్లు ఆవిడ తర్వాత అమ్మేది నువ్వా!! 'ఆశ్చర్యపోయాడు' సుబ్బారావు.

"అవునుసార్" వినయంగా చెప్పాడు లింగమయ్య.

"ఈ కనెక్షన్ నాకు అర్థం కాలేదు"

"వెరీ సింపుల్ సర్. ఆవిడ తదనంతరం ఆ ఇంటి వారసుల్లో నేను రెండో వాడిని".

"నువ్వేం మాట్లాడుతున్నావో నాకు ఒక్కముక్క అర్థం కావడం లేదు. ఆ లిజా ఎపాయింట్‌మెంట్ కూడా అలా చేశావు. పైత్యం గాని ఎక్కిందా నీకు? ఆఁ?" గర్జించాడు సుబ్బారావు.

కురుక్షేత్రంలో యుద్ధం చేయనున్న అర్జునుడి వంక శ్రీకృష్ణుడి చూసి నవ్వినట్లుగా, అచ్చం అలానే నవ్వి చెప్పాడు లింగమయ్య.

"మీకు కొన్ని అధ్యాయాలు బోధ చేస్తే కాని జ్ఞానం కలగదు సార్. నే చెప్పే ఫ్లాష్ బాక్‌లన్నింటిని జాగ్రత్తగా వినండి అసలేం జరిగిందంటే..."

సుబ్బారావుకి లింగమయ్య, కంకాళమ్మ తండ్రి గురించి, మరణించిన ఆయన ఇతర పిల్లల గురించి, దాంతో ఆ రామ్‌నగర్ ఇంటికి ఆవిడ వారసురాలవడం గురించి, ఆవిడ దగ్గర తన తాత గ్రామం, ఆ ఇంటిని విచిత్రమైన కండిషన్లతో కొనడం గురించి, తర్వాత బామ్మ పోవడం బదులుగా, గ్రామం, ఆయన ఇద్దరు కొడుకులు పోవడం గురించి, దాంతో ఆయన మనవలైన తను, తన తమ్ముడు, తన అన్నలతో ఆ ఇంటికి హక్కుదారులవడం గురించి క్లుప్తంగా వివరించాడు.

శ్రీకృష్ణుడి బోధ మొత్తం విన్నాక అర్జునుడికి కలిగిన జ్ఞానోదయం లాంటిది సుబ్బారావుకి కలిగింది.

"ఓ! ఆ ఇంటి వెనక ఇంత కథ వుందా?" అడిగాడు సుబ్బారావు.

"అవున్సార్. ఇంతకాలం సద్దాం ఆంటీ 'ఈ వారం టపా కట్టేస్తుందిలే' అనుకుంటూ నెట్టుకు వస్తున్నాను. తీరా ఇందాక వాళ్ళింటికి వెళితే ఆవిడకి మరో పాతికేళ్ళదాకా ఢోకా లేదని తేల్చి చెప్పారు".

"ఎట్టెట్టా?"

"అవున్సార్. అట్టట్టానే".

"ఆవిడకి కనీసం ఓ ఎనభై ఏడైనా వుండవూ?"

"ఇంకా ఎక్కువే సార్ వయసు. మూకీ సినిమా రోజుల్లో మనిషి. టాకీలు, బ్లాక్ అండ్ వైట్‌లు, గేవా కలర్, ఈస్ట్‌మన్ కలర్, సెవెంటి యం.యం.లు... ఆడియో టేప్‌లు, వీడియో టేప్‌లు, ఆఖరికి డివిడిలు కూడా చూసిన మనిషి సార్! ఒక్కమాటలో చెప్పాలంటే... సాక్షాత్తూ యముడ్ని మోసం చేస్తున్న మనిషి సార్."

"అందుకు యముడికి ఎంత లంచం ఇస్తుందంటావ్?" ప్రభుత్వ కార్యాలయాల్లో తప్పనిసరి కాబట్టి చేతులు తడిపే అలవాటున్న సుబ్బారావు అడిగాడు ఆసక్తిగా.

"అది యముడినే అడిగి తెలుసుకోవాల్సిన విషయం సార్ అది"

"అంతొద్దులే. కాని ఈ సమస్య సాల్వ్ అవదా? ఎలాగబ్బా?".

"మనం చిత్రగుప్తుడితో కొద్దిగా లాలూచీ



పడితే చాలుసార్".

"ఓ!!! అవును.... ఓ !!! అవునవును... ఓ!!!"

సుబ్బారావు ఓ అన్నప్పుడల్లా ఆ పని ఇష్టం లేనట్లుగా, అవునవును, అన్నప్పుడల్లా ఇష్టం వున్నట్లుగా చెప్పాడు. ఆయన అలా ఆ పని చెయ్యాలా వద్దా అన్న డైలమాలో వుండడం గమనించిన లింగమయ్య ఆయన పదమూడో సారి అవునవును అనగానే అడ్డుకుని చెప్పాడు.

"రామ్‌నగర్ చౌరస్తాలో పెద్ద కాంప్లెక్స్ అవుతుంది సార్. "మనకా ప్రాజెక్ట్ మీద కోటిన్నరకి తక్కువ లాభం వుండదు సార్"

"హరకేశం కూడా.... గతంలో మనకి ఇలాంటి పనులెన్నో చేసి పెట్టాడు సార్. అందుకే ఈ స్టేజ్‌కి వచ్చాం సార్. ఇంతకన్నా ఇంకొంచెం పై స్టేజీకి మీకు వెళ్ళాలని వుంటే, మళ్ళీ ఈ విషయంలో వాడి సహాయం తీసుకోవాల్సిందే సార్".

"అవునవును"

"వ్యాపారంలో చిక్కులొస్తుంటాయి సార్. వాటిని తుంగలో తొక్కుతూ ముందుకు పోతూండడమే సరైన వ్యాపారస్తుడి లక్ష్యం సార్".

"అవునవును"

"మీకు గుర్తు చేయాలని కాదు కాని మీరు అలాంటి నిఖార్సయిన వ్యాపారి కదా సార్"

"అవును"

"మరింక ఆలోచించడం దేనికి సార్... ఓ సమస్య దాని ఎదురుగా ఓ పరిష్కారం... జస్ట్ సాల్విట్ సార్"

"అవునవును. హరకేశం గాడ్ని ఓ సారి నన్ను కలవమన్నానని చెప్పు"

"అలాగే సార్. ఇప్పుడే వాళ్ళింటికి వెళ్ళి చెప్తాను. సో, సద్దాం ఆంటీ వయస్సుకో హద్దు వుండాలని మీరు నిర్ణయించినట్లే కదా సార్?" ప్రశ్నించాడు లింగమయ్య.

"అవును. కాని ఇందాకటి నించి వింటున్నాను.ఈ సద్దాం ఆంటీ ఎవరయ్యా మధ్యలో? ఆవిడ పేరు ఏదో వుండాలి కదా.... ఆ... బామ్మ".

ఆవిడ అసలు పేరు "కంకాళమ్మ".

"అదేం పేరు"

"వాళ్ళ నాన్నగారు బాగా దైవభక్తుడు. తమ గ్రామదేవత కంకాళమ్మ జాతర చేసిన రాత్రే ఈవిడ కడుపులో పడిందన్న నమ్మకంతో ఆ పేరు పెట్టుకున్నాడు".

"సరే. ఏదో ఓ పేరు. ఆ బామ్మ గురించేనా మనం మాట్లాడుకునేది?"

"అవును సార్".

"మరి ఇందాక ఇంకేదో పేరు అన్నావు? చద్దాం ఆంటీ నేనా?"

"కాదు సార్. సద్దాం ఆంటీ"

"ప్రాణాల్లేచిపోయేలోగా ముందది క్లియర్ చెయ్యి మొన్న మాట్లాడానే ఆవిడ, ఈవిడ ఒకరేనా?"

"ఒకరే సార్?"

"ఈ కొత్త పేరు ఎలా వచ్చిందావిడకి?"

"నేనే పెట్టాను సార్"

"నువ్వెందు కీ వింతపేరు పెట్టావు?"

"సద్దాం ఎవరో మీకు తెలుసా కదా సర్?"

"మా వంట వాడా?"

"వాడు చవట సార్. ఇరాక్ అధినేత సద్దాం హుస్సేన్ గురించి నేచెప్తూంటా"

"ఎప్పుడూ కలవ లేదు"

"తెలుసా అంటే, నా ఉద్దేశం మీరు ఆయనకి షేక్ హ్యాండ్ ఇచ్చారా అని కాదు. ఆ పేరు తెలుసు కదా సార్?"

"తెలుసు"

"నైన్టీన్ నైన్టీలో వాడి మీద అమెరికా యుద్ధం చేసింది. వాడ్ని చంపాలని, వాడి దేశంలో వాడు ఫలానా చోట దాక్కున్నాడన్న అనుమానంతో ఎన్నోసార్లు బాంబింగ్ చేసారు. అయినా వాడు ఒక్క బాంబు దాడిలో కూడా చావలేదు.

మన బామ్మలా యముడితో ఏదో లాలూచీ పడ్డ బాపతే కాబట్టి సద్దాం ఆంటీ అనే నిక్‌నేమ్‌ని మన బామ్మకి ఖాయం చేసాను సర్".

"బావుంది బావుంది. ఈ ఆపరేషన్ మొత్తాన్ని ఇక మనం కోడ్‌లో "సద్దాం ఆంటీ"గా పిల్చుకుందాం" చెప్పాడు సుబ్బారావు ఆనందంగా.

"తథాస్తు. నేను వెళ్ళి హరకేశాన్ని కలిసొస్తాను సార్" చెప్పి లింగమయ్య బయటకి నడిచాడు.

**(ఇంకా వుంది)**

జస్ట్ ఫర్ ఫన్

## మద్యమా? మగువా?

**కొ**స్త హై క్లాసు పార్టీ జరుగుతోంది. డ్రింకులు ఇవ్వడానికి ఓ అందమైన అమ్మాయిని పెట్టారు. ఆమె హుషారుగా తిరుగుతూ ఆడా, మగా అందర్నీ మొహమాటపెట్టి మరీ డ్రింకులు ఇస్తోంది. మధ్యవయస్సులో ఉన్నవాళ్లు కూడా ఆమె కులుకు, హొయలు చూసి డ్రింకు వద్దనలేకుండా ఉన్నారు. రాత్రి పొద్దు పోయింది. భోజనాలకు కదులు తున్నారు చాలామంది.



పార్టీ ఇస్తున్నాయన వద్దకు 40 యేళ్ల వయసున్న ఒకావిడ వచ్చింది. "ఎక్స్క్యూజ్ మీ, డ్రింకులిచ్చే అమ్మాయి ఎక్కడ?" అని అడిగింది.

ఆయన ఆశ్చర్యపడ్డాడు. ఆవిడ సాధారణంగా డ్రింకు తీసుకోదని ఆయనకు తెలుసు. ఈ గడుగ్గాయి అమ్మాయి ఈవిడ చేత కూడా మందు ముట్టించిదన్న మాట అనుకుని ఆశ్చర్యపడుతూ, "భోజనాల వేళ కావడంతో డ్రింకులు సర్వ్ చేయడం ఆపేసినట్టుంది. అయినా వర్రీ కాకండి. మీ సీట్లో కూచోండి డ్రింకు పంపిస్తాను'. అని హామీ ఆవిడకు ఒళ్లు మండింది.

"నాకు కావలసినది డ్రింకు కాదు, మా ఆయన!" అంది పళ్లు గిట్టకరిచి.

- విద్యాపతి

# పద్మనాభం ఆత్మకథ



## 2

**అల్లరిలో అయితే వెయ్యిమార్కులు వస్తాయని ఆయన అనడానికి కారణం ఉంది. ఒక్కోప్పుడు అల్లరి శృతి మించేది కూడా. ఒక్కోప్పుడు ప్రమాదకరం కూడా అయ్యేది. ఓ సంఘటన చెప్తాను. ఓ సారి నా స్నేహితులతో కలిసి బావిలో ఈత కొట్టడానికి వెళ్లాను. అందరం ఈతకొడుతున్నాం. అప్పటికి ఇంకా నేర్చుకోవడం కాబట్టి మునగబెండ్లు కట్టుకొని ఈతనేర్చుకుంటున్నాం. మధ్యాహ్నం రెండు గంటల వేళ. అందరూ బట్టలుతుక్కుంటున్నారు. నేను గట్టుమీదనుండి బావిలోకి దూకాను. మునగబెండ్లు తెగిపోయాయి. అమ్మా అని అరుస్తూ మునుగుతూ తేలుతూ వున్నాను. నా స్నేహితుడు ప్రభాకరరెడ్డి చూసి వెంటనే దూకి నన్ను జుట్టుపట్టుకుని బయటకు ఈడ్చుకొచ్చాడు. అతను రక్షించకపోతే పద్మనాభం లేడు - పద్మనాభం హాస్యమూ లేదు. అలా గండం గడిచి బతికాను.**

ఎవరైనా బీడీలు తాగి పడేస్తే అవి ఏరుకొని వూరి బయటకు వెళ్ళి నేనూ, సుదర్శనం అనే అతనూ తాగేవాళ్ళం. యిలా చేయడం మానాన్నగారి వరకు వెళ్ళింది. కోపంతో బెత్తంతో బాదారు. ఇక తాగమని కాళ్ళు పట్టుకొని ఏడ్చాం.

ఇంకోసారి ఒక పండగరోజున రాక్షసుడి వేషం వేసి ఎర్రటి రంగులు



'పాతాళ భైరవి'లో ఓ సన్నివేశం

మొహమంతా పులుముకొని, చేతిలో పెద్దకత్తి, తాళ్లతో కట్టి లాగుతుంటే రంకెలు వేసి ఎగురుతూ వీధిలోంచి ఇంట్లోకి వస్తున్నాను. మా అమ్మకు తెలిసి పట్టుకుందామని నాకు ఎదురుగా వస్తోంది. అమ్మ బాగా ఆనందించాలని ఇంకా హుషారుగా గెంతులేస్తూ వస్తున్నాను. దగ్గరకు రాగానే చీపురుతో మా అమ్మ బాగా వడ్డించింది.

ఇలాటి అల్లర్లు చేస్తున్నా నా పాటలు నన్ను పాప్యులర్ చేశాయి. ఇరుగుపొరుగు ఇళ్లనుండి పాలతోడు కోసం మజ్జిగ తెమ్మని అమ్మ గిన్నె ఇచ్చి పంపేది. వాళ్లేమో నేను పాట పాడితే గాని మజ్జిగ పోయం అనేవారు. పాడమని అడగడం ఆలస్యం, పాట అందుకునే వాణ్ని. ముఖ్యంగా సినిమాపాటలు. ఇలా ఎలిమెంటరీ స్కూలు చదువు దాటి, హైస్కూలు చదువుకు వచ్చాను.

మానాయన అమ్మ సుబ్బమ్మగారు నన్ను, సుదర్శనరావును హైస్కూలులో చేర్పించడానికి ప్రొద్దుటూరు తీసుకెళ్ళారు. శ్రీ కన్యకాపరమేశ్వరి ఆలయంలో మా చిన్నతాతగారి సంసారం వున్నారు. ముందుగా ఇంగ్లీసు ప్రైవేటుకై శ్రీ పాండురంగాచారి మాస్టరు దగ్గర చేరాము.

సుబ్బమ్మవ్వగారు షిర్డీసాయి బాబావారి భక్తురాలు. ఆమెతో కలిపి బాబా భజనలు చేసేవారం. ఆంధ్రదేశంలోనే కాక అనేకచోట్ల ఆమెకు శిష్యులు వున్నారు. శివుడు అనే శిష్యుణ్ణి వెంటబెట్టుకొని తీర్థయాత్రలు చేసేవారు. మాకు ఒక పాత్రను చేతికిచ్చి 'బ్రాహ్మణుల ఇంటిముందు 'భవతీ భిక్షాం దేహి' అనండి. అన్నం కూరలు పెడతారని చెప్పి పంపారు. ఆ విధంగా కొన్నాళ్ళు గడిపాము. తరువాత వారాలు చేసుకొని కొన్నాళ్ల జరిగాయి. జాగ్రత్తగా చదువుకోండి అనిచెప్పి ఆమె ఊరు వెళ్లారు.

పాపం ఆవిడపాటికి ఆవిడ చెప్పింది గానీ అది మనం వినాలని ఏముంది? ముఖ్యంగా బంగారం లాటి సినిమాలు ఊళ్లో ఆడుతూంటే - "భక్తపోతన, 'కృష్ణప్రేమ', ' ఝూలా' (హిందీ) ఆడుతున్నాయి. మేనేజరును పరిచయం చేసుకొని ప్రతిరోజూ సినిమాలు చూసేవాళ్లం. కృష్ణప్రేమలో అద్దంకి శ్రీరామ మూర్తిగారు, భానుమతిగారి డ్యూయెట్.

**'ఎక్కడున్నావే పిల్లా ఎక్కడున్నావే,'**

**'చందమామ కలువలోన, చెంగలువా రంగులోనా**

**నక్కివున్నానోయి బావా నక్కివున్నానోయి'**

అనే పాటను అనుకరించి డ్యాన్సు చేసి పాడేవాణ్ణి.

అప్పటికి సైకిల్ నేర్చుకున్నాను. చదువు సంగతి నేను చెప్పనక్కరలేదు.

మీరే ఊహించుకోండి! పాండురంగాచారి దగ్గరకు ఎప్పుడో బుద్ధిపుట్టినప్పుడు వెళ్ళేవాళ్ళం. మాకు చదువు అబ్బదని ఆయన కూడా గ్రహించాడు!

సైకిల్ నేర్చుకున్నాక స్వంత సైకిల్ ఉండాలన్న కోరిక కలగడం ఎంతసేపు? కానీ భోజనానికే వారాలు చేసుకుంటూంటే సైకిల్‌కి డబ్బులెవరిస్తారు? అయినా సైకిల్ కొనాలన్న కోరికే నా జీవితాన్ని మలుపు తిప్పింది.

సైకిల్ కొనడానికి డబ్బు ఎలా సంపాదించాలా అని ఆలోచించి, బెంగుళూర్ ప్రయాణం అయ్యాం. మిలిటరీ కంపార్టు మెంటులో ఎక్కి పాటలు పాడి సైనికులతో పాటు ప్రయాణం చేస్తున్నాం. మార్గమధ్యంలో రైలు ఒకచోట ఆగింది. ఏదైనా కొనుక్కొని తిందాం అని దిగాను. ఇంగ్లీషు టికెట్ కలెక్టరు వచ్చి 'ఏయ్, వేరీజ్ యువర్ టికెట్' అని అడిగాడు. 'నో టికెట్ మిలిటరీ కంపార్టుమెంటులో ఎక్కాం' అనగానే 'యూ రాస్కెల్' అని చెంపచెళ్‌మని వాయించాడు. బయట ప్రపంచంలో నేను తిన్న మొదటి దెబ్బ అదే!

బెంగుళూర్ వచ్చింది. మిలిటరీ వారి లగేజ్ నెత్తిన పెట్టుకొని స్టేషన్‌నుంచి బయటపడ్డాము. ఆకలి, దానితోపాటు విపరీతమైన చలి. ఎలాగో ఒక ఇంటికి చేరి మా సంగతి చెప్పాం, వాళ్ళు దయతలచి అన్నంపెట్టి కప్పుకోడానికి దుప్పటి యిచ్చారు. వరండాలో మైమరచి నిద్రపోయాం.

తెల్లవారుఝామున 5 గంటలకు మెలకువ వచ్చింది. ఇక ఊరిమీద పడ్డాం. చలికి వణుకుతూనే ఏదో ఒక దిక్కుకి నడుచుకుంటూ పోయాం. కాస్సేపు పోయాక గుర్తుకు వచ్చింది. చలికి కప్పుకున్న దుప్పటి ఆ ఇంటి వాళ్లది కదాని! 'ఒట్టి అయోమయం గాళ్లం. వాళ్లు మనది పొరబాటు అనుకోరు. మనల్ని దొంగల కింద జమకడతారు కదా, తిట్టుకుంటారు కదా! ఎంత పొరపాటు చేశాం! మళ్లీ తిరిగి వారి ఇంటికి వెళదామంటే గుర్తుపడతామో లేదో... చాలా దూరం వచ్చాం.' అని బాధపడి, ఏం చేయాలో



'షావుకారు' చిత్రంలో ఓ సన్నివేశం....

## పద్మనాభము - తేనెమనసులూ

భాను : One-two-three-four-five-six-seven-eight
మాస్టారూ - డ్రిల్ మాస్టారూ.
8-7-6-5-4-3-2-1
మానేస్తారా? ఇక మానేస్తారా?
ఉద్యోగం ఇస్తాము చేస్తారా? ఒక
ఉద్యోగం ఇస్తాము చేస్తారా?
ఒళ్లువంచి పనిచేయాలి
మెదడుకు పదును పెట్టాలి

రాజు : అమ్మయ్యో! మెదడే?!

భాను : అది లేకున్నా ఫరవాలేదు
మీకు తోడుగా వుంటాను.

రాజు : అమ్మయ్య! ఉంటారా?

భాను : మెలకువగా పనిచేశారంటే
మీరే దొరలా వస్తారు...

రాజు : మరి జీతం?

భాను : నెలకు ముప్పయి రోజులు జీతం
రోజుకు రెండే పూటలు బత్తెం

రాజు : చిత్తం

భాను : పూటపూటకు పని వుంటుంది
నాలుగు రోజులు సెలవుంది

రాజు : సెలవుల్లో ఏం చేయాలి?

భాను : మా కొలువుననే మీరుండాలి
మా కనుసన్నలలో మెలగాలి

రాజు : దానికి జీతం?

భాను : నా జీవితం....







దిక్కుతోచక సతమతమౌతుంటే ఒక ముసలామె తన చీరకప్పుకొని వణుకుతూ వుండడం చూశాం. మన పాపం పోగొట్టుకోవాలంటే ఈ దుప్పటి ఆమెకు కప్పి వెళ్లిపోవడం మంచిదని అనుకొని 'అవ్వా ఇది కప్పుకో' అని ఆమెకు కప్పి మా దారిన మేము వెళ్లాము.

మా దారిన అన్నాను గానీ మాకు అక్కడ దారేముంది? గోదారి. ఆ విషయం మాకు త్వరలోనే అర్థమయ్యింది. 'ఇక్కడ భాష కన్నడ! మన తెలుగు పాటలు ఇక్కడెవరికి కావాలి? మన పాటలు ఎవరూ వినరు. బుద్ధిగా మనం ప్రొద్దుటూరు తిరిగి వెళ్లడం మంచిది' అనిపించింది. రైలు మాకు ఆత్మబంధువు. ఫ్రీగా టిక్కెట్ లేకుండా ఎక్కడికి కావాలంటే అక్కడికి వెళ్లవచ్చు! రైలు ఎక్కాం.

రైలు తిరిగి వెళుతూంటే అనిపించింది - అసలు బెంగుళూరు వచ్చిన ఉద్దేశ్యమే నెరవేరలేదే అని! పుల్లయ్య వేమవరం వెళ్లినట్టవుతోంది. సైకిల్ ఎలాగైనా కొనాలి అన్న తపన ఎక్కువైంది. ట్రెయిన్‌లో ఆంధ్రప్రభ దినపత్రిక పేపరు కనబడింది. మద్రాసులో ఆడుతున్న సినిమా ప్రకటనల మీద చూపుబడింది. మద్రాసులోని వెలింగ్‌టన్ టాకీసులో 'కృష్ణప్రేమ' 90వ రోజు అనే ప్రకటన నన్ను ఆకర్షించింది.

మద్రాసులో చాలామంది సినిమా వాళ్లు ఉంటారు. ఆ మహానటుల వద్దకు వెళ్లి, నా పాటలు పాడి వినిపించి, వాళ్ల యాక్షన్ ఇమిటేషన్ చేసి చూపించి, మెప్పిస్తే డబ్బులిస్తారని తోచింది. ఆ డబ్బులు సంపాదించి తిరిగి ప్రొద్దుటూరు చేరి సైకిల్ కొనుక్కుని ఝామ్మని తిరగాలని బుద్ధి పుట్టింది. మా ఫ్రెండూ అదే కరక్టన్నాడు. మేం ఒక నిర్ణయానికి వచ్చేసరికి రైలు యర్రగుంట స్టేషను చేరింది.

అక్కడ ఒక అమ్మాయి, ఆమెతో బాటు వాళ్ల నాన్న పరిచయమైనారు. వాళ్లతో ఒకే బోగీలో మద్రాసుకు ప్రయాణమయ్యాము. తోటి ప్యాసింజర్స్ మా సంగతి కనుక్కొని పాటలు పాడించుకొని ఆనందపడి కొంత డబ్బులు ఇచ్చారు. ఇంతలో యమకింకరుడిలా టికెట్ కలెక్టరు వచ్చాడు. చెంపదెబ్బ గుర్తువచ్చి ఎలాగా అని గుండె కొట్టుకోసాగింది. అప్పుడు ఒక పెద్దమనిషి 'మీరు బల్లకింద దాక్కోండి' కనపడకుండా మేము కాళ్ళు అడ్డుపెడతాం' అన్నారు. అలా అనగానే ఎలకల్లా యిద్దరం బల్లకింద దూరాం. టి.సి. రావడం, వెళ్లడం క్షణాల్లో గడిచిపోయాయి.

మద్రాసు సెంట్రల్ స్టేషన్‌లో రైలు ఆగడానికి ముందు బేసిన్‌బ్రిడ్జి స్టేషన్ అనే లోకల్ స్టేషన్‌లో సాధారణంగా ఆగుతుంది. సెంట్రల్‌లో రద్దీ ఎక్కువగా ఉంటుందని, బేసిన్ బ్రిడ్జిలోనే టిక్కెట్ చెకింగ్ చేసేవారు. ఆ వేళ కూడా రైలు బేసిన్ బ్రిడ్జి స్టేషన్‌లో ఆగుతుందేమో తెలియదు. ఆగితే మా పని ఆఖరే! సెంట్రల్ అయితే పెద్దస్టేషన్ కాబట్టి ఎవరికంటా పడకుండా తప్పించుకునే అవకాశం ఉంటుంది. బేసిన్ బ్రిడ్జిలో ఆ పప్పులు ఉడకవు.

బేసిన్ బ్రిడ్జిలో ఆగితే టికెట్లు లేనివారిని పట్టుకొని జైల్లో పెడతారని కొంతమంది భయపెట్టారు. మా అదృష్టం కొద్దీ అక్కడ ఆగకుండా సెంట్రల్ స్టేషనులో ఆగింది.

**-(ఇంకా వుంది)**

పద్మనాభం గారి ఆత్మకథ సీరియల్ కింద - హీరో కృష్ణ తొలి చిత్రం అయిన 'తేనెమనసులు'లోని పాట వెయ్యటం వెనక ఓ ఆసక్తికరమైన విషయం ఉంది.



ఈ పాట రచన ఆత్రేయ, సంగీతం కె.వి.మహదేవన్, సుకన్యకు ప్లేబాక్ పాడినది పి.సుశీల అనీ అందరికీ తెలుసు. కానీ పాటలో హీరోకృష్ణ అభినయించిన కొన్ని లైన్లకు వాయిస్‌ని ఇచ్చింది పద్మనాభం. ఈ విషయం చాలా మందికి తెలియదు. పాటల పుస్తకంలో కూడా లేదు. కేవలం గొంతు విని గుర్తు పట్టాల్సిందే!

ఈ ఇన్ఫర్మేషన్‌ని విషయమై హీరో కృష్ణగారిని కాంటాక్ట్ చేసింది - 'హాసం'! వినగానే ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని ఏకకాలంలో వెలిబుచ్చా రాయన.

"మీరు చెప్పే వరకు నాకు కూడా ఈ విషయం తెలీదు" అని అన్నారు.

"ఈ పాట ఎవరు పాడేరండీ అని మీరు ఆ రోజుల్లో అడగలేదా?"

"ఎక్కడండీ!? వాళ్ళు చెప్పింది చెయ్యడం ఒక్కటే ఆ రోజుల్లో నాకు తెలుసు".

"మరిప్పుడు ఈ విషయం తెలిసిన తర్వాత మీరెలా స్పందిస్తున్నారు?"

"నేను నటించిన సినిమాలు, నాకు ప్లేబ్యాక్ పాడిన గాయకులు వీటికి సంబంధించిన స్టాటిస్టిక్స్‌లో పద్మనాభం గారి పేరు కూడా ఉండటం నాకెంతో ఆనందంగా ఉంది. ఒక గ్రేట్ కమేడియన్, మంచి దర్శకుడు, అభిరుచి గల నిర్మాత, వీటన్నిటినీ మించి మంచిమనిషి అయిన పద్మనాభం గారు నాకు ప్లేబ్యాక్ పాడటం నాకెంతో గర్వకారణం. మీకు తెలుసను కుంటాను. తర్వాత రోజుల్లో ఆయన తీసిన సినిమాలో నేనొక గెస్ట్‌రోల్ వేశాను".

"అవును... శ్రీశ్రీశ్రీ మర్యాద రామన్నలో"

"కరెక్ట్...."

"అయితే ఈ విషయాలన్నీ మా 'హాసం' పాఠకులకు తెలియ జేయవచ్చునా!" అని అడిగింది హాసం.

"ఓ నిరభ్యంతరంగా....! అవసరం కూడాను" అన్నారు కృష్ణ చాలా ఆనందంగా.

ఇదే విషయంపై పద్మనాభం గారిని కూడా 'హాసం' కాంటాక్ట్ చేసి అడిగింది.

"అప్పట్లో ఆదుర్తి సుబ్బారావు, కె.వి.మహదేవన్, నేనూ చాలా క్లోజ్‌గా ఉండే వాళ్ళం. నేను పాడతానని వాళ్ళిద్దరికీ బాగా తెలుసు. నాచేత ఏదైనా ఓ పాట పాడించాలని వాళ్ళు అనుకునేవారుట. 'తేనె మనసులు' సినిమా షూటింగ్ అవుతుండగా ప్రొడక్షన్ వాళ్ళు వచ్చి 'మీతో ఓ పాట పాడించమన్నారండీ' అని అన్నారు.



వివరం కనుక్కుందామని ఆదుర్తి సుబ్బారావు గారికి ఫోను చేశాను. 'కొత్త వాళ్ళతో తీస్తున్నాం కదా... రెగ్యులర్ వాయిస్‌ల కంటే మీ వాయిస్ అయితే ఎక్స్‌ప్రెసివ్‌గాను, కామెడీటైపుతోను ఉంటుందని అను కున్నాం' అన్నారాయన. సరేనని వెళ్ళి పాడేశాను. అదీ సంగతి'' అని వివరించారు పద్మనాభం.

# జూలీ ఆండ్రూస్

జూలీ ఆండ్రూస్ పేరు తెలియనివాళ్లు కూడా 'మేరీ పాపిన్స్' (1964) లో వేసిన అమ్మాయనో, 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్' (1965) లో వేసిన అమ్మాయనో అంటే ఛట్టున గుర్తు పట్టేస్తారు. తెలుగునాట కూడా విజయదుందుభి మోగించిన 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్' లో చిన్న పిల్లలతో బాటు సమానంగా ఆడి, పాడి అందర్నీ అలరింపజేసిన గవర్నెస్ గా ఆమె వేసిన పాత్రకు పూర్తి న్యాయం చేకూరిందంటే దానికి కారణం - ఆ పాత్ర ఆమెకు చక్కగా సూటవడం, అంతకంటె చక్కగా పాడగలగడం!



ప్రౌఢ జూలీ

నిజానికి 'డార్లింగ్ లిలీ' (1970), 'విక్టర్ / విక్టోరియా' (1982) వంటి సినిమాలలో జూలీ చక్కటి హాస్య నటన కూడా కనబర్చింది. ఆస్కార్ నామినేషన్ లభించిన 'విక్టర్ / విక్టోరియా' లో జూలీ మగ వాడి వేషంలో కూడా కనబడుతుంది. అయినా 'మేరీ పాపిన్స్' ఇమేజి ఆమె కెరియర్ మొత్తం వెంటనంటే వుండటం ఆమె భర్త బ్లేక్ ఎడ్వర్డ్స్‌కు నచ్చలేదు. అతను రచయిత, డైరక్టరు కూడా. ఆ ఇమేజి తుడిచివేయడానికి అతను జూలీ ఛాతీని నగ్నంగా చూపించాడు S.O.B. అనే 1981 నాటి చిత్రంలో. హాలీవుడ్ మీద సెటైర్‌గా తీసిన ఆ సినిమాలో ఓ ప్రొడ్యూసరు తన ఫెయిలయిన తన సినిమాకు మసాలా చేర్చాలని హీరోయిన్ (అతని భార్య కూడా) చేత ఇటువంటి దృశ్యాలు నటింపజేసి చేరుస్తాడు. అది ఎడ్వర్డ్ కసి కొద్దీ తీసిన ఆటోబయాగ్రఫికల్ సినిమా అనిపించింది జనాలకి.



అల్లరిపిల్లల్లో అల్లరి పిల్లగా - 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్' లో జూలీ

జూలీ, ఎడ్వర్డ్ మొదటిసారిగా 'డార్లింగ్ లిలీ' లో పరిచయమయ్యారు. రాక్ హడ్సన్ హీరోగా నటించిన ఈ మ్యూజికల్‌కు దర్శకత్వం వహించిన ఎడ్వర్డ్‌ను జూలీ ప్రేమించి పెళ్లి చేసుకుంది. ఆ తరువాత ఎక్కువగా ఆమె తన భర్త సినిమాలలోనే నటించింది. అంతకు ముందు ఆమె నటించిన 'ది అమెరికనైజేషన్ ఆఫ్ ఎమిలీ' (1964), 'హవాయి' (1966) చిత్రాలు మంచి పేరే తెచ్చిపెట్టాయి. ఆల్‌ఫ్రెడ్ హిచ్‌కాక్ దర్శకత్వంలో చేసిన 'టోర్న్ కర్టన్' (1966) నిరాశనే మిగిల్చింది. 'మై ఫెయిర్ లేడీ' నాటకాన్ని స్టేజి మీద ప్రదర్శించినప్పుడు జూలీ ఆండ్రూసే వేసినా సినిమాకు వచ్చేసరికి ఆమెను తీసుకోలేదు. ఆ పాత్రకు జూలీ అందం సరిపోదనుకుని పాట పాడడం రాకపోయినా ఫర్వాలేదని ఆడ్రీ హెప్‌బర్న్‌ని తీసుకున్నారు.

'సౌండ్ ఆఫ్ మ్యూజిక్' వంటి గొప్ప హిట్ ఇచ్చిన రాబర్ట్ వైజ్ దర్శకత్వంలో మూడేళ్ల తర్వాత 'ది స్టార్'(1968) అనే సినిమా చేస్తే అదీ దెబ్బతింది. జెర్‌ట్రూడ్ లారెన్స్ అనే రంగస్థల నటి జీవితం ఆధారంగా తీసిన ఈ సినిమాలో ఎంత ప్రయత్నించినా జూలీ ప్రాణం పోయలేకపోయింది. జూలీ నటించిన ఇతర చిత్రాలలో 'థరోలీ మోడర్న్ మిల్లీ' (1967), 'ది టామరిండ్ సీడ్' (1974), '10' (1979), 'లిటిల్ మిస్ మార్కర్' (1980), 'ది మాన్‌హూ లవ్డ్ విమెన్' (1983), 'డ్యూయెట్ ఫర్ వన్' (1986), 'దట్స్ లైఫ్' (1986). కాస్త విశ్రాంతి తీసుకుని 1992లో 'జూలీ' అనే టీవీ సిట్‌కామ్‌లో నటిస్తే అదీ పెద్దగా ప్రజాదరణ పొందలేదు. అదే సంవత్సరంలో వచ్చిన 'ఎ ఫైన్ రొమాన్స్' కూడా అంతంత మాత్రం గానే నడిచింది.

తెరజీవితం ఇక చాలనుకున్న జూలీ ఆండ్రూ నేషనల్ కాన్సర్ట్ ట్రూప్‌లో చేరి కచ్చేరీలు ఇస్తూ ఉంటుంది.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

## మ్యూజికల్ అనగానే గుర్తుకువచ్చే 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్'

అల్లరిపిల్లలు కొంతమందిని పాటలతో మురిపించి, వారిని సన్మార్గంలో పెట్టి వాళ్ల గార్డియన్ మనసు దోచుకునే టీచరమ్మ థీమ్‌ను పాప్యులరైజ్ చేసిన సినిమా - 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్'. భారతదేశంలో కూడా సూపర్ హిట్ అయిన ఈ సినిమాకు ప్రపంచమంతా ఆదరణ లభించింది.


సంగీతమే జీవితంగా బతికిన మేరియాగా జూలీ ఆండ్రూస్

ఈ కథ ఇనిస్పిరేషన్‌తో వివిధ భాషల్లో అనేక వెర్షన్లు తయా రయ్యాయి.అయితే కథకు నేపథ్యం మాత్రం మార్చుకోవలసి వచ్చింది. ఎందుకంటే అసలు కథకు రంగభూమి రెండో ప్రపంచ యుద్ధకాలంలోని ఆస్ట్రియా. మిలటరీ మనిషైన వాన్ ట్రాప్‌కి బోల్డంత మంది పిల్లలు. భార్యపోయింది. పిల్లలు తండ్రి ముందు డిసిప్లిన్ నటించే రాలుగాయలు. వచ్చిన టీచర్లంతా పారిపోతూ ఉంటారు. ఎవర్నైనా గవర్నెస్‌ను పంపమని ఓ చర్చిని కోరతాడు తండ్రి.

అక్కడ మేరియా అనే ఒక నన్ (క్రిస్టియన్ సన్యాసిని) చర్చిలో వాళ్లందరికీ తలకాయ నొప్పిగా ఉంటుంది. బొత్తిగా డిసిప్లిన్ లేకుండా, హాయిగా పాటలు పాడుకుంటూ ఉంటుంది. చర్చివాళ్లు ఈ మేరియాను వాన్ ట్రాప్ కుటుంబం మీదకు తోలతారు. ఆమె అక్కడ పిల్లలతో కలిసి అల్లరి చేస్తూ, వాళ్లకు సంగీతం నేర్పి వాళ్లను ఆకట్టుకుంటుంది. వాళ్లను చక్కగా తీర్చిదిద్దుతుంది. తండ్రి చాలా ఇంప్రెస్ అవుతాడు. మేరియాను పెళ్లాడతాడు. కథ ఇక్కడతో ఆగిపోతే డ్రామా ఉండేది కాదేమో, అందువల్ల యుద్ధప్రభావం కూడా చేర్చారు.

ఆ సమయంలో హిట్లర్ సారథ్యంలో నాజీలు ఆస్ట్రియాను ఆక్రమిస్తారు. మిలటరీ మనిషైన వాన్ ట్రాప్‌ను నాజీసైన్యంలో చేరమని ఒత్తిడి చేస్తారు. పొరుగున ఉన్న స్విజర్లండ్ పారిపోతే, అది తటస్థరాజ్యం కాబట్టి, ఇబ్బంది ఉండదు. మరి మిలటరీ కాపలా నుండి పారిపోవడం ఎలా? దానికీ సంగీతమే అక్కరకు వస్తుంది. ఊరిలో ఏర్పాటు చేసిన సంగీత సభలో వాన్ ట్రాప్ కుటుంబం మొత్తం పాడుతూ, పాడుతూ చీకటిలో కనుమరుగయి పోతారు. మిలటరీ వాళ్ల కన్నుగప్పి స్విజర్లండ్ చేరతారు.


కథానాయకుడు వాన్ ట్రాప్‌గా క్రిస్టఫర్ ప్లమర్, అతని మనసు దోచిన గవర్నెస్‌గా జూలీ - క్లయిమాక్స్ దృశ్యాలలో

మరి మన భాషల్లో తీసినప్పుడు యుద్ధసన్నివేశం అతకదు కదా! అందువల్ల తమిళ సినిమా - 'శాంతినిలయం' (కాంచన, జెమినీ గణేశన్) తీసినప్పుడు హీరోకు మొదటి భార్య ఉన్నట్టు, ఆమె భూతంలా తిరుగుతున్నట్టు కాస్త డ్రామా పెట్టారు. దీన్ని 'తల్లిని మించిన తల్లి' పేరుతో తెలుగులోకి డబ్ చేశారు. హిందీలో వచ్చేసరికి గుల్జార్ 'పరిచయ్' తీస్తూ పిల్లలు తాతగారి సంరక్షణలో పెరిగినట్టు మార్చారు. అతనికి, పిల్లల తండ్రికి గల అభిప్రాయభేదాల ద్వారా నాటకీయత సృష్టించారు. టీచరు అమ్మాయి కాదు, అబ్బాయి. (జితేంద్ర) పిల్లలలో పెద్దమ్మాయి (జయబాధురి)ని పెళ్లాడతాడు. తెలుగులో 'రావుగారిల్లు' కూడా 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్' వల్ల ఇన్‌స్పైరయినదే!

'సౌండ్ ఆఫ్ మ్యూజిక్' పాటల గురించి సంగీతప్రియులకు వేరే చెప్పనవసరం లేదు. 'డో రే మీ' ను 'ఆదర్శకుటుంబం' లో వాడుకున్నారు. ఆ పాటకు దీటుగా గుల్‌జార్ 'సారేకే సారే గామాకో లేకర్..' అని 'పరిచయ్'లో చక్కటి పాట రాశారు.

- కమ్యూనికేటర్ ఫీచర్స్

---

జస్ట్ ఫర్ ఫన్

## క్షణక్షణముల్....

భార్యాభర్తల మధ్య పెద్ద జగడం జరిగింది. భార్య అలిగి కూచుంది. భర్త కూడా చాలాసేపు మాట్లాడకుండా కూచున్నాడు కానీ చివరికి దిగివచ్చాడు. గొంతు సవరించుకుని, "చూడు శాంతా, మనిద్దరి మధ్య జరిగిన వాదోపవాదాల గురించి నేను బాగా ఆలోచించాను.." అని ఆగాడు.



పుస్తకం చదువుకుంటున్నట్టు నటిస్తున్న భార్యామణి తలెత్తి, 'అయితే ఏమిటన్నట్టు' చూసింది.

భర్త పెదాలు తడుపుకుని "అదే..ఆలోచించి చూస్తే..నువ్వు చెప్పినదాంట్లోనూ సబబున్నట్టుంది. నేను నీ అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను.' అన్నాడు. అనేసి 'హమ్మయ్య' అనుకున్నాడు.

కానీ భార్య మొహం మీద వెలుగు రాలేదు. 'అదేం లాభం లేదు. ఇప్పుడు నేను మనసు మార్చుకున్నాను.' అని హుంకరించింది.

-విద్యాపతి

# భద్రం.. బి... కేర్‌ఫుల్

**- గొళ్ళమూడి పద్మజ**

(విధాత తలొంచుకుని విధి వ్రాతలు రాస్తున్నాడు. వీణాధరి టీ, పాలు, నీళ్ళు, జ్యూస్‌లు టైమ్ ప్రకారం అందిస్తోంది)

పదేళ్ళ భద్రం, బామ్మ సుభద్రమ్మతో సిన్మా చూస్తున్నాడు. కుంభకర్ణుణ్ణి నిద్రలేపే సీనది. పొట్టమీద శూలాలు గుచ్చినా, చెవుల్లో ఏనుగులు ఘీంకారాలు చేసినా నిద్రలేవని కుంభకర్ణుడు ముక్కుదగ్గర లడ్డూలు పెట్టగానే లేచాడు. అంత మొద్దు నిద్రలోనూ పిండివంటల ఘుమఘుమలు ఎలా సోకాయి? అని సందేహం వచ్చింది భద్రానికి. అదే ప్రశ్న బామ్మని అడిగాడు. "అదేం ప్రశ్నరా? నిద్రపోయేప్పుడు మనం కళ్ళు మూసుకుంటాం గాని ముక్కు మూసుకోం కదురా?" అని విసుక్కుందామె. భద్రానికి సరైన సమాధానం దొరకలేదే అని అసంతృప్తి కల్గింది.

ఇంటికొచ్చాక బామ్మ రోజులాగే మనమడ్ని నిద్రపుచ్చుతూ "జో అచ్యుతానంద" పాడింది. భద్రానికి నిద్ర పట్టలేదు. "రామాలాలీ" పాడింది. భద్రం నిద్రపోవట్లేదని చూసి "అసలే రేపు తొలి ఏకాదశిరా. తెల్లారగట్లే లేవాలి పడుకో" అని విసుక్కుని నల్లమందు మింగి పడుకుంది.

సుభద్రమ్మకి 'ఇన్సోమ్నియా' అనే నిద్రపట్టని జబ్బు వుంది. భద్రం తల్లి 'సోమ్నాంబులిజమ్' (నిద్రలో నడిచే అలవాటున్న జబ్బు)తో డాబా మీద నుంచి పడిపోయి కన్నుమూసింది. అప్పటినుంచి సుభద్రమ్మే భద్రాన్ని జోలపాటలు పాడుతూ కంటికి రెప్పలా కాపాడుకుంటోంది. భద్రం తండ్రికి 'నార్కోలెప్సీ' అనే ఎక్కడ పడితే అక్కడ ఎప్పుడూ పడితే అప్పుడు సడన్‌గా నిద్రముంచుకొచ్చేసే జబ్బుంది. భార్యపోయిన విచారంతో, యీ జబ్బుతో మతిపోయిన వాడిలా ఒక గదిలో కూచుని మందు సేవిస్తూ వుంటాడు.

మర్నాడు కోడికంటే ముందే నిద్రలేచి ఇద్దరూ గుడికి వెళ్ళారు. గూడ్సు బండిలా మెల్లగా కదులుతున్న క్యూలో నిలబడ్డారు.

"బామ్మా తొలి ఏకాదశి అంటే ఏంటి?" అడిగాడు భద్రం.

"విష్ణుమూర్తి యీ రోజు నిద్రపోవడం మొదలు పెడ్తాడు. మళ్ళీ ఉత్తరాయణంలో లేస్తాడు. నిద్రలోనే భక్తుల్ని ఓ కంట కనిపెడ్తూంటాడు. అందుకే మనం శ్రావణ, భాద్రపద, ఆశ్వయుజ, కార్తీకాల్లో బాగా పూజలూ, వ్రతాలూ చేస్తుండాలి" చెప్పింది బామ్మ.

"నిద్రపోతున్న వాడెలా చూస్తాడు బామ్మా? దొంగ నిద్రంటావా?"

"వేలేడు లేవు భడవా! అలా అనకూడదు. యోగ నిద్రంటారు. కళ్ళు మూసుకున్నా అంతర్నేత్రంతో చూస్తాడన్న మాట"

"అంతర్నేత్రం అంటే?"

"అంతర్నేత్రం అంటే ఆ నామం వెనకాల వుంటుందిలే. మనకి కనపడదు. అబ్బ!.... నీకన్నీ సందేహాలే.... పద.... పద..." అని భద్రాన్ని ముందుకు తోసింది.

దర్శనం చేసుకుని యింటికి వచ్చేశారు. భద్రానికి ఆ రాత్రి కూడా నిద్రపట్టలేదు. అమ్మ, నాన్న, బామ్మ వీళ్ళందరికీ నిద్రకి సంబంధించిన జబ్బులున్నాయి. కుంభకర్ణుడి నిద్ర, విష్ణుమూర్తి యోగ నిద్ర చూస్తుంటే రాక్షసులకి, దేవుళ్ళకి కూడా యీ జబ్బులున్నట్టున్నాయి. ఏమిటి యిన్ని రకాల నిద్రలు? పెద్దయ్యాక నిద్ర గురించి రీసెర్చి చెయ్యాలి అనుకుంటూ కలత నిద్రపోయాడు.

కలత నిద్ర వల్ల నలతగా వుండి మర్నాడు సైకిల్ మీద స్కూల్‌కెళ్తూ రోడ్డున పోయే రోశయ్యకి డాష్ కొట్టి పడిపోయాడు. వెంటనే డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాడు రోశయ్య. డాక్టర్ భద్రానికి కట్టుకడ్తూ ఎవరితోనో చెప్తున్నాడు. "మీకు తెలీందేముంది. జాగ్రత్త పడాలండి. శరీరంలో ఏ సెల్స్ డిస్ట్రాయ్ అయినా వేరే సెల్స్ డివైడ్ అయ్యి వాటిని రీప్లేస్ చేస్తాయి. కాని న్యూరాన్స్‌కి డివైడ్ అయ్యేగుణం వుండదు కాబట్టి కొన్ని న్యూరాన్స్ డిస్ట్రాయ్ అయినా సివియర్ న్యూరలాజికల్ డెఫిసిట్ వస్తుంది"

"నూరాన్స్ అంటే ఏంటి డాక్టర్? అవేం చేస్తాయి?" కుతూహలంగా అడిగాడు భద్రం.

డాక్టర్ ఆశ్చర్యపోతూనే "న్యూరాన్స్ ఇన్ఫర్మేషన్ని రిసీవ్ చేసుకుని స్టోర్ చేసుకుని మళ్ళీ ట్రాన్స్‌మిట్ చేస్తాయి" అని చెప్పాడు.

"న్యూరాన్స్‌కి నిద్రకి ఏదైనా సంబంధం వుందా డాక్టర్? నేను పెద్దయ్యాక నిద్ర గురించి రీసెర్చి చెయ్యాలనుకుంటున్నాను" అని చెప్తున్న ఆ పిల్లవాడి యింట్రస్ట్‌కి డాక్టర్ ముచ్చటపడిపోయి "నీకు నేను సహకరిస్తానని" హామీ యిచ్చాడు.

ఆ డాక్టర్ సహకారంతో చదువు పూర్తి చేశాడు భద్రం. ఒక రోజు ఆరింటికే ఆకులు ముడుచుకుంటున్న నిద్రగన్నేరు చెట్టు కింద కూచుని ఏదో ఆలోచించుకుంటున్న భద్రంతో సుభద్రమ్మ "వీధిలో ముగ్గేద్దామంటే సయాటిక్కు రోగంతో కాలు వంగదు. గదుల్లో లైట్లు వేద్దామంటే స్పాండిలైటు రోగంతో స్విచ్‌లు వెయ్యలేక



పోతున్నానురా. పెళ్ళి చేసుకో ఇంట్లో లైట్లు వెలుగుతాయి" అంది.

"లైట్లేగా నే వేస్తాలే బామ్మా", అన్నాడు పరధ్యానంగా భద్రం.

"లైట్లు వేస్తావు సరే మరి ముగ్గో?"

వీధిలో ముగ్గులేస్తూ కూచుంటే తన రీసెర్చో? అమ్మో! కాస్త ఆలోచించి "ఊ... సరే" అన్నాడు.

"అయితే రేపే గుదిబండల వారి పిల్లని చూడ్డానికెళ్దాం" అంది సుభద్రమ్మ సంతోషంగా.

గుదిబండల గున్నయ్యగారి కూతురంటే గుండ్రాయిలా వుంటుందేమో అనుకున్నాడు భద్రం. కాని, పెళ్ళి చూపుల్లో బాపు బొమ్మని తలదన్నేంత అందంతో, వయ్యారంగా కూచుని ఊర్మిళ 'పాల కడలిపై శేషతల్పమున' పాట అద్భుతంగా పాడింది. సుభద్రమ్మ జలజలామని ఆనంద బాష్పాలు రాల్చింది. భద్రం రెప్పవేయడమే మర్చిపోయి చూస్తున్నాడు. ఇద్దరూ ఒకేసారి ఓ.కే. అనేశారు.



వెంటనే ఊర్మిళ తండ్రి గున్నయ్య వలవలా ఏడ్చేశాడు. తల్లి గున్నమ్మ ఎక్కిళ్ళతో భర్తకి వంత పాడింది. "చిన్న రిక్వెస్టండీ! ముహూర్తం పగలే పెట్టాలి. మా అమ్మాయి పేరులోనే కాదు, పోలికలో కూడా ఊర్మిళాదేవే. రాత్రి ఏడుగంటలకే నిద్రపోయి పొద్దున్న తొమ్మిది గంటలకి లేస్తుంది. ఎంత మంది డాక్టర్లకి చూపించినా యీ జబ్బుకింక మందేలేదన్నారు. అర్థం చేసుకోండి ప్లీజ్!" గద్గద స్వరంతో అన్నాడు గున్నయ్య.

'అంటే పద్నాలుగు గంటలా!' ముందు కాస్త నిర్ఘాంతపోయినా తన రీసెర్చికి పనికొస్తుందిలే అనుకుని "ఊఁ" అన్నాడు భద్రం.

మరి పొద్దున్నే ముగ్గెవరేస్తారు? రాత్రి లైట్లు ఎవరు ఆర్పుతారు? లాంటి సందేహాలతో సతమతమవుతున్నా భద్రం "ఊ" అన్నాడు కదాని ఊర్మిళలో లోపాన్ని అంగీకరించింది సుభద్రమ్మ.

వారంలో పెళ్ళయి పోయింది. ఏడాది తిరక్కుండా యిద్దరాడ పిల్లలకి తండ్రయ్యాడు భద్రం. తెల్లకలువ మొగ్గల్లా వున్న కవల పిల్లలిద్దరికీ సుషుమ్న, జాగృతి అని పేర్లు పెట్టుకున్నాడు.

కాలం బుడబుక్కలవాని చేతిలో వాయిద్యంలా గబుక్కున తిరిగిపోయింది.

పిల్లలిద్దరూ ఏడు హేపీ బర్త్‌డేలు చేసుకున్నారు. భద్రం రిసెర్చ్ పూర్తయి 'భద్రమైన నిద్ర' అనే పుస్తకం రాసి "డా॥ నిద్రక భద్ర' అనే బిరుదు సంపాదించాడు. 'భద్రా జోలా' అనే మందు కనిపెట్టి 'అంతర్నేత్రం' అనే క్లినిక్ పెట్టి, స్లీపింగ్ డిజార్డర్స్ వున్న వాళ్ళకి ట్రీట్‌మెంట్ చేసన్తా పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు. పెరటి చెట్టు వైద్యానికి పనికి రాదన్నట్టు ఊర్మిళ నిద్రని మాత్రం మాన్పించలేక పోయాడు.

(బ్లాక్ టీ తీసుకొచ్చి సిరాబుడ్డిని కాస్త పక్కకు జరిపి అక్కడ పెట్టింది వాగ్దేవి. ఇది గమనించని విరించి తలొంచుకుని రచిస్తూ కలాన్ని బ్లాక్ టీలో ముంచి రాయడం కంటిన్యూ చేశాడు. దాని ఫలితంగా....)

పుర ప్రముఖులందరూ చర్చించుకుంటున్న భద్రం ఖ్యాతి విని, అదే వూళ్ళో మాటల గారడితో గాఢ నిద్రలోకి పంపే హిప్నాటిస్ట్ 'అబ్రకదబ్ర' అబ్రకదబ్ర పేషెంటులా మారువేషంలో వచ్చి సుభద్రమ్మని తన గారడి మాటల మైకంలో పడేసి "మీరంతా యింత వుత్సాహంగా ఆరోగ్యంగా వుండడానికి, మీ మనమడి సక్సెస్‌కి కారణం ఏమిటని" అడిగాడు. "అన్నిటికీ కారణం మా యింట్లో టి.వి. లేక పోవడమే"అని తమ 'యింటిగుట్టు' చెప్పేసింది. అదే తమ 'క్లినిక్‌కి చేటు' గారికి అసూయతో నిద్ర దూరమైంది. భద్రం యిస్తున్న సెడెటివ్స్, హిప్నటిక్స్, హానికరమైన సైడ్ ఎఫెక్ట్‌కల మందులని, అవి వాడటం వల్ల కను రెప్పలు, పెదవులు వాస్తున్నాయని పుకారు పుట్టించాడు. దాంతో 'అంతర్నేత్రం' క్లినిక్‌కి రోగులు రావడం తగ్గించేశారు.

"పొరుగు పచ్చచూసి ఓర్వలేక పోవడం, తన యింట్లో వెలుగు నింపుకోవడం కోసం మరో యింటిదీపం ఆర్పేయడం, త్రేతా, ద్వాపర యుగాల్లోనే వున్నాయిరా. రామాయణ మహాభారతాల్లో కూడా వున్నదదేగా" అని ఓదార్చింది సుభద్రమ్మ మనమడిని.

పుకార్లు వుల్లికారంలా కాస్సేపు మంట పుట్టిస్తాయి అంతే, తరువాత మేలే చేస్తాయి. నిజాయితీకి ఎప్పటికైనా గుర్తింపు వుంటుందని సర్దిచెప్పుకున్నాడు భద్రం. తను కనిపెట్టిన మందు 'భద్రాజోలా'ని యింప్రూవ్ చెయ్యాలంటే ప్రపంచ పర్యటన తప్పదని భావించాడు. ఆరు నెలలు పర్యటన చెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

భద్రం యింట్లో లేని సమయంలో

అవుతుందని అనుకోలేదామె.

మర్నాడు అబ్రకదబ్ర ఖరీదైన కలర్ టి.వి. కొని అతని నమ్మిన బంటు చేత భద్రం యింటికి పంపించాడు. ట్రీట్‌మెంట్ చేసినందుకు కానుకగా సమర్పిస్తున్నానని వినయంగా బొంకి సుభద్రమ్మ కాళ్ళకి మొక్కి చక్కగా నటించాడు బంటు. సుభద్రమ్మ కాదనలేక కానుక స్వీకరించింది. భద్రం విదేశీ పర్యటన ఏర్పాట్ల హడావిడిలో యిదేమీ గమనించలేదు.

మర్నాడే ఈశ్వరుడికి అభిషేకం చేయించు కుని ఈశాన్యాన్న దేశాలలో యాత్ర మొదలు పెట్టాడు. నేపాలీస్, భూటానీస్, చైనీస్, జపనీస్ అందరూ పగలంతా చురుగ్గా పనిచేసి రాత్రిళ్ళు హాయిగా నిద్రపోవడం గమనించాడు. ఇంగ్లండ్ అమెరికాల్లో ఎక్కడా ఆశమ్మలు బోశమ్మలు కాని, జంక్షన్స్‌లో నిలబడి వాల్‌పోస్టర్స్ చూస్తూ పోచికోలు కబుర్లు చెప్పుకునే కుర్రకారు కాని కన్పడలేదు. ఎటు చూసినా కార్లతో పరుగులు పెడుతూ బిజీబీలను తలపించే వాళ్ళే.

ఏ దేశమేగినా ఎందుకాలిడినా తన పరిశోధనకి తన జన్మభూమే తగిన స్థల మన్పించింది భద్రానికి. ఇంటికి ఫోను చేసి తను ఫలానా తేదీ ఫలానా టైమ్‌కి వస్తున్నానని చెప్పాడు.

ఎయిర్‌పోర్ట్‌లో తనకి వెల్‌కమ్ చెప్పడానికి బామ్మ, భార్య, కూతుళ్ళు పూల దండలతో తప్పకుండా వస్తారని వూహించుకుంటూ విమానం దిగాడు. కళ్ళింతింత చేసుకుని ఎంత వెదికినా.... ఎక్కడా... ఎవరూ కన్పించలేదు. ఎలా వస్తారు? అతను చెప్పిన ఫలానా తేదీ, ఫలానా టైమ్‌లో ఫలానా ఛానెల్‌లో ఫలానా ప్రోగ్రామ్ వుంటే?

మొహం వేళ్ళాడేసుకుని యీసురోమంటూ కాళ్ళీడ్చుకుంటూ ఒక్కడే యింటికి చేరాడు. కనీసం ఇంటి గేటు వద్ద కూడా ఎవరూ వెల్‌కమ్ చెప్పలేదు. ఇంట్లో అంతా కోలాహలంగా వుంది. లోపల్నించి పెద్దపెద్దగా ఏవో మాటలు విన్పిస్తున్నాయి. 'బహుశ తన కోసం ఏదైనా పార్టీ ఎరేంజ్ చేశారామో' అనుకుని మురిసిపోతూ లోపలికొచ్చాడు. అతని కుటుంబ సభ్యులందరూ గ్రూపు ఫొటోలోలాగ కూచుని వున్నారు. అతన్నిచూసి 'హాయ్' అని పల్కరించి మళ్ళీ టి.వి. వైపు ముఖాలు తిప్పేసుకున్నారు.

"ఏంటర్రా ఎవరూ మాట్లాడరు? మౌన వ్రతమా? లేక ఏమైనా స్ట్రయికా? ఓహో! ఇదంతా మెదళ్ళు దొలిచే యీ భూతాల పెట్టె మహిమ!" అని టి.వి స్విచ్ ఆఫ్ చేశాడు. అంతవరకూ లాక్ అయి వున్న అందరి నోళ్ళూ ఒక్కసారి తెరుచుకున్నాయి.

"అలా అంటావేంటిరా భద్రం? 'నేటి బొమ్మలు' ప్రోగ్రాం అద్భుతం అనుకో. ఈ



**గ్యాస్ సిలిండరో, కొరియర్ లెటరో వచ్చినప్పుడు మాత్రమే కలం గుర్తొచ్చే నాలో కుంభకర్ణుడిలా నిద్ర పోతున్న రచనా శక్తిని 'హాసం' వారు మేల్కొలిపారు. సిత్రంగా నా కథకు అభినందనల వుత్తరాలు దొరికాయి. నా మనసులో మొలకెత్తిన చెట్టు పూలను ఎక్కడెక్కడో ఎంతో దూరాన వున్న ఎందరెందరికో అందచేసిన 'హాసం' వారికి నా కృతజ్ఞతలు. ఎలా... ఎలా... ఎలా... ఎలా తెలుపను?**

**- జి.పద్మజ,**
**308, పృథ్వి ఎమరాల్డ్, 1-1-520,**
**న్యూబాకారం, గాంధీనగర్, హైదరాబాద్**

కాలంలో రోళ్ళూ రోకళ్ళూ లేవని బాధపడకండి. మిక్సీ ఆన్ చేసి దంపుడు పాట యిలా పాడుకోండి అని చూపించార్రా.....

మిక్సీ వెయ్యావే చెట్నీ చెయ్యావే ఓ యమ్మా!
శనగల్లో చేరెడు కొబ్బరి వెయ్యావే ఆఁ హుఁ
... ఆఁ.... హు.... దంపుతున్నట్టుగా చేతులూపుతూ పెద్దపులి గాండ్రించినట్టు పాడుతోంది సుభద్రమ్మ. మంద్రస్వరంతో జోల పాటలు పాడే బామ్మ నోటెంట ఆ పాట విని ముఖం చిట్లించుకున్నాడు భద్రం.

"ఏమండీ 'రేపటి అమ్మమ్మలు' యింకో యిరవై ఏళ్ళ తర్వాత అమ్మమ్మలు కాబోయే వాళ్ళకి మొహం మీద ముడతలు, గీతలు రాకుండా చిట్కాలు చెప్తున్నారండీ. తుమ్మజిగురు, బంకమట్టి కలిపి రాసుకోవాలిట" అని చెప్తున్న ఊర్మిళని చూసి కెవ్వున కేకవేశాడు భద్రం "ఏమిటి ఊర్మీ యిలా ఊరి పోయావ్?" టి.వి. ముందు మహానైవేద్యం పెట్టినట్టు ఒక పళ్ళెంలో వున్న చిప్స్, బోండా, స్వీట్లు, ఫ్రూట్లు అతనికి సమాధానం చెప్పాయి. ఇదేం పట్టించుకోకుండా ఏదో మైకంలో వున్నదానిలా "రాత్రి పదకొండు గంట్లకొచ్చే "కన్నీటి ధార'' ధారావాహికం ఎంత బావుందను కున్నారు..." ఏదో చెప్పబోతున్న ఊర్మిళని చూస్తూ 'ఏడింటికే గుడ్‌నైట్ చెప్పేసే తన భార్యేనా?" అనుకుని షాక్ తిన్నట్టుగా బిగుసుకుపోయాడు.

"డాడీ.... డాడీ.... నా మాట విను మరీ.... తై తై బేబీ తకతై సూపర్‌గా వుంటుందిలే..." అంది సుషుమ్న. 'మేం రోజూ ప్రాక్టీస్ చేస్తున్నాంగా చూడు..." అష్టవంకరలతో ఒక భయంకరమైన పోజు పెట్టింది జాగృతి. 'గో టు బెడ్ ఎర్లీ వేకప్ విత్ జాయ్' అంటూ ముద్దుగా పాడే పాలబుగ్గల చిన్నారులేనా వీళ్ళు? వీళ్ళ మతి గతి తప్పుతోంది" అనుకున్నాడు భద్రం పళ్ళు పటపటకొరుకుతూ.

"ఏంట్రా అబ్బాయ్ టి.వి. కట్టేశావ్? ఇప్పుడు 'ఉడుం పట్టు' సీరియల్ వస్తుందిరా'' అని లేచి టి.వి. ఆన్ చేశాడు భద్రం తండ్రి. ముప్పయ్ ఏళ్ళ తర్వాత తన తండ్రి నోరువిప్పి మాట్లాడ్డం చూసి కళ్ళు తిరిగిపడిపోయాడు భద్రం.

మెల్లమెల్లగా స్పృహలో కొస్తున్న అతనికి లీలగా ఏదో విన్పిస్తోంది. "డాడీ... డాడీ ఏంటలా పడిపోయావ్? విను... నువ్వంత కష్టపడి మందులు కనిపెట్టక్కర్లేకుండా మేమిద్దరం కనిపెట్టేశాంగా! మమ్మీలాగ ఏడింటికే నిద్రపోయే వాళ్ళకి టి.వి. పెడ్తే చాలు నిద్ర ఎగిరిపోతుంది. నిద్ర పట్టని వాళ్ళకి పుస్తకం యిస్తే చాలు నిద్రొచ్చేస్తుంది... బావుందా డాడీ.... మా మందు" పిల్లలిద్దరూ నవ్వుతూ చెప్తున్న మాటలు విని మళ్ళీ స్పృహకోల్పోయాడు.

బుల్లి తెరమీద పిల్లి కళ్ళ హీరోయిన్ విగ్గు విరబోసుకుని అరువు గొంతుతో చేస్తున్న వికట్టాటహాసం అతని కర్ణభేరిని ఛేదించి అంతర్నేత్రాన్ని పాడి చేసింది.

నకిలీ మీసాలు, నల్లకళ్ళ జోడుతో అప్పుడే అక్కడకు వచ్చిన అబ్రకదబ్ర "వన్ బై వన్ వీళ్ళంతా నా క్లినిక్కి రావడం ష్యూర్'' అనుకుని మనసులోనే వికటాట్ట హాసం చేసుకున్నాడు.

'భారతీ, తలభారంగా వుంది మరొక్క స్ట్రాంగ్...' అడిగాడు బ్రహ్మయ్య. అబ్బ! పూర్తిగా ఒక్క కీర్తన కూడా వాయించుకోనియ్యరు కదా. టీలు తాగడం ఎందుకు? ఒరాసిడ్ వేసుకుని 'ఉపశమించినది' అని అనడం ఎందుకు? పాలు తాగండిక నుంచి" విసుక్కుంటూ లేచి రెండు పాత్రల్లో పాలు రెండు పాత్రల్లో నీళ్ళు తెచ్చింది చతుర్భుజ.

ఓ విధాతా! కలాన్ని యీసారి పాలముంచు తావో... నీట ముంచుతావో... భద్రం అను కున్నాడు అక్కడే వున్న నారదుడు.

ఇదంతా ఇంటర్నెట్‌లో... సారీ... అంతర్నేత్రంతో వాచ్ చేస్తూ.... "ఎగ్జామ్ హాల్లో స్టూడెంట్‌లా ఏంటయ్యా బ్రహ్మయ్యా యీ పొరపాట్లు? చతుర్ముఖుడవై వుండీ అఁ....? పని యెడల నిమగ్నత అవసరమే కాని పరిసరాల యెడల కాస్త స్పృహ.... పరికరాల పట్ల అప్రమత్తత కూడా వుండాలి సుమా! భద్రం బ్రతుకు... భద్రం... బికేర్‌ఫుల్..." అంటూ ఆకాశవాణి ద్వారా వారించాడు వారిజాక్షుడు.




అక్కినేని, అంజలీదేవి, జమున హీరో హీరోయిన్లుగా ఎల్.వి. ప్రసాద్ నిర్మాణ పర్యవేక్షణలో, డి.యోగానంద్ దర్శకత్వంలో 1956లో వచ్చిన 'ఇలవేలుపు' సినిమా పేరు చెప్పగానే చటుక్కున స్ఫురించే పాట - 'చల్లని రాజా ఓ చందమామ'.
విడుదలయి నలభై ఆరేళ్ళు పూర్తయినా ఇంకా స్మృతిపథంలో సంపూర్ణంగా మెదులుతోందంటే ఆ పాటకు సంగీతాన్నిచ్చిన సుసర్ల దక్షిణామూర్తికి అగ్రతాంబూలాన్నివ్వాలి. శ్రీశ్రీ, అనిసెట్టి, కొసరాజు, వడ్డాది పాటలను రాయగా, ఆయన సంగీతదర్శకత్వంలో వచ్చిన

# ఇలవేలుపు

'ఇలవేలుపు' చిత్రంలోని ఓ నాలుగు పాటలివి.

సాకీ : నిఖిల భువనపాలం నిత్య తేజో విశాలం
సకల సుగుణ శీలం సచ్చిదానంద రామం
జనగణ మంగళ దాయక రామం - రఘుపతి రాఘవ రాజారామం
1. రోగవినాశకరం శ్రీరాం - భవ బంధములను బాపెడు రామం
భక్తలోక పరిపాలక రామం - శరణు! శరణు! శ్రీ సీతారామం ॥జనగణ॥
సాకీ: ఏకో దేవః కేశవోవా - ఏకో రూపం నిత్య సత్య ప్రదీపం
భావాతీతం రామ నామ స్వరూపం
జనగణ మంగళదాయక రామం - రఘుపతి రాఘవ రాజారామం
2. సర్వధర్మముల సారమె రామం ॥2॥
సకల మతములకు సమతే రామం॥2॥
శాంతిలోని విశ్రాంతియె రామం ॥2॥
శరణు! శరణు! శ్రీ సీతారామం ॥2॥ ॥జనగణ॥
సాకీ : పంచ భూతైక రూపం పావనం రామనామం
ఔషధాతీత తేజం అమృతం రామనామం ॥జనగణ॥



ఈ పాటను పి.లీల పాడగా అంజలీదేవి ప్రధాన పాత్రధారిణిగా అభినయించింది. అమీర్ కళ్యాణి, బేహాగ్, కళ్యాణి రాగఛ్ఛాయలలో ఈ గీతం స్వరపరచబడింది. సినీ భక్తి గీతాలలో చాలావాటిని కాలానికి ఎదురీది నిలబడగలిగే శక్తి ఉన్నా కొన్ని చరణాలు ఆయా సినిమాలకు, పాత్రలకు సంబంధించి ఉండటం సహజం. ఉదాహరణకి 'సీతారామ కళ్యాణం' సినిమాలో 'జగదేక మాతా గౌరి' పాటను పార్వతీ దేవికి సంబంధించిన పూజా సమయాలలోచాలా మంది పేరంటాళ్ళు మొత్తం సాహిత్యంతో సహా పాడుతుంటారు. అందులో 'నా పతికాపద కలుగనీయక' అన్న లైను పాడుకునే ఆవిడ భర్త ఆపదలో ఉన్నా లేకపోయినా చెల్లిపోతుంది. గాని 'నీ పదములను లంకాపతిని  నా పెన్నిధిగా నమ్ముకుంటిని' అన్న లైను అర్థంతెలుకుని పాడితే ఇబ్బందిగా ఉంటుంది. ఇటువంటి ఇబ్బందిని కలుగజేయకుండా ఏ కాలంలో ఎవరు పాడుకున్నా చక్కగా వుండే పాటలకోవలోకి 'జనగణ మంగళ దాయక రామం' పాట చెందుతుంది.



*This feature is sponsored for 6 issues by*
**Sri MANISHARMA** *(music director)*
in memory of his beloved friend
late THIRUPATHI SWAMY *(director)*

ప: నీమము విడి అజ్ఞానముచే పలుబాధలు పడనేల?
సోదరా! ప్రకృతి మాత లేదా?
ఆమెను శరణు వేడరాదా? ॥నీమము॥




చ: భానుకిరణముల ప్రభావమే యీ ప్రపంచమోయన్నా
వాటిలో ప్రాణశక్తిమిన్న రోగముల పారద్రోలునన్నా
దేహమున కెంతో మేలన్నా ॥3॥ ॥నీమము॥



చ: మన్నూ, నీరూ, గాలియుండగా భయమింకేలనన్నా
జగతికే ఆదిశక్తులన్నా - ఆ వే మన ప్రాణతుల్యమన్నా
వ్యాధులిక రావని నమ్మన్నా
దేహముల కెంతో మేలన్నా ॥2॥ ॥నీమము॥

చ: మధురమైన ఫలజాతులనెపుడు మానక తినుమన్నా
మనకిదే చాల ముఖ్యమన్నా వీటిలో ఓ జీవము కలదన్నా
రోగములు చేరవు నిజమన్నా దేహమునకెంతో మేలన్నా




చ: ఆవిరిలోనె పంచభూతములు అమరియున్నవన్నా
ఆవిరికి శక్తి అమితమన్నా అదే మన చలనశక్తియన్నా
వ్యాధులిక రానే రావన్నా
దేహమునకెంతో మేలన్నా ॥2॥ ॥నీమము॥

ఈ పాటను కూడా పి.లీల పాడగా అంజలీదేవి ప్రధాన అంజలీదేవి ప్రధాన పాత్రధారిణిగా అభినయించింది. జాగ్రత్తగా గమనిస్తే ఇవాళ బ్యూటీషియన్లు, డైటీషియన్లు,సూపర్‌స్పెషాలటీ హాస్పిటల్స్‌లోని ఎక్స్పర్ట్ డాక్టర్లు నేచర్‌క్యూర్ హాస్పటల్లో ఇచ్చే సారాంశం ఇదంతా -ఈ పాటలోని నాలుగు చరణాల ద్వారా ఆ రోజుల్లోనే చెప్పారని అనిపిస్తుంది. భవిష్యత్తులో కూడా ఎంతోమందికి ఉపయోగపడగల ఈ పాటను ప్రభుత్వం వారు కూడా గుర్తించి విస్తృతంగా ప్రచారం, ప్రసారం చేయవలసిన అవసరం ఉందని ఈ సమీక్షకుని వ్యక్తిగత అభిప్రాయం. నాస్తిక్ (1954) సినిమాలో సి.రామచంద్ర స్వరపరచగా గీత రచయిత ప్రదీప్ స్వయంగా గానం చేసిన 'దేఖ్ తెరే సన్‌సార్‌కె హాలత్ క్యా హో గయీ భగవాన్, కిత్‌నా బదల్ గయా ఇన్‌సాన్' అనే పాట పల్లవిలోని ట్యూన్‌ని ఈ పాట పల్లవికి ప్రేరణగా వాడుకున్నారు.

చల్లని రాజా ఓ చందమామ ॥చల్లని॥
నీ కథలన్ని తెలిశాయి
ఓ చందమామ నా చందమామ ॥చల్లని॥
పరమేశుని జడలోన చామంతివి
నీలిమేఘాలలో మేటి పూబంతివి
నినుసేవించెద ననుదయచూడవా
ఓ వన్నెల వెన్నెల నా చందమామ ॥చల్లని॥
నిను చూచిన మనసెంతో వికసించుగ
తొలి కోరికలెన్నో చిగురించుగ
ఆశలూరించునే చెలి కనుపించునే
చిరునవ్వుల వెన్నెల కురిపించునే ॥చల్లని॥
ననుచూడవు పిలిచిన మాటాడవు
చినదానను అబలను ప్రియురాలను
నిన్నెకోరెనురా నన్ను కరుణించరా
ఈ వన్నెల కన్నెతొ విహరించరా ॥చల్లని॥



ఈ పాటను లీల, రఘునాధ పాణిగ్రాహి, సుశీల పాడేరు. వడ్డాది రాసిన ఈ పాటను తెరపై అంజలీదేవి, అక్కినేని, జమున అభినయించారు. తెలుగు సినీ సంగీత చరిత్రలో త్రిగళ గీతాలు అతి తక్కువ. అందులో బాగున్నవి. ఆయుఃప్రమాణం అధికంగా కలిగి వున్నవి మరీ మరీ తక్కువ. అటువంటి పాటలను లెక్కించవలసివస్తే ఈ పాటను ఉదహరించకుండా ముందుకు సాగడం కష్టం. భీంప్లాస్ రాగం స్కేల్ ఆధారంగా మలచబడ్డ ఈ పాట ద్వారా రఘునాధ పాణిగ్రాహి అందరికీ తెలిశాడు. ఒరిస్సాకు చెందిన ఈ గాయకుడు ప్రముఖ నృత్య కళాకారిణి సంయుక్తను వివాహం చేసుకున్నాడు. ఆ తరువాత ఆమె సంయుక్తా పాణిగ్రాహిగా ప్రసిద్ధురాలైంది. రఘునాధ పాణిగ్రాహి తెలుగులో పాడినవి తక్కువే అయినా ఈ పాట ద్వారా ఆయన శ్రోతల హృదయంలో చిరస్థాయిగా, స్థిర స్థాయిగా నిలిచిపోయాడు. ఎక్కువగా ఆధ్యాత్మిక వాతావరణంలో బ్రతికే అంజలీదేవి పాత్ర మొదటి చరణాన్ని, ఆమెను ప్రేమించిన అక్కినేని పాత్ర రెండవ చరణాన్ని, అతడిని ప్రేమించే జమున పాత్ర మూడవ చరణాన్ని పాడటం జరుగుతుంది.అభినయించే పాత్రల స్వభావాలు చంద్రుని ఊహించుకుంటూ కథాపరంగా ఎలా స్పందిస్తాయి అన్నదే ఈ పాటలోని సాహిత్య సోయగం.

అన్నా అన్నా విన్నావా
చిన్ని కృష్ణుడు వచ్చాడు
చిన్నీ కృష్ణుడు వచ్చాడు
నా వన్నెల చెలికాడొచ్చాడు ॥అన్నా అన్నా॥
కాళియ మడుగున దూకిన వాడు
ఆపద తొలగి వచ్చాడు
చల్లని చూపుల చూస్తాడు
కన్నుల పండుగ చేస్తాడు ॥అన్నా అన్నా॥
గోకుల మందున గోవిందునితో
గోపికనై విహరిస్తాను
ముద్దుల మూర్తిని కంటాను
మోహన మురళిని వింటాను ॥అన్నా అన్నా॥
బృందావనిలో నందకిశోరుని
చెంతను నాట్యం చేస్తాను
యమునా తీర విహారములో
హాయిగ పరవశమవుతాను ॥అన్నా అన్నా॥



ఈ పాటను జిక్కి పాడగా తెరపై జమున, రేలంగి అభినయించారు. కథాపరంగా చనిపోయాడనుకున్న కథానాయకుడు బ్రతికున్నాడని, ఇంటికి తిరిగొస్తున్నాడని తెలిసి అతనిని ప్రేమించిన అమ్మాయి ఆ ఆనందాన్ని తన సోదరునితో పంచుకుంటూ పాడే సన్నివేశానికి రాయబడ్డ గీతమిది. సాధారణంగా 'ఛస్తే శివరంజని (రాగం) - నవ్వితే సితార్ (వాద్యం)' లాంటి సంప్రదాయాలు సినీ సంగీతంలో ఎక్కువగా ఉన్న రోజుల్లో శోక సన్నివేశాలను ఉపయోగించే శివరంజని రాగం స్కేల్‌ని తీసుకొని విషాదానికి కాక హుషారుకి ఉపయోగించడం సుసర్ల వారి ప్రతిభకు ఓ మచ్చుతునక. అయితే ఇక్కడ ఇంకో విషయం ఉంది. రవి సంగీత దర్శకత్వంలో వచ్చిన 'వచన్' హిందీ చిత్రంలో ఆశాభోంస్లే పాడిన ఓ పాట ఆ రోజుల్లో పెద్ద హిట్టు. ఆ పాట పల్లవి ఇలా ఉంటుంది.

చందామామా దూర్‌కే / పుయే పకాయె భూర్‌కే / ఆప్ ఖాయే థాలీమే / మున్నే కో దియే ప్యాలీమే

ఈ పాటలో ప్రముఖంగా వినిపించే ఫ్లూట్ బిట్‌ని, పల్లవి ట్యూన్‌ని యధాతథంగా 'అన్నా అన్నా విన్నావా' పాటకు వాడుకుంటూ చరణాలకు మాత్రం తను వేరే ట్యూన్‌ను చేసుకున్నారు సుసర్ల దక్షిణామూర్తి. పైన ఉదహరించిన సన్నివేశాన్ని, పాటకు జతపడ్డ సాహిత్యాన్ని పక్కపక్కన పెట్టి చూస్తే సినీ గీతాల్లో విలువల్ని కాపాడే విషయంలో రచయితల నైతిక బాధ్యత ఎంతో అవగతమవుతుంది.




## తారాగణం

నాగేశ్వరరావు, రేలంగి, గుమ్మడి, ఆర్.నాగేశ్వరరావు, చలం, రమణారెడ్డి, డా॥శివరామకృష్ణయ్య, రామలింగయ్య, పద్మనాభం, ఎ.ఎల్. నారాయణ, మాస్టర్ వర్మ, అంజలి, జమున, కృష్ణకుమారి, సూర్యకాంతం, ఇందిరాచార్య, పార్వతి, కుమారిసుభద్ర, సురభి కమలాభాయ్, కుచలకుమారి

## టెక్నీషియన్లు

కథ : సదాశివబ్రహ్మం
మాటలు: పినిశెట్టి
పాటలు: శ్రీ శ్రీ. కొసరాజు, అనిసెట్టి, వడ్డాది
సంగీతం: యస్.దక్షిణామూర్తి
కెమేరా: కె.యస్.ప్రసాద్
ఆర్టు : తోట
మేకప్ : హరిబాబు & వెంకటేశ్వర్రావు
ఎడిటర్ : సంజీవి
నృత్యం : వి.జె.శర్మ
స్టిల్సు : గంగాధరరావు
దుస్తులు : ప్రభాకర్

## సహాయకులు

దర్శకత్వం : ఆనంద్, మోహన్
ఎడిటింగ్ : శ్రీకాంత్
మేకప్ : వి. నరసింహారావు
ప్రొడక్షన్ : కృష్ణమూర్తి
దుస్తులు : కె. నటరాజ్

## నేపథ్య సంగీతం

లీల, సుశీల, జిక్కి, రాణి, దక్షిణామూర్తి, మాధవపెద్ది, నాగేశ్వరరావు, పాణిగ్రాహి

నిర్మాత : ఆనంద్. దర్శకుడు : యోగానంద్. నిర్మాణ పర్యవేక్షణ : ప్రసాద్. స్టూడియో: వాహిని,రేవతి.




**జరిగిన కథ**

అజయ్ ఓ శ్రీమంతుడు. తన బాధలను మర్చిపోవడానికి ప్రతిరోజు హోటల్‌కు వెళ్ళి మిత్రులతో కలిసి తాగుతూంటాడు. ఒకరోజు అలాగే తాగి డాన్స్ చూసి అర్ధరాత్రి ఇంటికి తిరిగి వస్తూంటే ఓ వ్యక్తి ఆత్మహత్య చేసుకునే ప్రయత్నంలో అతని కారుకి అడ్డంగా వస్తాడు. అజయ్ బ్రేక్ వేసినా డాష్ మాత్రం యివ్వక తప్పలేదు. అయినా అతనికి దెబ్బలు తగలలేదు. లేచి వెళ్ళి పోతుండగా అతన్ని చూసిన అజయ్ అదిరిపడతాడు.... (ఇక చదవండి)



అన్నపూర్ణావారి

# ఇద్దరు మిత్రులు

## సీరియల్ - నవల 2



**రచన : ముళ్ళపూడి వెంకటరమణ**



ఉత్తర క్షణంలో 'ఆగండి' అంటూ అతని భుజం మీద చేయివేసి ఆపాడు.

ఆ వ్యక్తి ఆగాడు.

'కారెక్కండి' అన్నాడు అజయ్.

'ఏం పోలీసులకప్పగిస్తారా?' అన్నాడతను. అతని స్వరం ఒక నిమిషంక్రితం అజయ్ మనసులాగే నిర్వికారంగావుంది. అందులో భయంలేదు, కోపంలేదు, చింతలేదు.

'లేదు మీకాభయం వద్దు మీతో మాట్లాడాలి' అన్నాడు - అప్పటికే ఏదో ఆలోచనలతో, సంభ్రమాశ్చర్యాలతో ఉక్కిరిబిక్కిరి అవుతున్న అజయ్.

ఆ వ్యక్తి, తలవంచుకునే అనుసరించాడు. ఇద్దరూ కారెక్కారు. అజయ్ కారును దారిలోకి తెచ్చి ముందుకుపోనిచ్చాడు.



నడుస్తున్నంతసేపూ ఇద్దరూ మౌనంగానే ఉన్నారు. ఎవరి ఆలోచనలతో వారు కొట్టుకులాడుతున్నారేమో.

పది నిమిషాల తర్వాత కారు ఒక హోటలు ముందు ఆగింది. అజయ్ ముందు దిగి, లోపలికి దారితీసాడు. అతని 'అతిథి' అనుసరించాడు.

---

హోటలు గదిలో మెత్తటి దీపాలకాంతి మధ్య, స్థిమితం మధ్య, సోఫాలమధ్య తలవంచుకుని కూర్చున్న ఆ వ్యక్తిని పరీక్షగా చూశాడు అజయ్. అంతా తన పోలికే. సాయంత్రం అద్దంలో కనిపించిన తన ప్రతిబింబంలా ఉన్నాడు. ఇది సాధ్యమా! తాను ఇప్పుడు బ్రాందిలోగాని, భ్రాంతిలోగాని లేడు... ఇది సత్యమే అయియుండాలి. ముమ్మూర్తులా తనే. ఆ బట్టలు, ఆ దిగులు, తప్పిస్తే. అతను తలవంచుకుని, కళ్ళువాల్చుకుని కూర్చున్నాడు. ఏదో ఆలోచనలో ఉన్నట్టున్నాడు... తాగిన మత్తుకాదు. తాగేలా, తాగగలిగేలా లేడు... ఆ బట్టలు, గడ్డం, తల, బతుకుకూడా మాశాయి. ఆ బతుక్కి తాగుడు తగదు.



అతని పేరు అడిగాడు.

విజయ్‌కుమార్ అన్నాడతను.

అజయ్ విస్తుపోయాడు. పేరులోకూడా ఇంత పోలికా! తనని వెక్కిరించడానికి చెబుతున్నాడేమో అనిపించిందిగాని, అతనికి తన పేరు తెలియదని గుర్తుకొచ్చింది.

బేరర్‌ని పిలిచి కాఫీ, ఫలహారాలు పురమాయించాడు.

గదిలో నిశ్శబ్దం ప్రవర్తిల్లింది. అజయ్ పచారుచేస్తూ ఆలోచిస్తున్నాడు. చివరకొక తీర్మానానికొచ్చాడు.



'విజయ్‌కుమార్! ఆత్మహత్య మహాపాతకం కదూ?' అన్నాడు.

'- అని కడుపునిండిన నీతి వేత్తలంటారు'' అన్నాడు విజయ్ తలవంచుకునే.

అతని కంఠంలో ఎంతటి కర్కశత్వం! ఆ మాటలో ఎంత వాడి!



ఎంత వేడి!... అజయ్‌కి తరవాత ఏమనాలో తోచలేదు.

'అసలు ఎందుకలాంటి కోరిక పుట్టింది విజయ్' అన్నాడు కొంచెం చనువుగా. లాలనగా.

'కోరిక కాదు, నిస్పృహ; జీవితంమీద విరక్తి. అంతే'.

'అంత విరక్తి పుట్టడానికి కారణం ఏమిటో తెలుసుకోవచ్చా?'

'ఆ మాత్రం ఊహించలేరా?' అన్నాడు విజయ్. ఊహించడానికన్నట్టు ఒక క్షణం ఆగి, నిట్టూర్చి తల వంచుకున్నాడు. 'ఈ లోకంలో ఓ మనిషిని బతకలేని పరిస్థితికి తీసుకొచ్చే దొక్కటే - దారిద్ర్యం'.

విజయ్‌కుమార్ జీవితానుభవాన్ని బట్టి ఏర్పడ్డ ఆ భావం ఎంత గాఢమైనదైనా, దారిద్ర్యంతో పరిచయం కూడా లేని అజయ్‌కి అది మనసుకు నాటలేదు. అర్థంకాలేదు. కాబోలన్నట్టు చూశాడు. దానికీ ఏమనాలో తోచలేదు. అంతలో బేరర్ ఫలహారాల ట్రేతో లోపలికివచ్చి అవి అక్కడవుంచి వెళ్ళాడు.

'తీసుకోండి' అన్నాడు అజయ్.

విజయ్‌కుమార్ ఫలహారాలకేసి చూశాడు. ఆకలి, చెయ్యిని ముందుకు తోసింది. కడుపులో ఆపేక్ష ఆపింది. కంట గిర్రున నీరుతిరిగింది. తల పక్కకి తిప్పుకున్నాడు.

'అదేమిటి విజయ్? మీరెందుకో బాధపడుతున్నారు. ఏమిటి చెప్పండి. ప్లీజ్' అన్నాడు అజయ్ సాదర స్వరంతో.



బాధతో కంఠం పూడుకు పోయింది విజయ్‌కి.

'మీకు చెప్పినా అర్థంకాని బాధ, అక్కడ ఇంటిదగ్గర మానాన్న, చెల్లెలూ కడుపునిండా తిండిలేక మాడు తూంటే, నే నిక్కడ విందారగించనా? క్షమించండి, నాకేమీ వద్దు' అన్నాడు నెమ్మదిగా.

అజయ్‌కి ఈ వ్యక్తి బాధ బోధ పడకపోయినా, మొత్తం మీద బాధ పడుతున్నాడన్న సంగతి బోధపడింది. దానితోపాటు తానూ ఒకవిధంగా పేదవాడేనన్న సంగతి మళ్ళీగుర్తుకొచ్చింది.

'ఉద్రేకపడకండి... అయితే మీకొక నాన్న, చెల్లెలు ఉన్నారన్నమాట. అదృష్టవంతులు మీరు. నాకూ ఒక చెల్లెలుంటే ఎంత బాగుండును' అన్నాడు నిట్టూర్చి.

జీవితంలో చేదు రుచిచూసిన వాడిలా చిరునవ్వు నవ్వాడు విజయ్ - 'మీరు లేనివారిని గురించి బాధపడుతున్నారు; నేను ఉన్నవాళ్ళని పోషించలేక బాధపడుతున్నాను. పోషించడం నా బాధ్యత. బాధ్యతలో బరువేమిటో మీకేం తెలుసు?' అన్నాడు. అతని కంఠంలో, మాటలో అప్రయత్నంగానే నిష్ఠురం ధ్వనించింది.



'మీ బాధ్యతలను మీరు గుర్తించి కూడా ఇలా పారిపోయి వచ్చారే? మీరు ప్రాణాలు తీసుకుంటే వాళ్ళ గతేంకాను?' అన్నాడు అజయ్ కూడా కొంత అనుకోని వాడితనంతో.

'హూఁ. బ్రతికుండీ నేనేం చెయ్యగలను గనక? బి.కామ్. పాసయి మూడేళ్ళయింది. ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరకలేదు' అన్నాడు, బాధను అణచుకునే ప్రయత్నంలో మరింతగా వెల్లడిచేస్తూ. అతనికి తెలియకుండానే అతని విషాదగాథ నోట వెలువడింది.



'మాది అసలే బీదకుటుంబం. ఆస్తి లేకపోయినా, ఆడంబరాలకు పోయి ఉన్న ఒక్క చెల్లెలికీ పెద్ద సంబంధమే తెచ్చి పెళ్ళి చేశాడు నాన్న. ఆ సంబంధంకోసం ఉన్న యిల్లు అమ్మింది చాలక, తలకు మించిన అప్పులు కూడా చేశాడు. చెల్లెలైనా సుఖపడుతుందనుకున్నాం. కాని -' అర్థోక్తిలోనే ఆగిపోయాడు విజయ్. తల్చుకున్న కొద్దీ బాధతప్ప మరేం లేదు.



'ఏం? మీ చెల్లెలు భర్త మంచివాడుకాడా?' అన్నాడు అజయ్ సానుభూతితో, కథ వినాలన్న కుతూహలంతో.

'అది కాదు, అప్పులిచ్చినవాళ్ళు వారంటు తెచ్చి నాన్నను జైలుకు పంపారు. ఆ దిగులుతో అమ్మ మంచంపట్టింది. మందులకనీ, మాకులకనీ ఎక్కడలేని డబ్బు కావలసివచ్చింది. గత్యంతరం లేక మా చెల్లెలికి అత్త వారిచ్చిన నగలు తాకట్టుపెట్టా... ఆ నగలు విడిపించుకోనూ లేకపోయాం; అమ్మను దక్కించుకోనూ లేకపోయాం. చివరకు చెల్లెలి కాపురం చిక్కుల్లో పడింది' అంటూ బరువుగా నిట్టూర్చాడు విజయ్.



'అంటే?'

'ఏముంది అజయ్‌బాబూ, నగలు తెచ్చేవరకూ గుమ్మంలో అడుగుపెట్ట వద్దన్నాడు మా చెల్లెలి మామగారు. సుఖంగా భర్తతో కాపురం చెయ్యవలసిన చెల్లెలు, పుట్టింట్లోనే కుమిలిపోతున్నా, ఏమీ చెయ్యలేకపోయిన అసమర్థుణ్ణి... ఈ ప్రపంచం అంతా డబ్బుతోనే ఉంది అజయ్‌బాబూ!'.

'అర్థమైంది విజయ్‌బాబూ! మీ సమస్య బీదరికం. అంచేత డబ్బుంటే సుఖం వుంటుందనీ, డబ్బుతో అన్ని సమస్యలూ పరిష్కరించుకోవచ్చుననీ అపోహపడుతున్నారు. కాని డబ్బులేని బాధకంటే, డబ్బున్న బాధ మరీ ఎక్కువ విజయ్' అన్నాడు అజయ్ - తన జీవితానుభవాన్ని, తనకు అర్థమైన తాత్పర్యాన్ని వ్యాఖ్యానిస్తూ.



'డబ్బుంటే బాధా?' అన్నాడు విజయ్ ఆశ్చర్యంగా.

'కాదా?' అన్నట్టు చూశాడు కలవాడు.

'అర్థమైందిలెండి, డబ్బున్నవాళ్ల బాధ ఒక్కటే. ఇంకా ఎక్కువ, ఇంకా ఎక్కువ కూడబెట్టాలని... అదేనా మీ బాధ?' అన్నాడు లేనివాడు నిష్ఠురాన్ని దాచుకోకుండా.

అజయ్ ఈ మాటలకు అలిగే ధోరణిలో లేడు. 'కాదు, అది కాదు' అన్నాడు ఓపికగా. 'నా సంగతే తీసుకోండి. డబ్బులేకపోవడం అంటే ఏమిటో నేను ఎరుగను. ఊహించలేను కూడా. తరతరాల నుండీ మాది జాగీర్దార్ల వంశం. మూడేళ్ళుగా నేను అమెరికాలో ఆటోమొబైల్ ఇంజనీరింగ్ చదువుతున్నాను. నాన్నగారు కావలసినంత డబ్బు పంపించడం, నేను హాయిగా అక్కడ ఖర్చు పెట్టుకోవడం, అంతే తెలుసు నాకు. సుమారు

నెలరోజుల క్రిందట కేబుల్ వచ్చింది - నాన్నగారికి సీరియస్‌గా ఉందనీ, వెంటనే బయల్దేరి రమ్మని... ఇంటికి చేరేసరికి... ... ...



---

... ... ఇంటికి చేరేసరికి కనుపించిన వాతావరణం, గుండె ఝల్లుమనిపింప జేసిన ఆ సన్నివేశం ఇంకా కళ్ళకు కట్టినట్టే ఉన్నాయి. కళ్ళు మూసుకుంటే ఎదట కదలాడుతున్నాయి.

పోర్టికోలో కారు దిగేసరికి అంతా నిశ్శబ్దంగావుంది. ఎప్పుడూలా నౌకర్లు, చాకర్లు సందడిగా పరుగులు పెట్టడంలేదు. కారిడార్ పొడుగునా, ఇంటిసిబ్బంది అంతా చేతులు కట్టుకుని తలలువంచి విచారంగా నిలబడివున్నారు. ఒకరిద్దరు కళ్ళు వత్తుకుంటున్నారు. అంతా అయిపోయిందని అజయ్‌కు బోధపడింది. అతని అడుగుల చప్పుడొక్కటే, అక్కడి నిశ్శబ్దానికి లయవేస్తున్నట్టు వినబడుతోంది. గుమ్మందగ్గిర భానోజీరావుగారు ఎదురొచ్చారు. ఆయన సానుభూతితో అజయ్ భుజంమీద చెయ్యివేశారు. వీపు నిమిరారు. అజయ్‌కి పూర్తిగా బోధపడింది. ఇద్దరూ బరువుగా అడుగులు వేసుకుంటూ లోపలికి నడిచారు.

అత్తయ్యగది దగ్గిరపడుతున్నకొద్దీ, అజయ్‌కి దుఃఖం పొంగివచ్చేసింది. ఈ యింటికీనాడు పెద్ద ఆవిడే, భర్త చనిపోయాక అన్నదమ్ముడింటికి వచ్చింది. తమ్ముడి బిడ్డనే తన బిడ్డగా సాకింది. బాల్యంలోనే తల్లిని కోల్పోయిన అజయ్, ఆమె చేతుల్లో పెరిగాడు. ఆమె అపేక్ష శ్రీరామరక్షగా పెద్దవాడయ్యాడు. తండ్రి కూడా ఆమెను ఎంతో గౌరవంగా చూచుకొన్నాడు.



తన అడుగులచప్పుడు వింటూనే ఆమె లేచి మంచం దిగింది. కర్రతో తడుముతూ, రెండడుగులు ముందుకు వచ్చింది. ఆమెను చూడగానే అజయ్‌కి దుఃఖం కట్టలు తెంచుకుంది. 'అత్తయ్యా!' అంటూ ఒక్కపరుగున ముందుకుపోయి, ఆమెను కౌగిలించుకుని పసిబిడ్డలా ఏడిచాడు. ఆప్తహస్తం ఆప్యాయంగా వెన్ను నిమిరి ఓదార్చింది.

'వచ్చావా నాయనా! వచ్చావా. అయిపోయింది, అంతా అయిపోయింది... ఇంత లేతవయసులో నీకెంత కష్టం వచ్చింది బాబూ, పనికిమాలిదాన్ని, కళ్ళులేనిదాన్ని నన్ను పట్టుకుపోకూడదూ ఆ భగవంతుడు?'

అజయ్ వెనకనే ఆ గదిలోకివచ్చి కొంచెం దూరంలో విచారంగా నిలచివున్న భానోజీగారికి ఈ సన్నివేశంచూసి కళ్ళు చెమ్మగిలినట్లున్నాయి. కండువాతో వత్తుకున్నారు.

'ఊరుకోండమ్మా, ఊరుకోండి. తల్లిలేని లోపం లేకుండా అజయ్‌బాబుని చిన్నప్పటినుండీ మీ చేతుల్లో పెంచారు, మీరే అధైర్యంగా ఉంటే ఎలా?' అన్నాడు.

'చివరిచూపులకైనా నోచుకోని నిర్భాగ్యుణ్ణయ్యాను. కాస్త ముందుగా తెలియచెయ్యక పోయారా భానోజీగారూ' అన్నాడు. అజయ్.



'జబ్బుగా ఉన్నప్పటినుంచీ మిమ్మల్ని రప్పించాలనే ప్రయత్నించాను. కాని, మీ చదువెక్కడ పాడవుతుందో అని నాన్నగారే వద్దంటూ వచ్చారు. ఇంత త్వరలో ఇలా ముంచుకొస్తుందని ఎవ్వరం అనుకోలేదు. నాలుగు కాలాలపాటు నాన్నగారికి సేవచేయగలనను కున్నాను. కాని...' దుఃఖోద్వేగంతో భానోజీగారి కంఠం గద్గదమైంది. తల వంచుకుని కళ్ళు వత్తుకున్నారు.



అజయ్ కుర్చీలో కూలబడి పోయాడు.

అత్తయ్య తల నిమిరింది. 'లే నాయనా, లే ఎంత విచారించినా ఏం లాభం. చనిపోయినవారిని తిరిగి బతికించుకోలేంగదా?, అంది దుఃఖం దిగమ్రింగుతూ.

భానోజీగారు అజయ్ భుజంమీద చెయ్యివేసి నెమ్మదిగా ఇవతలికి తీసుకువచ్చారు.

హాలులో, చిన్నయ్యగారికోసం ఎదురుచూస్తున్న మూగజీవి వెంకన్న అజయ్ దగ్గరకు రాగానే, కాళ్ళమీదపడి పసివాడిలా ఏడిచాడు. అతని కూతురు లచ్చి ముందుకు వంగి నెమ్మదిగా అతన్ని లేవదీసింది. అజయ్ వాడి కళ్ళలోకి దీనంగా చూశాడు. ఇద్దరిదీ మూగబాధే.

'పాపం వెంకన్న అహర్నిశలూ అయ్యగారినే కనిపెట్టుకుని సేవ చేశాడు. స్వామిభక్తి అంటే వీడిదే మరి' అన్నాడు హెడ్డు గుమాస్తా శేషావతారం గారు.

భానోజీ గారు కొంచెం చిరాకుపడ్డాడు.



'శేషావతారం, ఎవరెంత సేవచేశారో ఏకరువు పెట్టడానికి ఇదా సమయం. ఈ మూగవాడే ఏమిటి, అందరం చేశాం... అయినా అయ్యగారిని దక్కించుకోలేకపోయాం' అన్నారు.

అజయ్‌బాబు క్షణంలో సగంసేపు ఆయన వేపు చూసి కళ్ళు వాల్చుకున్నాడు.



మేడమీద తనగదికి పోతూ ఉండగా, సుపరిచితమైన గది కనబడింది. అజయ్ అక్కడ ఆగిపోయాడు.

'భానోజీగారూ, నాన్నగారి గదికి తాళాలు వేశారేం?' అన్నాడు.

'అత్తయ్యగారు మీకు చెప్పలేదా?' అన్నాడు భానోజీగారు అదిరిపడి, ఉత్తరక్షణంలో ఆయన కంఠం విషాద భరితం అయిపోయింది. 'నాన్నగారు ఈ గదిలోనే పరమపదించారు. వారు పోయిన నక్షత్రం మంచిది కాదుట. అందుకని ఏడాదిపాటు ఈ గదులు తెరవకూడదని పురోహితులు శాసించారు' అన్నాడు.

(ఇంకా వుంది)




## మంత్రి అయిన హాస్యనటుడు



తెరపై హీరోయిజమ్ ప్రదర్శించిన నటులు, అందాల తారామణులు రాజకీయాలలోకి వచ్చిన పదవులు అధిష్టించడం సాధారణమై పోయినా, ఇప్పటిదాకా పూర్తిస్థాయి హాస్యనటులు మంత్రిపదవులు పొందినట్టు కనబడదు. బహుశా ప్రపంచంలో అరుదైన ఆ గౌరవం 700 సినిమాలలో నటించిన బాబుమోహన్‌ను వరించింది. ఖమ్మం జిల్లా హుస్నాబాద్‌కు చెందిన ఈ 48 ఏళ్ల నటుడు బిఏ చదివి 14 ఏళ్లపాటు ప్రభుత్వోద్యోగం చేసి, సినిమారంగంలో చేరారు. తెలుగుదేశం పార్టీ అభ్యర్థిగా మెదక్ జిల్లాలోని ఆందోల్ ఎమ్మెల్యేగా ఎన్నికయి, సెప్టెంబరులో జరిగిన రాష్ట్ర కేబినెట్ విస్తరణలో కార్మికమంత్రిగా నియమించబడ్డారు.

## నంది ఎవార్డులలో కూడా పోటాపోటీ





సాధారణంగా నటీనటులు తెరపై ఒకరితో ఒకరు పోటీపడి నటిస్తారు. గతపక్షంలో ప్రకటించిన రాష్ట్రప్రభుత్వ నంది ఎవార్డులలో ఎల్బీ శ్రీరాం, ఎమ్మెస్ నారాయణలు పోటీపడ్డారు. ఇద్దరిలో ఎవరు ఉత్తమ హాస్యనటులో తేల్చుకోలేక కమిటీ 'చాలా బాగుంది' సినిమాలో నటనకై శ్రీరాంకు, 'సర్దుకుపోదాం రండి' సినిమాలో నటనకై ఎమ్మెస్ నారాయణకు, ఇద్దరికీ ఎవార్డు ప్రకటించారు. ఉత్తమ హాస్యనటి విషయంలో అటువంటి ఇబ్బంది వచ్చినట్టు లేదు. 'రాయలసీమ రామన్నచౌదరి' సినిమాలో పాత్రధారణకై కోవైసరళ ఎన్నికయింది.

సంగీతవిభాగానికి వస్తే 'రాఘవయ్యగారి అబ్బాయి' లో 'బుద్ధభూమి..' పాటకు, ఉత్తమ పాటల రచయితగా వెన్నెలకంటి, ఉత్తమ నేపథ్యగాయకుడుగా ఎస్పీబాలసుబ్రహ్మణ్యం ఎంపికయ్యారు. ఉత్తమ సంగీతదర్శకుడు ఎవార్డు వందేమాతరం శ్రీనివాస్ (దేవుళ్లు) గెలుచుకోగా ఉత్తమ నేపథ్య గాయని అవార్డు ఎస్.జానకి ('శ్రీ సాయిమహిమ' లో 'ఎంతెంత దయ నీది')ని వరించింది.

## కార్టూన్ నెట్‌వర్క్ లో రామాయణం

కొందేదీ కార్టూన్‌కి అనర్హం అనవచ్చేమో. మన సభ్యత, సంస్కృతి పిల్లలకు నేర్పాలంటే కార్టూన్‌లు, ఏనిమేషన్లే మంచి మార్గమని గుర్తించిన కార్టూన్ నెట్‌వర్క్ వారు అక్టోబరు 5 నుండి దీపావళి వరకు ప్రతి శనివారం అరగంట సేపు 'ది గ్రేట్ ఇండియన్ ఎపిక్స్' పేర కార్టూన్ కథల రూపంలో మొదట రామాయణం (ది లెజెండ్ ఆఫ్ ప్రిన్స్ రామా), తరువాత మహాభారతం (పాండవాస్ - ది ఫైవ్ వారియర్స్) ప్రసారం చేస్తున్నారు.

## సంగీతదర్శకులయిన దంపతులు



మణిరత్నం తన కొత్త సినిమా 'ఫైవ్ స్టార్' కు సంగీతదర్శకత్వం వహించే భారం అనూరాధ-పరశురామ్‌ల జంటకు అప్పగించారు. అనూరాధ తమిళ, తెలుగు, హిందీ, మలయాళం సినిమాలలో 500 పాటలు పాడారు. ఆమె భర్త శ్రీరామ్ పరశురామ్ తన వయొలిన్ కచ్చేరీల ద్వారా ప్రపంచ మంతా పర్యటించి, ఆల్బమ్స్ వెలువరించారు. ఆయన పాప్ ఆల్బమ్ 'సావరియా' పెద్ద హిట్.

# మార్క్స్ బ్రదర్స్ విలక్షణ హాస్యం

ముళ్లపూడి వెంకటరమణ

అదృష్టవశాత్తు, సినిమాలో శబ్దం రావడం ఆలస్యం అయింది కాబట్టి, సినిమా హాస్యం దృశ్య ప్రధానమైనదిగా, నటన ద్వారా, సన్నివేశం ద్వారా అందించ గలిగినదిగా ఆరంభమైంది. అందులో చాప్లిన్‌ద్వారా పరమావధినే అందుకుంది. చాప్లిన్ టాకీలు వచ్చినా సంభాషణలో వాడడానికి చాలాకాలం వరకు యిష్టపడ లేదు. ఉత్తమమైన హాస్యం స్వతంత్రంగా సంభాషణల ప్రమేయం లేకుండా నిలుస్తుందని ఆయన ఋజువు చేశాడు. మాటని వాడినా, అవసరమైనపుడు, అవసరమైనంత మేరకు వాడితే అందగిస్తుంది. అయితే ఈ సరిహద్దులు దరిమిలా జరిగి పోయాయి. కేవలం సంభాషణ మీదనే హాస్యాన్ని పోషించే పద్ధతికి ఈనాడు ప్రచారం ఎక్కువ



ఉంది. సంభాషణలు హాస్యాన్ని కల్పించడానికి అనర్హమైనవని ఈ వాక్యాలు చెప్పడం లేదు. వాక్చాతుర్యంలో ఉత్తమ హాస్యం సృష్టించినవారూ ఎందరో ఉన్నారు. కాని, ఒక విధంగా కల్పించి పోషించ వలసిన హాస్యాన్ని రెండో విధంలో అడ్డ దారిన సాధించబోవడమే బాధాకరం. ప్రజ్ఞానిధులైన ఎందరో హాస్యనటులు ఈ విధంగా అపమార్గాన వెళ్లినందువల్ల, వారు సృష్టించ గలిగి ఉండే హాస్యం లభ్యం కాకుండా పోయిందని ఒక కళాకారుడు అన్నాడు.

ఈ రెండు విధాలా హాస్యాన్ని సృష్టించిన వారిలో మార్క్స్ బ్రదర్స్‌ను ముందు చెప్పుకు మరీ మాట్లాడాలి.

గ్రూచో మార్క్స్ నోట మాటలు, చిక్కో ఇటాలియన్ ఇంగ్లీషూ, హార్పో మూగ హావాలూ వేటికవే ప్రత్యేకత సంపాదించు కున్నాయి. తలా తోకా, కుడీ ఎడమా మిన్నూ మన్నూ మనకి తెలిసిన ప్రపంచానికి తలక్రిందులుగా ఉండే వీరి ప్రపంచం అద్భుతమైనది.

అల్లకల్లోలంగా కనిపించే ప్రపంచం నిజ స్వరూపం. అందులో వస్తువుల గమన విధానం మనకి అర్థం కానప్పుడు, అర్థమైనంతమేరకే మనకి కనిపించినంతవరకే "రాయి ఎగరదు. నీరు ప్రవహించును, గోళీకాయ మీద గుర్రం నిలబడలేదు, చెవిని గిల్లినచో నొప్పి పుట్టును" అని సిద్ధాంతాలు తయారుచేసుకొని, రాయీ, నీరూ, గుర్రం, చెవీ అవి చెప్పినట్టు విననప్పుడు సూత్రాలకు మినహాయింపులు రాసుకుని సర్దుకుంటాం. అలా సర్దుకొనక పోవడం, ఇదంతా దగాలా అబద్ధం తలాతోకాలేనిది, అంటూ దేవతా వస్త్రాల కథలోని రాజుగారు పంచె కట్టుకోలేదని అరచిన పసిపిల్లాడిలా గావుకేక పెట్టడం మార్క్స్ బ్రదర్స్ పద్ధతి.

సిద్ధాంతాలన్నిటినీ చితగ్గొట్టి ఈ ప్రపంచంలో, కాదంటే మా ప్రపంచంలో కథ కమామిషూ ఇవీ అని చెప్పి చిత్తం వచ్చినట్టు అల్లరి చెయ్యటం వాళ్ల జెండా. మన కంట్లో రెటినా మీద మనం చూసేవాటి బొమ్మలన్నీ తిరగబడిపడతాయని వాటిని మనం మళ్ళీ తర్జుమా చేసుకుంటామని శాస్త్రజ్ఞులు ప్రకటించారు. మార్క్స్ బ్రదర్స్ సినిమా జగతి ఈ సిద్ధాంతాన్ని చితగ్గొడుతుంది. అది అపసవ్యంగా ఉంటుందని తెలిసీ, వార్నింగ్ ఉండి కూడా దాన్ని మనం సవ్యంగా తర్జుమా చేసుకోలేము. చూస్తున్న కాసేపూ. అదే మనని మింగేసి, గూచో, చిక్కో, హార్పోలుగా అనువదించేస్తుంది. గ్రూచో మాటల వేగం, హార్పోచిక్కోల చేష్టల వేగం సుడిగాలిలా వచ్చి మనని చుట్టుముట్టి విపరీతమైన వేగంతో ఎగరేసుకుపోతాయి. అందులో సాధ్యాసాధ్యాలు లేవు. హార్పో జేబులోంచి మూడు కప్పుల వేడి కాఫీ దగ్గర్నించి ఏదిపడితే అది తీసిస్తాడు. అర్జెంటుగా



గ్రూచో (1890-1977): బాపుగారికి ఇష్టమైన హాస్యనటుడు. అతి వేగంగా మాట్లాడే పాత్ర అసలు పేరు జూలియస్.



చికో (1886-1961): అసలు పేరు లియోనార్డ్. ఇటాలియన్ యాసతో మాట్లాడే పాత్ర.



హార్పో (1888-1964): అసలు పేరు అడాల్ఫ్ అస్సలు మాట్లాడడు. అమ్మాయిల వెంటపడే పాత్ర.



జెప్పో (1901-1979)
అసలు పేరు హెర్బర్ట్. అందగాడైన హీరో పాత్ర

ఎక్కడికేనా పోవాలంటే జేబులోంచి సైకిలు తీసి అందుమీద ఎక్కి వెళ్ళిపోతాడు. 'ఇఫ్ విషెస్ వర్ హార్సెస్' అన్న ఇంగ్లీషు సామెతని అక్షరాలా నిజం చేసి, మనలోని అన్ని కోరికలనూ గుర్రాలు చేసి సవారీ చేస్తారు వాళ్లు. మనం అసహజం అనుకున్న దానికి, అతిసహజమైన రూపకల్పన చేసి అది సహజమైనట్టు నటిస్తారు. నమ్మమంటారు. మనకి గ్రూచో మీసం, కళ్లజోడు హార్పోవిగ్గూ అనీ పచ్చి అబద్ధాలు అని తెలిసినా అంతకన్నా కఠోర సత్యాలు లేవంటారు.

మనం వాళ్ళని చూసి నవ్వకబోతే వాళ్ళు మనని చూసి తెల్లబోతారు. ఇందులో నవ్వెందుకేముంది అని. ఈ విషయంలో అధివాస్తవికవాదుల కన్న అతివాస్తవికవాదులు వీళ్ళేననిపిస్తుంది. గోళీకాయ మీద నిలబడి గడ్డిమేస్తున్న గుర్రం బొమ్మ మనకి అర్థంకాక పోతే ఆశ్చర్య పడతాడు సర్రియలిస్టు. మనని చూసి జాలిపడతాడు కూడా. వాళ్ళలా పడి లేచినా మనం హర్షించలేము. కారణం వాళ్ళది పూర్తిగా వ్యక్తిగతమైన భావన. 'వేపకాయ వెర్రి' అనిపిస్తుంది అర్థం కానివాడికి. ఆ భావాన్ని వాళ్లు మనలో కలిగించలేరు. అందుకే సర్రియలిస్టులు. అలా దీన్ని మనము హర్షించ గలిగితే అది మార్క్స్ బ్రదర్స్ మార్క్ అవుతుంది.

"డక్‌సూప్" అనే చిత్రంలో మార్క్స్ బ్రదర్స్ ఇద్దరు ఒక్కలాగే వేషం వేసుకుని ఒక ద్వారం దగ్గర ఎదురుబొదురుగా తటస్థ పడతారు. ద్వారబంధం నిలువుటద్దం. ఎదురుగా ఉన్నది నా ప్రతిబింబమేనా?




నేనబద్ధమా. నేను వాడి ప్రతిబింబాన్నా? అని ఖంగారుపడి మనని ఖంగారు పెట్టేస్తారు ఆ యిద్దరు. రజ్జు సర్ప భ్రాంతికి ఇంకో స్థాయిలో ఇంత గొప్ప అనువాదం చేసిన కళాకారులు అరుదు. ఇది హాస్యనటుడికే సాధ్యం అవుతుంది. వాళ్ళల్లో మార్క్స్ బ్రదర్స్‌కే సాధ్యం అవుతుంది.

ఇంకో చిత్రంలో ఒక దుష్టుడిని, కోడి ఈకల డస్టర్ (దుమ్ము దులిపేది)ను పిస్తోలులా చూపించి ఆయ్ అని గద్దిస్తాడు హార్పో. ఎదటివాడు కంగారులో అది పిస్తోలే అని భ్రమపడి చేతులు పైకెత్తేస్తాడు. మనమంతా ఈ ట్రిక్కు చూసి అర్జెంటుగా పగలబడి నవ్వేస్తాం కాని నవ్వు పూర్తి అయే లోగా ఆ డస్టర్ పిస్తోలై పేలుతుంది. ఈసారి ఏం చేసిటట్టు, దేన్ని చూసి నవ్వేటట్టు? ఏది నిజం అనుకునేటట్టు?

'ఏ నైట్ ఇన్ కాసబ్లాంకా' అనే చిత్రంలో కూడా




తొణుకూ బెణుకూలేని హార్పోమనని విభ్రాంతులను చేసే సన్నివేశం ఒకటి ఉంది. అతను సామాన్యుడి వేషంలో (ఎప్పుడు అదే వేషం) యదాలాపంగా వచ్చి రాత్రిపూట ఓ పెద్ద భవనానికి అనుకుని విలాసంగా నిలబడతాడు. హార్పో నోరు లేని వాడు. (నిజంగా మాట్లాడినా చిత్రాలలో ఎన్నడూ ఒక మాటకూడా ఆడడు). ఓ అమెరికన్ పోలీసు అక్కడికి (కాసబ్లాంకా!) వచ్చి ఇతన్ని చూసి 'ఎవర్నువు? ఏం చేస్తున్నావిక్కడ... బిల్డింగుని? గినా మోస్తున్నావా? అని గద మాయిస్తాడు.

'ఔనౌను' అన్నట్టుగా తలతాటిస్తాడు. హార్పో - పత్తికాయలంత కళ్ళను మరింత పెద్దవిచేసి నవ్వి. ఏడిశావు పో అని అతన్ని ఒక్కతోపు తోస్తాడు పోలీసు.

మరుక్షణంలో అంత పెద్ద భవనమూ కుప్ప కూలిపోతుంది. 'నే చెప్పలే?' అంటాయి హార్పో కళ్లు అమాయకంగారుగా.

ఇదీ మార్క్స్ బ్రదర్స్ ప్రపంచం ఇందులో మనకి అర్థమయ్యే తలాతోకా ఉండవు. కార్యకారణ సంబంధ సూత్రం తూచ తప్పకుండా పని చెయ్యదు. భూమి పదార్థాలను ఆకర్షించడం ఒక్కోసారి మరచిపోతుంది. టెలిఫోన్ చాక్‌లెట్ అయిపోతుంది. ఈలోగా క్షణం విరామం లేకుండా, మూడింట ఒక వంతు మనకి కొరుకుడు పడకుండా అపరిమిత వేగంతో గ్రూచో వాగుతూనే ఉంటాడు. చికో ఇంగ్లీషు బాగా రాని ఇటాలియన్‌లా మాట్లాడుతూ ఉంటాడు. హార్పో మూగ భాషతో, ఈలలతో నానాగోల చేస్తునే ఉంటాడు. డబ్బు, ఆడవాళ్లు ఆడవాళ్లు, డబ్బు, డబ్బు, ఆడవాళ్లు, ఆడవాళ్లు, డబ్బు మనకి చాలా యిష్టమని, మనందరం ఎప్పుడో ఒకప్పుడు కళ్లు మూసుకు పాలు తాగేస్తూ ఆ సంగతి పిల్లి చూడటం లేదని నమ్మేసి, ఏమీ ఎరగనట్టుగా పిల్లికళ్లు మూసుకు పాలు తాగినప్పుడు దాని మీద సామెతలు విసుర్తామనీ వాళ్లు చెబుతూ నవ్విస్తూ కంగారు పెడుతూ....

చార్లీచాప్లిన్‌ను గనక మరో మార్క్స్ ఆకర్షించకపోతే, ఆయన ఈ సోదర మార్క్స్ ప్రపంచంలోకే వచ్చేవాడనీ, అలా రావాలని ఆయన ఒకప్పుడు అభిలషించాడనీ హెచ్చరిక గల ఒక విమర్శకుడు వ్రాశారు.

## మార్క్స్ సోదరులు

అందరూ కలిసి డజను సినిమాల కంటె ఎక్కువ వేయకపోయినా తరతరాలకు సరిపడ కీర్తి తెచ్చుకున్న మార్క్స్ సోదరుల అభివృద్ధి వెనుక తల్లి మిన్ని ప్రోత్సాహం ఎంతో ఉంది. చిన్నప్పుడే సంగీత పాఠాలు నేర్పించి, షో బిజినెస్‌లోకి వారిని ప్రవేశపెట్టినదే ఆమెయే! '1925'లో 'ది కోకోనట్స్' లో బ్రాడ్వేని జయించారు మార్క్స్ సోదరులు. నాలుగు సంవత్సరాల తర్వాత పారమౌంట్ పిక్చర్స్ వారు వారిని తెరకు పరిచయం చేశారు. 1930లలో హాలీవుడ్ చేరిన మార్క్స్ సోదరులు నటించిన 'మంకీ బిజినెస్' (1931) 'హార్స్ ఫెదర్స్' (1932), 'డక్ సూప్' (1933) వారి ఉత్తమ చిత్రాలుగా పరిగణిస్తారు విమర్శ కులు. హిట్లర్ పైకి వస్తున్న ఆ రోజుల్లో 'డక్‌సూప్' లోని పొలిటికల్ సెటైర్ జనాలకు, గానీ పారమౌంట్ వారికి కానీ మింగుడు పడలేదు. అప్పుడు ఎమ్.జి.ఎమ్.వారు ముందుకువచ్చి 'ఎ నైట్ ఎట్ ది ఒపేరా' (1935), 'ఎ డే ఎట్ ది రేసెస్. (1937) వంటి హిట్ చిత్రాలు తీశారు. 'ఎట్ ది సర్కస్' (1939), 'గో వెస్ట్' (1940), 'ది బిగ్ స్టోర్' (1941) తర్వాత వాళ్లు విడిపోయి ఎవరి కెరియర్ వాళ్లు చూసుకున్నాక మళ్లీ 'ఎ నైట్ ఇన్ కాసబ్లాంకా'(1946), 'లవ్ హేపీ' (1949)లలో కలిసి నటించారు. గ్రూచోకు 1973లో స్పెషల్ ఆస్కార్ ఇచ్చి సత్కరించారు.

- కమ్యూనికేటర్ ఫీచర్స్

## కొంటెకొశ్చెన్లు - తుంటరి జవాబులు




● బి.వి.రావు - చందానగర్

ప్ర॥ వర్తమాన రాజకీయ నాయకుడి భార్య పండక్కి ఏం కోరుకుంటుంది?

జ॥ ఓ బుల్లెట్ ప్రూఫ్ జాకెట్

● బి.శ్రీరామ్ - రుద్రారం

ప్ర॥ పేషంట్ ఘొల్లుమనేదెప్పుడు?

జ॥ 'రాత్రంతా ఒకటే పొడిదగ్గండీ' అని అంటే "నేను తడిదగ్గు స్పెషలిస్టునయ్యా' అని డాక్టర్ చెప్పినప్పుడు.

● బి.శ్రీనివాసాచారి - హైద్రాబాద్

ప్ర॥ కవితావేశమంటే?

జ॥ పక్కింట్లో ఉన్న అమ్మాయి పేరు కవిత అయితే కలిగేది.

## చిలిపి లిపి




| | | |
|---|---|---|
| 100రభం | = | సౌరభం |

-యల్. శ్రీనివాసరెడ్డి, కొంగరకలాన్

| | | |
|---|---|---|
| పోT | = | పోటీ |
| కా Fee | = | కాఫీ |

- వరదా సాయికుమార్, పర్లాకిమిడి



## ఈ రూటే వేరు




| | | |
|---|---|---|
| 'నౌ' కరు | = | ఇప్పుడే చెయ్యి |

-పూజారి సింహాచలం, పాడేరు

| | | |
|---|---|---|
| భాస్వరం | = | యజమాని ఇచ్చిన వరం. |

-బి.వి.రావు, రుద్రారం.

| | | |
|---|---|---|
| గోవా | = | వెళ్ళవా |

-బి.విశ్వజ, జవహర్‌కాలనీ

## పేరు - రిపేరు

శేషు - గర్ల్‌ఫ్రెండ్ - ఇడియట్

ఇంద్ర - జయం - జనం - సంతోషం



-యల్.శ్రీనివాసరెడ్డి, కొంగరకలాన్

బుద్ధిమంతుడు - పెంకిపెళ్ళాం - బావమరదళ్ళు

ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు

- మాధవీ సనారా, ఖర్గపూర్

## డబుల్‌రోల్




మళ్ళీ మీ ఇంట్లో 'అడుగు' పెడితే అప్పుడు 'అడుగు'.

-మాధవీ సనారా, ఖర్గపూర్

మా అమ్మాయి 'రాజీ - పడి' పోతుందని పక్కింటి వాళ్ళతో 'రాజీపడి' ఈ గ్రిల్ పెట్టించాం.

ఎంత 'పని'చేసినా అ'పనింద'కు గురికాక తప్పలేదు.

-భమిడిపాటి వెంకటేశ్వరరావు, చందానగర్

## చిలిపి కవిత

ఇదేనండి ఇదేనండి భాగ్యనగరం



హలో...
హైదరాబాద్ రోడ్డులో
కళ్ళుమూసుకు చలో....
రూలు రూలంటూ బండి నడిపితే
వెంటనే చేర్తావు ఉస్మానియాలో
ఆ మర్నాడే నీ ఇంట్లో
ఏడుపులో, పెడబొబ్బలో

-జి.రమణమూర్తి, సికింద్రాబాద్

## పేరడీ పేరేడ్



పేకలో ఆ రాజు రాకపోయెను చూడు
చేతిలో ఈ రాణి పోకపోయెను నేడు ॥ పేక॥

1 సెట్టులా అవి...? కావు ...అవుతాయి ఏసీలు
సొమ్మంతా అయిపోయె రసశోక గీతాలు
నా ఆస్తి యీ రోజు హరియించగా ॥నా ఆస్తి॥
ఋణదాత కలలన్ని చివురించగా ॥పేక॥

2 చాటుగా పారుగోడి ఆటనే చూసాను
ఆటలాడక పుల్లు కౌంటునే యిచ్చాను ॥చాటుగా॥
ఎకరాల కెకరాల మాగాణి నమ్మేసి
ఎదలోన గుబులై... నే .... తిరుగాడి ఓడాను
ఆ ఆట నాకు తీరని శాపమై ॥ఆ ఆట॥
పెనుభార మతి ఘోరమై సాగెనే ॥పేక॥

చిత్రం: ఏకవీర - "తోటలో నా రాజు" పాటకు పేరడీగా

-తెలికిచర్ల రామకృష్ణ
విజయనగరం

అక్టోబరు 1 అల్లు జన్మదిన సందర్భంగా...




నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు నటుడు

**రావి కొండలరావు**

రాసిన వ్యాసమిది



# నవ్వడం - నవ్వించడం అల్లుకే చెల్లు!





**కొన్నేళ్లక్రితం పాలకొల్లుకి చెందిన అల్లు వారి వంశంలో ఒక అబ్బాయి పుట్టాడు. పుడుతూనే ఏడవడానికి బదులు నవ్వాడో, నవ్వించాడో గాని అతనికి రామలింగడన్న పేరు పెట్టారు పెద్దలు.**

**తెనాలి రామలింగడు కాళికాదేవిని చూసి పకపకా నవ్వాట్ట. "ఏం?" అంది మాత ఆగ్రహించకుండానే. "నీకు పది తలలు వున్నాయి. చేతులు రెండే వున్నాయి. జలుబుచేస్తే, రెండు చేతులతో ఇన్ని ముఖాల ముక్కుల్నీ ఎలా చీదుకుంటావో పాపం - అని నవ్వొచ్చింది" అన్నాట్ట రామలింగడు. అతని చమత్కారానికి తానూ నవ్వి "ఇట్నుంచి చదివినా, అట్నుంచి చదివినా ఒకేలా అక్షరాలు వచ్చే 'వికటకవి' అన్న పేరు నీకు ఖాయం చేస్తున్నాను" అందిట మాత. ఇలాంటి సందేహాలు, ఈ రామలింగడికీ వచ్చేవి. 'రావణుడికి పది తల కాయలు. చేతులు రెండే. అయితే, కాళికమ్మ వారి కంటె రావణుడు తెలివైన వాడు గనక, అతనికి అవసరం వచ్చినప్పుడే పది తలలూ తెచ్చుకుంటాడు గాని, ఆవిడలాగా నిత్యం పది తలలూ మోసుకుంటూ తిరగడు! అంచేత జలుబు బాధ తప్పించుకోగలడు' - అని రామలింగం సర్ది చెప్పుకున్నాడు - చిన్నప్పుడే.**

రామలింగయ్య చదువంతా వానాకాలం చదువే. ఆ చదువు మీద శ్రద్ధ కంటె నవ్వించడం, జోకులు చెప్పడం అన్న చదువే ఎక్కువైంది. విడివిడిగా ఒక్కొక్కర్నీ నవ్వించడం కష్టం గనుక, నాటకాల్లో చేరితే స్టేజి మీద చేసే హాస్యంతో అందర్నీ ఒక్కసారే నవ్వించవచ్చునని నాటకాలు వేశాడు బాల రామలింగం. అదే బావుంది! ఆ బాలుడు, శుక్లపక్ష చంద్రునివలె దినదిన ప్రవర్ధమానుడై నవ్వుల వెన్నెల కురిపించసాగాడు. ప్రజానాట్యమండలిలో చేరాడు. పాట వచ్చు గనక, బుర్రకథలు, జన పదాలూ పాడే వాడు. తోటి నటులు ఒక్కొక్కరే సినిమాల్లో ప్రవేశిస్తుంటే తాను మాత్రం తక్కువా అని, ప్రయత్నాలు సాగించి డాక్టర్ రాజారావు తీసిన 'పుట్టిల్లు'తో సినిమా నటుడై పుట్టాడు. అక్కణ్ణించి, అసలు పుట్టిల్లు అత్తవారిల్లు అయినట్టు సినిమా రంగమే అల్లు పుట్టిల్లుగా మారింది. స్థిరపడి పోయాడు.

రామలింగయ్యకి అబ్జర్వేషన్ ఎక్కువ. రైల్లో వెళ్లే ముష్టివాళ్ల పాటలు, బయట అడుక్కునే వాళ్ల పాటలూ పట్టుకుని వాటికి తన చమత్కారం తగిలించి, పారడీ చేస్తూ పాడే వాడు. గిరగిరా తిరిగి పోయే పర్సనాల్టీ.





సాటి హాస్య నటులతో ...

ఒళ్లు వంచి (వెదురుకర్రలా) పని చేసే స్వభావం. సినిమాల మీద సినిమాలు వచ్చాయి. రకరకాల పాత్రలు వచ్చాయి. హాస్యనటుడు అల్లు అయితే, తార రామలింగయ్య. హాస్యం కలగలసిన బ్రాహ్మణ పాత్రలు, టీచరు పాత్రలూ వస్తే రామలింగయ్యే. మాయాబజార్లో శర్మ "అసలు గోంగూరంటే ఏమిటో తెలుసా మీకు?'' అని రామలింగయ్యలా అడుగుతాడు. గొల్లుమనిపిస్తాడు అల్లు. 'శ్రీకృష్ణార్జునయుద్ధం'లో 'అంచెలంచెలు' పాటలో, అలా సుళ్లు తిరిగిపోతూ, కళ్లు తిప్పుతూ, తోలుబొమ్మలాటలో కేతిగాడులా చేతులు తిప్పుతూ చుట్టుకు పోతూ జారిపోతూ పాడి నవ్వించడం ఇంకెవరికి సాధ్యం? ఇలా గుర్తుకు తెచ్చుకుంటూ పోతే, ఇది అనంతం!

"అవును. నాకు స్టడీ వుంది. ఆలోచన వుంది'' అన్న రామలింగయ్యే "హాస్యం అంటే, ఇదిగో, హాస్యం అంటే ఏమీ లేదు, టైమింగ్. అదే మనకి లేదు'' అని చెప్పి నవ్వించేవారు రామలింగయ్య - షూటింగుల్లో.

రామలింగయ్యకి 'నస' ఎక్కువంటారు కొందరు. చిన్నప్పుడు వస పోసుకుని పుట్టడానికి బదులు నస పోసుకు పుట్టాడంటారు కాని, కాదు! సీను చదివి, ప్రతి డైలాగూ మననం చేసుకుని ఎలా చెప్తే బాగుంటుంది, ఎలా చేస్తే కామెడీ వస్తుందీ అని ఆలోచిస్తూ కూచోడమే నస! "రామలింగయ్య గారూ! రెడీ రెడీ'' అని డైరెక్టరు కేకలు పెడుతున్నా ఓ పక్క "రెడీ" అంటూనే, రెండో పక్క ఆలోచన వుంటూనే వుంటుంది. ఆ ఆలోచనే లేకపోతే, దాదాపు వెయ్యి సినిమాల్లో నటించ గలగడం సాధ్యమయ్యేదా? 'కుంటినక్క' వేషాలు, జిత్తుల మారి వేషాలు, లిటిగెంటు వేషాలూ వేసి నవ్వించగలగడం సాధ్యమయ్యేదా?

అయితే ఆయన చేష్టలు, కంగారూ కూడా నవ్వు తెప్పిస్తాయి. ఓ సారి, షూటింగ్‌లో లంచ్‌బ్రేక్. రామలింగయ్య భోజనానికి ఇంటికెళ్లి వస్తానని, కంపెనీ కార్లో ఇంటికెళ్లారు. ఆ పాత్రకి మీసం వుంది. కారెక్కి ఈ మీసం తీసేసి, డాష్ బోర్డ్‌లో పడేశారు. ఆయనకి భోజనం చేశాక ఓ అరగంటయినా పడుకునే అలవాటుంది. అంచేత, లేటుగానే కారొచ్చింది. కంపెనీ గనక వేరేకారు వచ్చింది. రామలింగయ్య కారెక్కి స్టూడియో చేరుకున్నారు. మేకప్ రూమ్‌కి వెళ్లి టచప్ చేసుకున్నారు. ఈ లోపల "రెడీ రెడీ'' అంటూ అసిస్టెంట్లు రమ్మని పిలుస్తూ పక్కన నించున్నారు. "మీసం - మీసం అతికించు బాబూ'' అన్నారు అల్లు కంగారుగా. "మీసం ఎవరికిచ్చారు సార్?'' అన్నాడు మేకప్‌మాన్. "మీసం.'' అని గుర్తు తెచ్చుకుంటూ "ఆఁ కార్లో వుంది. - చూడు'' అన్నారు. ఇద్దరు ముగ్గురు పరుగెత్తారు. ఈ వచ్చిన కార్లో మీసం లేదు. మీసం గల కారు వేరు. ఆ కారు ఎక్కడికో బయటికి వెళ్లింది. ఎలా? "మీసం... మీసం... కారు కారు'' అని అరుస్తున్నారు రామలింగయ్య. "రామలింగయ్య గార్ని రమ్మనండీ'' అని సెట్లో డైరెక్టరు అరుస్తున్నారు. జరిగిన విషయం డైరెక్టరుకి తెలిసి, కోపానికి బదులు నవ్వుకుని, ఇంకో షాటు ఏర్పాటు చేసుకున్నారు. ఇంకో అరగంటకి గాని మీసం గల కారు రాలేదు. వచ్చాక, అతికించుకుంటూ, ఇందులో మళ్లీ చమత్కారం - "ఇంత ఆలస్యమూ టైమూ వుందని తెలిస్తే ఇంకో అరగంట నిద్రపోయే వాణ్ణే'' అని. ఆయనదో కండిషనుంది. భోజనం చెయ్యగానే షూటింగ్‌కి పిలిస్తే - పావుగంటయినా పడుకోవాలంటారు. "ఆ మాత్రం నిద్ర పోకపోతే, ఫ్రెష్‌నెస్ రాదు. నిద్ర మత్తులో డైలాగులు పట్టుబడవు. టేకులు ఓకే కావు. ఫిల్మ్, టైము ఖర్చయిపోతాయి. మీకు అది కావాలా? పావు గంట పాటు నాకు రెస్టు ఇవ్వడం కావాలా? తేల్చుకోండి'' అదీ కండీషను. "అయితే రెస్టు తీసుకోండి'' అన్నది జవాబు. వెంటనే, కూడా తెచ్చుకునే దిండు తలకింద, హోమియోపతి

ఒకసారి ప్రాక్టికల్ జోకు. రాజమండ్రి వెళ్తున్నాం షూటింగ్‌కి. నెల్లూరు స్టేషన్‌లో అల్లు వారు దిగారు. దిగడం ఏమిటి - రైలు ఎక్కేవాళ్లు కూడా మరిచిపోయి, ఆయన చుట్టూ మూగారు. ఆయన వాళ్లు విష్ చేస్తుంటే 'వూఁ వూఁ' అంటూ ప్లాట్‌ఫారం మీద వెతుకుతున్నారు. "ఏమిటి సార్... ఏదైనా పోయిందా?" అని అడుగుతున్నారు ఫాన్సు. "పర్సు... పడి పోయిందండీ.... పర్సు" అని వెతుకుతూ వుంటే బండి కూత వేసింది. "పోన్లెండి - టైమై పోయింది. వస్తా" అని రామలింగయ్య బండెక్కి పోయారు. బండి బయల్దేరింది. వెనక్కి తిరిగి చూడగా, వాళ్లు పర్సుకోసం వెతుకుతున్నారు.

"వూరికే సరదాకి. పర్సూ లేదు. ఏం లేదు. కొంతసేపు వెతుకుతారు. తర్వాత నన్ను తిట్టుకుంటారు. తిట్లూ దీవెనలూ రెండూ తగలాలి ఆర్టిస్టుకి" అని నవ్వారాయన.



హోమియోపతి డాక్టరు కూడా...







హేమా హేమీలతో...



మందుల డబ్బా ఓ పక్కా పెట్టుకొని నిద్రపోవడం అలవాటు. అన్నట్టు ఆయన నవ్వుల డాక్టరే కాదు, హోమియో పతి డాక్టరు కూడా. నటన ప్రాక్టీసుతో పాటు అదో ప్రాక్టీసు. సినిమా వాళ్లు చాలా మంది ఆయనకి పేషెంట్లు. అంచేత ఆ డబ్బాలో మందులు ఆయనకి కావు. ఎవరికి ఏ అవసరం వచ్చినా, చట్టున తీసి ఇవ్వడానికి! అది ఆయన హాబీ.



సామర్థ్యానికి మారుపేరయిన
కుమారుడు అరవింద్‌తో... తెరపై...

అవుడ్డోర్ షూటింగులకో, ఏ ఫంక్షన్‌లకో ఊళ్లు వెళితే, రైల్లో సందడే సందడి. ప్రతి స్టేషన్‌లో నూ దిగుతారు. ప్రజల్తో మాట్లాడతారు. ఆయనకి అది సరదా. కొందరు నటులు, జనానికి కనిపించకుండా కూచుంటారు. అల్లు వారు అలా కాదు. "జనం లోంచి వచ్చిన వాణ్ణి. జనం మెప్పు పొందుతున్న వాణ్ణి. జనంలోకి వెళ్లక పోతే ఎలా?" అని జన మధ్యానికి వెళ్లి సంభాషిస్తారు. ఓ జోక్‌కొట్టి నవ్విస్తారు. "జనం గుర్తు పట్టాలి! రామలింగయ్య రామలింగయ్య అని మూగాలి - అదీ స్టార్‌డమ్" అంటారు ఆయన.

ఆయన షూటింగులో వుంటే సందడే సందడి. పి.పుల్లయ్యగారు ఎప్పుడూ రామలింగయ్య గార్ని గసురుతూనే వుండే వారుగాని, సినిమా మొదలు పెడితే "రామలింగయ్యది ఏం వేషం?" అని ఆలోచించే వారు. అలాగే దుక్కిపాటి మధుసూదనరావు గారు - ఏదో ఒకటి అంటూనే వుంటారు సెట్లో. ఐనా, ఆయనంటే, ఆయన నటనంటే ఎంతో ప్రేమ.

హైదరాబాదు నుంచి మద్రాసు రావాలి. విమానానికి టైమై పోతోంది. అయినా, ఆయన నిదానం ఆయనదే. "అరెరె! పొద్దునే మద్రాసులో షూటింగుంది. స్నానానికి సోపు అయిపోయింది. అక్కడికి వెళితే, అంత ఉదయం షాపులు తియ్యరు గనక, ఇక్కడే ఎక్కడో ఓ సోపు కొనుక్కుని పోదాం" అని, ఓ షాపు దగ్గర కారు ఆపించి, దిగి వెళ్లారు. షాపులో ఇద్దరున్నారు.

"సోపులున్నాయండీ?" అని అడిగారు అల్లు.

"వున్నాయి. ఏ సోపు కావాలి సార్?" అని అడిగాడే కాని, "మీరు రామలింగయ్య గారు కదా" అని గాని, నమస్కారం అని గాని అనలేదని ఆయనకి తెలిసి పోయింది. "పరిశుద్ధమైన ఆంధ్రుడే - నన్ను గుర్తు పట్టకపోవడం ఏమిటి?" అనుకున్నారు మనసులో.

"సెంతాలెంత? సోపు" అన్నారు జనాంతికంగా.

"ఆరు రూపాయిలు".

"ఆరా? ఆరా? అంటే తక్కిన వాళ్ళకో రేటు, మాలాంటి వాళ్లకో రేటా?"

"అదేం లేదు సార్. అందరికీ ఒకే రేటు. ఎక్కడైనా అదే రేటు".

"అయితే, తక్కిన వాళ్లకో రేటు - సినిమా వాళ్లకో రేటా?" అని రెట్టించి అడిగారాయన, తనని తెలుసుకోవాలని.

"లేదు సార్, అందరికీ ఒకే రేటు".

ఇక లాభం లేదని -

"అందరికీ ఒకరేటు - అల్లు రామలింగయ్యకి వేరే రేటా?" అని గట్టిగా అడిగేశారు. తనెవరో తెలుసుకోవయ్యా - అన్నట్టు "లేదుసార్, అందరికీ ఒకే రేటు" అంటున్నాడే గాని, రామలింగయ్య గారు తన షాపుకి వచ్చినందుకు ఆనందపడి పోలేదు.

'సరే తగలెయ్యి' అన్నట్టు మొహం పెట్టి, సబ్బు తీసుకుని కారెక్కారు. "ఇలాంటి వాళ్లు కూడా వుంటారు. వాళ్లకి నేను తెలుసు. తెలియక కాదు. గుర్తు పట్టలేదని అనుకోడానికీ కాదు. వాళ్ల తత్వం అది. అంటే ఎవరొచ్చినా పట్టించుకో రన్నమాట" అని సర్దిచెప్పారు రామ లింగయ్య. ఆయనతో వాళ్లు సంభాషిస్తేనే ఆయనకు సరదా, "ఏమేం సినిమాలు చూశారు? శంకరాభరణంలో నా పాత్ర మీకు ఎలా నచ్చింది?" ఇలాంటి ప్రశ్నలన్నీ అడుగుతారు. ఆ ఛాన్సు పోయిందని బాధ.

సంభాషించకుండానే, సోపు గొడవలో అయిన ఆలస్యానికే - విమానం వెళ్లి పోయింది! బోర్డింగ్ కార్డు తీసుకుని నిరీక్షిస్తున్న ప్రొడక్షన్ మేనేజరు - మాటా మంతీ లేకుండా, విగ్రహంలా నిలబడిన ఆయన్నేమీ అనలేక, "ఇంత ఆలస్యం ఎందుకయిందయ్యా" అని డ్రైవర్‌ని అడిగాడు. డ్రైవరు సోపోపాఖ్యానం అంతా వివరించాడు. "ఆర్రూపాయల సోపు బేరం కోసం ఫ్లయిట్ మిస్ చేయిస్తావా? నువ్వు చెప్పొచ్చుగదా" అని ప్రొ.మే. గద్దించాడు. "నాయనా! ఇతనిమీద ఎగరకు. అక్కడ నాకు ఉదయం షూటింగు. రామారావుగారితో కాంబినేషను. నా మీద వాళ్లంతా విరుచుకు పడతారు. రేపొద్దున్నకి టిక్కట్టు తియ్యి - దణ్ణం పెట్టుకుంటాను. సొమ్ము నేను ఇస్తాను" అన్నారు అల్లు. మొత్తానికి మర్నాటికి స్థిరమైంది.

"పోతే పోయింది గాని, కొత్త సామెత దొరికింది. రాసుకోండి. "సోపుకోసం వెళితే సొమ్ము మొత్తం పోయింది" అని నవ్వారు.

"డబ్బుకి లోకం దాసోహం" సినిమా షూటింగు అవుద్దోరు. క్లైమాక్సు. రామారావు, రంగారావు, పద్మనాభం, సత్యనారాయణ ఇంకా ఎందరో కాంబినేషను. అందరూ హాజరై మేకప్ వేసుకుని, సిద్ధమైనారు. ఏవోవే షాట్లు తీశారు గాని, రంగారావు గారిని పిలవలేదు. "పదకొండయింది. టాప్ లైటు వస్తోంది. షాటుకి పిలవరేం?" అని రంగారావు గారు హుంకరించారు. అసలు విషయం ఆయనకి చెప్పలేదు. చాలా బిజీగా వున్న అల్లురామలింగయ్య ఇంకా రాలేదు! ఎవరిదో షూటింగ్ వాళ్లని రిక్వెస్ట్ చేశారుట. వాళ్లు పదింటికి పంపుతామన్నారు. పంపలేకపోయారు. "రామలింగయ్య గారు రావాలిసార్" అన్నాడు మేనేజర్ నెమ్మదిగా. "రెట్ - రామలింగయ్య కోసం నేను వెయిట్ చెయ్యాలా - నో - వెళ్లిపోతాను. రేపు తీసుకోండి. రేపున్నాడా రామలింగయ్య?" అని లేచారు రంగారావు. "ఉన్నారు సార్, ఇవాళ మాత్రం కొద్దిగా ఆలస్యం...." అని మేనేజరు సణుగుతూ వుంటే - "రేపు పొద్దున రామలింగయ్యని తీసికొచ్చి, నా యింటి దగ్గర నాకు చూపించాలి. అప్పుడుగాని కారెక్కను. ఆఁ" అని ఆ స్క్రీన్ టైగర్ నిష్క్రమించారు.

మర్నాడు రామలింగయ్య గారింటికి కారు వెళ్లింది. తథాలస్యంగా - కారెక్కారు. విషయం చెప్పారు. రంగారావు గారింటికి వెళ్లాలని. "నేనెందుకు వెళ్లాలి? నేనేం నేరం చేశాను? ఆ కంపెనీ వాళ్లు వొదలకపోతే నాదా తప్పు? నేనేదో నేరం చేసిన వాడిలాగా, ఆయన ముందు నిలబడాలా? ఆయనేం సుప్రీం కోర్టు జడ్జియా? ఐజి ఆఫ్ పోలీసా?" అని రామలింగయ్య గారు కార్లో సణుగుతూ వుండగా, కారు రంగారావు గారింటికి వచ్చేసింది. గేటు దాటి,లోపలికి వెళ్లిం ది. పైన డాబా మీద ఆయన నించుని వున్నారు. రామ లింగయ్య టక్కున కారు దిగి, "నమస్కారం - మీరు షూటింగ్ కి వస్తున్నారా? మిమ్మల్ని తీసు కెళ్లాలని వచ్చాను. దిగండి తొందరగా బయ ల్దేరదాం" అని అరిచారు పైకి చూస్తూ. రంగారావు గారు నవ్వి. "ఆఁ - రామలింగయ్య - వచ్చావా- నేను తిడతానని మాట మార్చినట్టున్నావు. ఉండు. ఇద్దరం నా కార్లో వెళదాం" అన్నారు. "అంతేకంటేనా?" అన్నారు గాని, రామలింగయ్య ఆయన కార్లో వెళ్లనన్నారు. "ముందు నా షాట్లు తియ్యాలిట - నేనీ కారోనే ముందుగా వెళ్లిపోతాను. మీరు ఎంత ఆలస్యంగా వచ్చినా మిమ్మల్నేమి అనరు. బలై పోయేది మాలాంటి వాళ్లమేగా" అని సమయోచితంగా మాట్లాడి రంగారావుని నమ్మించి 'అమ్మయ్య' అని బయల్దేరారు.

ఆయనతో పనిచేసిన వాళ్లందరికీ, ఎన్నెన్నో సంఘటనలు - హాస్య సన్నివేశాలు!

ఏదైనా షూటింగులో కలుసుకుంటే - "భరణిలో మీరున్నారా?" లేదా, మరో కంపెనీ యేదో - అడిగేవారు. "లేను" "నేనున్నానే" అని నవ్వు. నేను తిరిగి "త్యాగరాయా ప్రొడక్షన్స్ వాళ్ల సినిమాలో మీరున్నారా?" అని అడిగితే, "మీరు?"

"ఉన్నాను."

"నేను లేనే" అని నవ్వు...

అలాంటి సరదా మనిషి, జోకుల పుట్ట. అందరితోనూ కలిసిమెలిసి సరదాగా గడపడం పెద్ద సరదా. లేకపోతే ఆనాటి నుంచి, ఈనాటి వరకూ ఇన్ని వందల సినిమాలు ఎలా వెయ్యగలిగే వారు?-

దేశంలోని సినిమా హాస్య నటుల్లో మొట్టమొదటిగా 'పద్మశ్రీ' పొందినది - రేలంగి. రెండోసారి పొందినదీ తెలుగు హాస్యనటుడే - అల్లు రామలింగయ్య! ఆయన పుట్టినరోజు అక్టోబరు ఒకటి. "ఒక్కరోజు ఆలస్యంగా పుట్టివుంటే బాగుణ్ను. ఒకటో తేదీన ఎందుకు పుట్టానా అని దిగులు. రెండున పుట్టి వుంటే గాంధీగారిదీ నాదీ ఒకే జన్మదినం అయేది కదా" అనగలగడం - అల్లుకే చెల్లు.ఆయనకు వినయ పూర్వకమైన జన్మదిన శుభాకాంక్షలు!!.

అక్టోబర్ 7 జయంతి సందర్భంగా....

# గండుకోయిల పాడిన ఘజల్ - బేగం అఖ్తర్

భారతీయ సంస్కృతిలో గజల్ ప్రక్రియ బలీయమైన స్థానాన్ని పొందడానికి కారకులైన ముఖ్యులలో "బేగం అఖ్తర్"ని అగ్రగామిగా చెప్పుకోవాలి.

1814 అక్టోబర్ 7న ఉత్తరప్రదేశ్‌లోని ఫైజాబాద్‌లో ప్రజానీకాన్ని రంజించే తవాయిఫ్‌ల ఇంట 'అఖ్తరీబాయ్ ఫైదాబాదీ'గా పుట్టిన "బేగం అఖ్తర్" గానంలోనూ, కథక్ నృత్యంలోనూ శిక్షణ పొందారు. ఉస్తాద్ మహమ్మద్ ఖాన్ (పాటియాలా), ఉస్తాద్ అబ్దుల్ వహీద్‌ఖాన్ (కిరానా ఘరానా)ల వద్ద శాస్త్రీయ సంగీతాన్ని అభ్యసించారు. ఇంకా లక్నో ఘరానాకు చెందిన 'రంజన్‌ఖాన్', పాటియాలా ఘరానాకు చెందిన 'బర్కత్ అలీ'లు సైతం ఆమెకు గురువులే.

అప్పటి ఘజల్ గాయనిగా ప్రసిద్ధిగాంచిన జద్దన్‌బాయి (కలకత్తా)ని అతి తక్కువ కాలం లోనే అధిగమించి అగ్రస్థాయికి చేరుకున్నారామె.

బేగం అఖ్తర్ అప్పుడప్పుడే పైకెదుగుతున్న సమయంలో భూకంప బాధితుల సహాయార్థం కచేరీ చేసి వేలాది రూపాయలను సమకూర్చి పెట్టారు.

సంగీత ప్రపంచానికి బేగం అఖ్తర్ కొన్ని ప్రత్యేకమైన శైలులను ఆపాదించారు. లక్నోఅంగ్‌తుమ్రీ, పంజాబీ, మరియు పూరబీ అంగ్‌లు వాటిలో కొన్ని. గాత్ర సంగీతంలో అక్నో బనారస్ ఘరానాలతో సమానంగా వీటిని ఆమె తీర్చిదిద్దారు.



భారతదేశ 25వ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా న్యూఢిల్లీ సప్రూహౌజ్ హాల్‌లో స్వాతంత్ర్య వేడుకల్లో భాగంగా బేగం అఖ్తర్ కార్యక్రమం ఏర్పాటయింది. ఓ గంట నిడివిలో పూర్తి కావలసిన ఆ కార్యక్రమం ఆ అర్థరాత్రి దాకా అఖ్తర్ ఘజల్ గాన ప్రవాహం ఆగకుండా కొనసాగుతూనే ఉండి పోయింది. ఆమె కళా జీవితంలో ఇలాంటి సందర్భాలెన్నో ఉన్నాయి.

బేగం అఖ్తర్ స్వరమే కాదు, రూపం కూడా అందంగా ఉంటుంది. అందుకే సినీ సీమ ఆమె నటగాన ప్రతిభలను తెరకెక్కించింది. నటిగా మెహబూబ్ ఖాన్ 'రోటి' (1942), సత్యజిత్ రాయ్ 'జల్సాఘర్' (1958) వంటి అరడజను చిత్రాల్లో నటించి, కొన్ని చిత్రాల్లో నేపథ్య గానం చేశారు. ఆకాశవాణిలో ఘజల్స్ పాడారు. ఎన్నో రికార్డులు గ్రామఫోన్, హెచ్.ఎం.వి. వారికి పాడారు. వీటిలో గజల్స్ మాత్రమే గాక లలిత సంగీతం, దాద్రా, టుమ్రీ, నాత్, భజన్, హోరి, సావన్, కజ్రీ, చైతీ, గీత్ వంటి ప్రక్రియలను కూడా పాడారామె.

కాల్పనిక, ఊహాశక్తి బేగం అక్తర్ స్వంతం. దానికితోడు గొప్ప పాండిత్యం. సాహిత్య విలువలను ఎదిగి వాటి భావాలను జీర్ణించుకుని సున్నితమైన శైలిలో పాడటం ఆమెలోని ప్రత్యేకత.

దాదాపు నాలుగున్నర దశాబ్దాల పాటు భారతీయ సంప్రదాయ సంగీతకళకు గజల్ ద్వారా విశేషమైన ప్రాచుర్యం కల్పించి తన అరవయవ ఏట 1974 అక్టోబర్ 30న తన యానాన్ని ముగించారు. ఆ స్వరం మూగబోయి సుమారు మూడు దశాబ్దాలు కావస్తున్నా సంగీతాభిమానులకు ఇప్పటికీ నిత్యనూతనమే.

-పద్మజారాయ్

**చిత్రం: మనుషులంతా ఒక్కటే** | రచన: కొసరాజు
సంగీతం: యస్.రాజేశ్వరరావు | గానం: ఎస్పీ బాలు, పి.సుశీల

అ : ముత్యాలు వస్తావా అడిగింది ఇస్తావా ॥ముత్యాలు॥
ఊర్వశిలా ఇటు రావే వయ్యారీ....
ఆ : లాలా లరలరలా ॥ముత్యాలు॥
చలమయ్యా వస్తాను ఆ పైన చూస్తాను ॥చలమయ్య॥
తొందరపడితే లాభం లేదోయ్
అ : ఊ... ఊ... ఊ... ఉ ఊ... ఊ....
అ : నీ జారుపైటా
ఆ : ఊఁ?
అ : ఊరిస్తూవుంది
ఆ : ఊ హూఁ
అ : నీ కొంటె చూపు
ఆ : ఛీ
అ : కొరికేస్తూ వుంది
నీ జారుపైటా.... ఊరిస్తూ వుంది... అబ్బా
నీ కొంటె చూపు కొరికేస్తూ వుంది
కన్నూకన్నూ ఎప్పుడో కలిపిందీ... ఆ హాహా.... ఓహోహోహో
ఆ : అయ్యో... ఏందయ్యా గోలా
ఆ : ఊఁ
ఆ : సిగ్గేమిలేదా?
అ : నాకెందుకూ?
ఆ : ఊరోళ్ళు ఇంటే ఎగతాళి కాదా
ఏందయ్యాగోలా.... ఛీ ఛీ
సిగ్గేమిలేదా
అ : పోదూ బడాయీ
ఆ : ఊరోళ్ళు ఇంటే ఎగతాళి కదా
నిన్నూ నన్నూ చూస్తే నామరదా
ఆహాహో ఓహోహో ఊహుహు
అ : ॥ముత్యాలు॥
అ : పర్మినెంటుగానూ
ఆ : ఆఁ!
అ : నిన్ను చేసుకుంటానూ
ఆ : అబ్బో
అ : ఉన్నదంతా ఇచ్చేసి
ఆ : అయ్యో
అ : నిన్ను చూసుకుంటాను
ఇంటా బైటా పట్టుకునుంటాను
హోహో హు ఆహాహా ఏహేహేహే
ఆ : ఏరుదాటి పొయ్యాకా... తెప్ప తగలవేస్తేనూ
అ : అమ్మామ్మామ్మా
ఆ : ఊరంతా తెలిశాక వొదిలి పెట్టిపోతేనూ
బండకేసి నిను బాదేస్తానయ్యా
హోహో ఓహోహో ఆహాహాహా
రేవులోన నిను ముంచేస్తా నయ్యో హోం
ఆహాహా ఊహో ఓహ్
అ : ॥ముత్యాలు॥

**చిత్రం: తిరపతి** | రచన: దాసం గోపాలకృష్ణ
సంగీతం:చక్రవర్తి | గానం:అల్లు రామలింగయ్య, యస్.జానకి

అ : దేశం పన్నెండుసార్లు ... దేశం పన్నెండుసార్లు... నారాయణమ్మో
నే సుట్టు తిరిగి వచ్చేనే... నారాయణమ్మా
నను పొమ్మనక రమ్మనవే...
నారయ... నారయ.... నారయణమ్మా
ఆ : దేశం పన్నెండుసార్లు...దేశం పన్నెండుసార్లు...
నాయుడు బావోయ్
నువు సుట్టు తిరిగి వస్తేనూ ... నాయుడు బావోయ్
అహ నాకేమీ ఒరిగింది... నాయుడు...
నాయుడు... నాయుడు బావోయ్ ॥దేశం॥
అ : అందాల మందారం... అందాల మందారం...
అందాల మందారం... నారయణమ్మోయ్
నువ్వు ఆమ్మామ్మా అంటీయ్యే (2) నారయణమ్మ
ఆ : పట్టుబట్టి తెచ్చావు నాయుడు బావోయ్
నువ్వు పట్టుబట్టి తెచ్చావునాయుడు బావోయ్
ఏమి చేయదలచావు నాయుడు బావోయ్
నన్నేమి చేయదలచావు నాయుడు బావో
అ : సెన్నపట్నం తిప్పుకొస్తా నారయణమ్మోయ్
నిను సెన్నపట్నం తిప్పుకొస్తా నారయణమ్మోయ్
నీకు సరదాలు.... హోయ్ సరదాలు... హోయ్ సరదాలు
సూపెడతా... నారయణమ్మోయ్
అ : అడ్డాలోరమ్మాయ్‌ని నాయుడు బావోయ్
నేనడ్డాలోరమ్మాయ్‌ని నాయుడు బావోయ్
నే సెడ్డపనులు... సెడ్డపనులు...
సెడ్డపనులు సేయనోయీ నాయుడు బావా
అ : ఆఁ.... నువ్వుఅడ్డాలోరమ్మాయ్‌వా?
ఆ : ఊఁ
అ : అడ్డాలోరమ్మాయ్‌వా నారయణమ్మోయ్
నువు అడ్డాలోరమ్మాయ్‌వా నారయణమ్మోయ్
నువు తికమకలు తగ్గించి నారయణమ్మా
నాకు కితకితలు కలిగిస్తే నారయణమ్మా
నిన్నూ నిన్నూ... సినిమాలో చేరిపిస్తా నారయణమ్మా
నిను సినిమాలో చేరిపిస్తా నారయణమ్మా

అచ్చం తనలాగే పాడే బాలు అంటే అల్లురామలింగయ్య గారికి ప్రత్యేకమైన అభిమానం. ఓ రోజు సందేహం వచ్చి "బాలూ... నేను మరీ అంత ముక్కుతో పాడతానంటావా!?" అని అడిగారటాయన. దానికి బాలూ "డ్రమెటైజేషన్ కోసం కొంత చెయ్యక తప్పదు కదండీ... మీ వాయిస్‌కి దగ్గరగా రావటం కోసం అలా పాడతానంతే... ఎక్కడైనా చెడగొట్టినట్టు అనిపించిందా?" అని అన్నారట. "అమ్మమ్మ... చాలా బావుందయ్య... పుట్టినే అడిగానంతే!" అంటూ మరింత ప్రోత్సహించారట అల్లు.

అభినయ హాస్యానికి అభినవ దర్పణం పట్టిన

## పద్మశ్రీ అల్లు రామలింగయ్య

పుట్టినరోజు (అక్టోబరు 1)ని పురస్కరించుకుని హాస్యాభిమానులందరి తరపున అభినందనలతో...

హాసం



